భక్తి TV

# ఆనంద సిద్ధి

వనిత TV Vision of Women

## శ్రీ హేమలంబ నామ సంవత్సర

# గంటల పంచాంగము

భారత ప్రభుత్వ సమ్మత దృగ్గణితం

**2017-18**

అనేక శుభముహూర్తములు, సంఖ్యాశాస్త్ర ప్రకారం రెమిడీస్ కలవు



ప్రత్యంగిర ఉపాసనరత్న


**బ్రహ్మశ్రీ వై.వి.శాస్త్రి**

శ్రీదేవీకామేశ్వరీ శ్రీచక్ర పీఠము

హైదరాబాద్


వెల: 63-00

ఆనంద సిద్ధి గంటల పంచాంగము

శ్రీరస్తు　　శుభమస్తు　　కల్యాణమస్తు

శ్రీ ప్రత్యంగిరా దేవ్యై నమః

**అనేక శుభముహూర్తములు కలిగిన....ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాలలో దుర్ముఖినామ సం॥ పంచాంగం మొట్టమొదటిగా ప్రచురించబడిన తెలుగు పంచాంగం**

# 2017 ఆనందసిద్ధి 2018

# శ్రీ హేమలంబ నామ సంవత్సర గంటల పంచాంగము



**శ్రీ దేవీకామేశ్వరీ శ్రీ చక్రపీఠమ్**

ప్రత్యంగిరా ఉపాసనరత్న; శతాధిక ప్రత్యంగిరా హోమ క్రతు బ్రహ్మ, దశమహావిద్యాధర

**బ్రహ్మశ్రీ వై.వి.శాస్త్రి**

**ఇంటినెం. బి-20 రోడ్ నెం. 10, రామంతపూర్,**

**టెలివిజన్ కాలనీ హైద్రాబాద్ - 13.**

**ఫోన్ నెం.** 9493800899, 9347422299, 9490254018

# విషయసూచిక



**విన్నపము : ఈ దృక్సిద్ధాంత పంచాంగము ఆంధ్రప్రదేశ్‌లోని రాజమండ్రి పట్టణమునకు చేయబడినది. ఇందలి లగ్న ప్రమాణములు వర్జ్య, దుర్ముహూర్తములు, తిథ్యాదులు, అన్నియు రాజమండ్రికి మాత్రమే సరిపోవును. ఇతర ప్రాంతాలవారు సంస్కార పట్టికను చూసుకొని ఆయా ప్రదేశకాలమును నిర్ణయించు కోగలరు.**

## ఆంధ్రప్రదేశ్‌లోఉన్న దృక్సిద్ధాంత పంచాంగ కర్తలకు కృతజ్ఞతలతో...

1. శ్రీ పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి (పిడపర్తి పంచాంగం) -పొడగట్లపల్లి
2. శ్రీ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ (కాలచక్రం, గ్రహభూమి పంచాంగాలు)-హైదరాబాద్
3. శ్రీ గుడి సోమనాథ శర్మ (ఆంధ్రభూమి పంచాంగం) -హైదరాబాద్
4. శ్రీ గోరస వీరభద్రాచార్యులు సన్ -హైదరాబాద్
5. శ్రీ హనుమంతవఝుల సుబ్రహ్మణ్యశర్మ -పెద్దాపురం
6. శ్రీ బిజుమళ్ల బిందుమాధవ శర్మ -హైదరాబాద్
7. శ్రీ ములుగు రామలింగేశ్వర వరప్రసాద్ (శుభతిథిపంచాంగం)-హైదరాబాద్
8. డాక్టర్ వి.బి.యన్.శర్మ -వరంగల్
9. చిరంజీవి నందినీ గార్గేయ (శ్రీచక్ర పురోహితపంచాంగం) -హైదరాబాద్
10. శ్రీ బిట్రా కోటేశ్వరరావు -వేటపాలెం
11. శ్రీ యుగంధర్ సిద్ధాంతి -హన్మకొండ
12. శ్రీ గొర్తి మాచర సుబ్రహ్మణ్య పట్టాభిశాస్త్రి -అమలాపురం
13. శ్రీ ద్విభాష్యం సుబ్రహ్మణ్య శర్మ -అన్నవరం
14. శ్రీ నిత్య నిర్మలానంద యోగేశ్వర సిద్ధాంతి -వరంగల్
15. శ్రీ మేడికొండూరు విశ్వనాథ ప్రసాద్ -హైదరాబాద్
16. శ్రీ పళ్ళావఝుల శ్రీరామకృష్ణశర్మ -తాడేపల్లిగూడెం
17. శ్రీ పిచ్చుక గిరిరాజ సిద్ధాంతి -పెద్దాపురం
18. డాక్టర్ సోమవరపు రామలింగయ్య -నల్గొండ
19. శ్రీ శిష్ట్లా ఉమామహేశ్వరశర్మ -శ్రీకాకుళం
20. శ్రీ ఉపద్రష్ట కృష్ణమూర్తి -అమలాపురం
21. శ్రీ కారుపర్తి నాగమల్లేశ్వరరావు -పుల్లేటికుర్రు
22. శ్రీ కారుపర్తి చంద్రరావు -జగ్గన్నపేట
23. శ్రీ అనపర్తి కృష్ణశర్మ -హైదరాబాద్
24. శ్రీ చిత్రాల గురుమూర్తి గుప్తా (గుప్తాపంచాంగం) -అనంతపురం
25. శ్రీ వేములు శ్రీహరిచౌదరి - తెనాలి
26. శ్రీ కుప్పా ఆంజనేయశాస్త్రి - హైదరాబాద్
27. శ్రీ పెద్దింటి సూర్యనారాయణమూర్తి - సత్తుపల్లి
28. శ్రీ శంకరమంచి రామకృష్ణశాస్త్రి -హైదరాబాదు
29. శ్రీ ఆలూరు ఆంజనేయశర్మ -కాణిపాకం
30. శ్రీ చిలకమర్తి ప్రభాకరచక్రవర్తిశర్మ -బెంగుళూరు
31. శ్రీ మేర్గు ఆంజనేయసిద్ధాంతి -సిరిసిల్ల
32. శ్రీ కాలెపు భీమేశ్వరరావు సిద్ధాంతి -బండారులంక

---

పండుగలు పర్వదినాలలో విభేదాలు లేకుండా యావత్ పంచాంగకర్తలందరూ ఒకే సిద్ధాంత ప్రకారం గణితసాధన చేసి సమాజశ్రేయస్సును కలిగించాలని కోరుచున్నాము. దీనికి సరియైన మార్గం దృక్సిద్ధాంత గణితమే. - మీ వై.వి.శాస్త్రి.

## ప్రతి నిత్యము పఠించదగిన ప్రార్థనలు

విఘ్నేశ్వర ధ్యానము

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోప శాంతయే ॥

శ్లో॥ వాగీశాద్యా స్సుమనసః సర్వార్థానా ముపక్రమే ।
యం నత్వా కృత కృత్యాస్యుః తం నమామి గజాననమ్ ॥



### శ్రీ నవగ్రహ స్తోత్ర రత్నములు

శ్లో॥ జపాకుసుమ సంకాశం । కాశ్యపేయం మహాద్యుతిం
తమోరిం సర్వపాపఘ్నం । ప్రణతోస్మి దివాకరం
రుద్రాభిషేకం-జపసంఖ్య 6 వేలు దానం-గోధుమలు, సువర్ణం

శ్లో॥ దధిశంఖ తుషారాభం । క్షీరోదార్ణవ సంభవం
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం
దుర్గాపూజ-జపసంఖ్య 10 వేలు దానం-బియ్యం-వస్త్రం-వెండి

శ్లో॥ ధరణీగర్భ సంభూతం । విద్యుత్కాంచన సన్నిభం
కుమారం శక్తిహస్తం చ।మంగళం ప్రణమామ్యహమ్।
సుబ్రహ్మణ్య పూజ జపసంఖ్య 7 వేలు దానం - కందులు

శ్లో॥ ప్రియంగు కళికాశ్యామం । రూపేణ ప్రతిమం బుధం
సౌమ్యం సత్వగుణోపేతం తం బుధం ప్రణమామ్యహం
శ్రీ మహావిష్ణు పూజ - జపసంఖ్య 17 వేలు దానం - పెసలు

శ్లో॥ దేవానాం చ ఋషీణాం చ । గురుం కాంచన సన్నిభం
బుద్ధిమంతం త్రిలోకేశం।తం నమామి బృహస్పతిం
నమకపారాయణ - జపసంఖ్య 16 వేలు దానం - శనగలు.

శ్లో॥ హిమకుంద మృణాలాభం । దైత్యానాం పరమం గురుం।
సర్వశాస్త్ర ప్రవక్తారం । భార్గవం ప్రణమామ్యహం.
మహాలక్ష్మి పూజ - జపం 20 వేలు దానం - బొబ్బర్లు.

శ్లో॥ నీలాంజన సమాభాసం । రవిపుత్రం యమాగ్రజం
ఛాయా మార్తాండ సంభూతం । తం నమామి శనైశ్చరం
ఈశ్వరాభిషేకం - జపం 19 వేలు. దానం-నువ్వులు-తైలం.

శ్లో॥ అర్ధకాయం మహావీరం । చంద్రాదిత్యాది మర్దనం
సింహికాగర్భ సంభూతం । రాహుం తం ప్రణమామ్యహం.
దుర్గాపూజ - జపం 18 వేలు. దానం - మినుములు.

శ్లో॥ ఫలాశ పుష్ప సంకాశం । తారకాగ్రహ మస్తకం
రౌద్రం రుద్రాత్మజం ఘోరం తం కేతుం ప్రణమామ్యహం
సూర్యనమస్కారం - జపం 7 వేలు. దానం - ఉలవలు.

# ఏకదంత శరణాగతి స్తోత్రము

శ్లో॥ సద్మాత రూపం సకలాది భూతం, అమాయినం సోఽ హమచింత్య బోధం
అనాది మధ్యాంతవిహీన మేకం, తమేక దంతం శరణం ప్రజామః॥ 1
అనంత చిద్రూపమయం గణేశ, మభేద భేదాది విహీన మాద్యం ।
హృది ప్రకాశస్య ధరం స్వధీస్థం, తమేక దంతం శరణం ప్రజామః॥ 2
సమాధి సంస్థం హృదియోగినాం యం, ప్రకాశరూపేణ విభాతమేతం ।
సదా నిరాలంబ సమాధిగమ్యం, తమేక దంతం శరణం ప్రజామః॥ 3
స్వబింబ భావేన విలాసయుక్తాం, ప్రత్యక్షమాయాం వివిధ స్వరూపాం ।
స్వవీర్యకం తత్ర దదాతి యోవై, తమేక దంతం శరణం ప్రజామః॥ 4
త్వదీయ వీర్యేణ సమర్థభూత, స్వమాయయా సంరచితం చ విశ్వం ।
తురీయకం హ్యాత్మ ప్రతీతి సంజ్ఞం, తమేక దంతం శరణం ప్రజామః॥ 5
త్వదీయ సత్తాధర మేకదంతం, గుణేశ్వరం యం గుణబోధితారం ।
భజంత మత్యంత మజం త్రిసంస్థం, తమేకదంతం శరణం ప్రజామః॥ 6
తతస్త్వయా ప్రేరితనాదకేన, సుషుప్తి సంజ్ఞం రచితం జగద్వై ।
సమస్వరూప హ్యుభయత్ర సంస్థం, తమేక దంతం శరణం ప్రజామః॥ 7
తదేవ విశ్వం కృపయా ప్రభూతం, ద్విభావమాదౌ తమసా విభాంతం ।
అనేకరూపం చ తథైక భూతం, తమేక దంతం శరణం ప్రజామః॥ 8
తతస్త్వయా ప్రేరితకేన సృష్టం, బభూవ సూక్ష్మం జగదేక సంస్థం ।
సుసాత్త్వికం స్వప్నమనంతమాద్యం, తమేకదంతం శరణం ప్రజామః॥ 9
తదేవ స్వప్నం తపసా గణేశ, సుసిద్ధరూపం వివిధం బభూవ ।
సదైక రూపం కృపయాచ తేద్య, తమేకదంతం శరణం ప్రజామః॥ 10
త్వదాజ్ఞయా తేన త్వయా హృదిస్థం, తథా సుస్పష్టం జగదంశరూపం
విభిన్న జాగ్రన్మయ మప్రమేయం, తమేకదంతం, శరణం ప్రజామః॥ 11
తదేవ జాగ్రద్రజసా విభాంతం, విలోకితం త్వత్కృపయా స్మృతేన।
బభూవ భిన్నం చ సదైకరూపం, తమేకదంతం శరణం ప్రజామః॥ 12
సదేవ సృష్ట్వా ప్రకృతి స్వభావా త్తదంతరే త్వంచ విభాసి నిత్యం ।
ధియః ప్రదాతా గణనాథ ఏక, స్తమేకదంతం శరణం ప్రజామః॥ 13
త్వదాజ్ఞయా భాంతి గ్రహాశ్చ సర్వే, ప్రకాశరూపాణి విభాంతిఖే వై
భ్రమంతి నిత్యం స్వ విహారకార్యాః, తమేక దంతం శరణం ప్రజామః॥ 14
త్వదాజ్ఞయా సృష్టికరో విధాతా, త్వదాజ్ఞయా పాలక ఏవ విష్ణుః
త్వదాజ్ఞయా సంహారకో హరోపి, తమేకదంతం శరణం ప్రజామః॥ 16
యదాజ్ఞయా దేవగణా దివిస్థా, దదంతివై కర్మఫలాని నిత్యం ।
యదాజ్ఞయా శైలగణాః స్థిరావై, తమేకదంతం శరణం ప్రజామః॥ 17
యదాజ్ఞయా శేషః ధరాధరావై, యదాజ్ఞయా మోహ ప్రదశ్చకామః
యదాజ్ఞయా కాధరో అర్యమా చ, తమేకదంతం శరణం ప్రజామః॥ 18
యదాజ్ఞయా వాతి విభాతి వాయుః, యదాజ్ఞయాగ్నిః జఠరాది సంస్థః
యదాజ్ఞయేదం చరాచరం చ, తమేకదంతం శరణం ప్రజామః॥ 19
యదంతరే సంస్థితమేకదంతః, తదాజ్ఞయా సర్వమిదం విభాతి



అనంతరూపం హృది బోధకం యః, తమేకదంతం శరణం ప్రజామః॥ 20
సుయోగినో యోగబలేన సాధ్యం, ప్రకుర్వతే కఃస్తవనేన స్తౌతి
అతః ప్రణామేన సుసిద్ధిస్తు, తమేకదంతం శరణం ప్రజామః॥ 21

ఇది ముద్గల పురాణే ఏకదంత శరణాగతి స్తోత్రం సంపూర్ణం

ఈ ఏకదంత శరణాగతి స్తోత్రము, అత్యంత ప్రభావము కలది. దీనిని ప్రతి దినము 21సార్లు చొప్పున 21 రోజులు పఠించిన సర్వత్ర విజయములు కలుగునని చెప్పబడినది. గణపతిపూజ జపముల అంతమున ఈ స్తోత్రమును పఠించుట వలన త్వరగా ఇష్టసిద్ధి కలుగును. ప్రతిదినము దీనిని పఠించిన బ్రహ్మీ భావస్థితిని సాధ కుడు పొందునని చెప్పబడినది.

## మానసాదేవి స్తోత్రము

దేవీం త్వం స్తోతుమిచ్ఛామి సా వీణాం ప్రవరం పరామ్।
పరాత్పరం చ పరమాం నహి స్తోతుం క్షయోధునా ॥
స్తోత్రాణాం లక్షణం వేదే స్వభావాఖ్యానతః పరమ్ ।
న క్షమః ప్రకృతిం వక్తుం గుణానాం తవ సువ్రతే ॥
శుద్ధసత్వస్వరూపా త్వం కోపహింసావివర్జితా ।
నచ శప్తో మునిస్తేన త్యక్తయా చ త్వయా యతః॥
త్వం మయా పూజితా సా వీ జననీ చ యథాదితిః॥
దయారూపా చ భగినీ క్షమారూపా యథా ప్రసూః॥
త్వయా మే రక్షితాః ప్రాణాః పుత్రద్వారాః సురేశ్వరీ ।
అహం కరోమి త్వం పూజ్యాం మమ ప్రీతిశ్చ వర్ధతే॥
నిత్యం యధాపి పూజ్యా త్వం భవేత్య జగదంబికే ।
తథాపి తవ పూజాం వై వర్ధయామి పునః పునః॥
యే త్వామాషాఢా సంక్రాంత్యం పూజయిష్యంతి భక్తితః॥
పంచమ్యాం మనసాఖ్యాయం మాసాంతే వా దినేదినే ॥
పుత్రపౌత్రో దయస్తేషాం వర్ధంతే చ ధనాని చ।
యశస్వినః కీర్తిమంతే విద్యావంతే గుణాన్వితాః॥
యే త్వం న పూజయిష్యంతి నిందత్యజ్ఞానతో జనాః।
లక్ష్మి హీన భవిష్యంతి తేషాం నాగభ్యం సదా ।
త్వం స్వర్గలక్ష్మీః స్వర్గో చ వైకుంఠే కమలాకలా॥
నారాయణాంశో భగవాన్ జరత్కారుర్మునీశ్వరాః।
తపసా తేజసా త్వాం చ మనసా సస్పృజే పితా ॥
అస్మాకాం రక్షణాయేవ తేన త్వం మనసాభిధా ।
మనసా దేవితుం శక్తా చాత్మనా సిద్ధయోగినీ ।
తేన త్వం మనసాదేవి పూజితా వందితా భవే ॥
యాం భక్త్యా మనసా దేవాః పూజ్యంత్యనిశం భృశమ్ ।
తేన త్వ మనసాదేవీం ప్రవదంతి పురావిదః॥
సత్వరూప చ దేవీత్వం శశ్వత్సర్వాన షేవయా ।
యో హి యదభావయేన్నిత్యం శతం ప్రాప్నోతి తత్సమమ్ ॥
ఇదం స్తోత్రం పుణ్యబీజం తాం సంపూజ్యం చ యఃపఠేత్ ।

నస్య నాగభయం నాస్తి తస్య వంసోద్భవస్య చ ॥
విషం భవేత్సుధాతుల్యం సిద్ధస్తోత్రం యదాపఠేత్ ।
పంచలక్షజపేనైవ సిద్ధ స్తోత్రో భవేన్నరః
సర్పశాయి భవేత్సోపి నిశ్చితం సర్పవాహనః॥

ఇతి శ్రీ బ్రహ్మవైవర్తపురాణే మహేంద్రకృతం మనసాస్తోత్రం సంపూర్ణం

## ధనుంజయ కృత దుర్గా స్తోత్రమ్

అర్జునః॥ నమస్తే సిద్ధసేనాని అర్యేమందారవాసిని కుమారీకాళికాపాలి కపిలేకృష్ణపింగళే॥ భద్రకాళి నమస్తుభ్యం మహాకాళీ నమోస్తుతే - చండీ చండేనమస్తుభ్యం తారిణీ పరవర్ణనీ కాత్యాయనీ మహాభాగే - కరాళీ విజయే జయే॥ శిఖిపింఛధ్వజధరే- నానాభరణ భూషితే- అట్టశూలప్రహరణే- ఖడ్గఖేటకధారిణి - గోపేంద్రస్యానుజే జ్యేష్ఠే-నందగోపకులోద్భవే ॥ మహిషా సృక్ప్రియేనిత్యం-కౌశికీపీతవాసినీ - అట్టహాసేశోకముఖే- నమస్తేస్తు రణప్రియే॥ ఉమే శాకంభరీశ్వేతే-కృష్ణేకైటభనాశినీ హిరణ్యాక్షి విరూపాక్షి ధూమ్రాక్షిచనమోస్తుతే॥ వేదశృతిమహాపుణ్యే బ్రహ్మణ్యేజాతవేదసి- జంబూ కటకచైత్యేషు నిత్యంసన్నిహితాలయే॥ త్వంబ్రహ్మ విద్యా విద్యానాం- మహా నిద్రాచదేహినాం స్కందమాతర్భగవతీ-దుర్గేకాంతారవాసినీ॥ స్వాహా కారః స్వధాచైవ- కళాకాష్టా సరస్వతీ-సావిత్రీవేదమాతా చ తథా వేదాంత ఉచ్యతే॥ స్తుతాపిత్వంమహాదేవి- విశుద్ధేనాంతరాత్మనా-జయోభవతు మే నిత్యం త్వత్ప్రసాదాద్రణాజిరే॥ కాంతారభయదుర్గేషు- భక్తానాం పాలనేషుచ నిత్యంవనసిపాతాళే- యుద్ధేజయసి దానవాన్ ॥ త్వం జంభు మోహినీచ మాయా హ్రీళ్ళస్తథైవచ-సంధ్యా ప్రభావతీచవ - సావిత్రీజననీతథా॥ తుష్టిః పుష్టిధృతిర్దీప్తి శ్చంద్రాదిత్య వివర్ధినీ-భూతిధూతిమతాంఖ్యే వీక్ష్యనేసిద్ధ చారణైః ॥ఇతి స్తోత్రం॥

## ఇంద్రకృత లక్ష్మీస్తుతి

పురందర ఉవాచ :

శ్లో॥ నమః కమలవాసిన్యై నారాయణ్యై నమోనమః
కృష్ణప్రియాయై సతతం మహాలక్ష్మ్యై నమో నమః॥ 1
పద్మపత్రేక్షణాయై చ పద్మాసాయై నమోనమః
పద్మాసనాయై పద్మిన్యై వైష్ణవ్యై చ నమోనమః॥ 2
సర్వ సంపత్స్వరూపిణ్యై సర్వారాధ్యై నమోనమః
హరిభక్తి ప్రదాన్యై చ హర్షదాత్ర్యై నమోనమః॥ 3
కృష్ణ వక్షః స్థితాయై చ కృష్ణశాయై నమోనమః
చంద్రశోభా స్వరూపాయై రత్న పద్మేచ శోభనే ॥ 4
సంపత్యధిష్ఠాతృ దేవ్యై మహాదేవ్యై నమోనమః
నమో వృద్ధి స్వరూపాయై వృద్ధిదాయై నమోనమః॥ 5
వైకుంఠే యా మహాలక్ష్మ్మీ యా లక్ష్మ్మీ క్షీరసాగరే
స్వర్గలక్ష్మ్మీ ఇంద్ర గేహే రాజ్యలక్ష్మ్మీ నృపాలయే ॥ 6
గృహలక్ష్మ్మీ శ్చ గృహిణాం గేహే చ గృహ దేవతా
సురభిః సాగరే జాతా దక్షిణా యత్ర కామినీ॥ 7
అదితిః దేవమాతా త్వం కమలా కమలాలయే
స్వాహా త్వం చ హవిర్దానే కవ్యదానే స్వధా స్మృతా॥ 8
త్వం హి విష్ణు స్వరూపా చ సర్వాధారా వసుంధరా

శుద్ధసత్త్వ స్వరూపా త్వం నారాయణ పరాయణా ॥ 9
క్రోధ హింసా వర్జితా చ వరదా శారదా శుభా
పరమార్థప్రదా త్వం చ హరిదాస్య ప్రదా వరా॥ 10
యయా వినా జగత్సర్వం భస్మీభూత మసారకం
జీవన్మృతం చ విశ్వం న శశ్వత్సర్వం యయా వినా॥ 11
సర్వేషాం చ పరా మాతా సర్వ బాంధవ రూపిణీ
ధర్మార్థకామ మోక్షాణాం త్వం చ కారణ రూపిణీ ॥ 12
యదా మాతా స్తవాంధానాం శిశూనాం శైశవే సదా
తథా త్వం సర్వదా మాతా సర్వేషాం సర్వ రూపతః॥ 13
మాతృహీనః స్తనాంథస్తు స చ జీవతి దైవతః
త్వయా హీనో జనః కోపి న జీవత్యేవ నిశ్చితం ॥ 14
సుప్రసన్న స్వరూపా త్వం మాం ప్రసన్నా భవాంబికే
వైరిగ్రస్తం చ విషయం దేహి మహ్యం సనాతని ॥ 15
అహం యావత్ త్వయా హీనో బంధు హీనశ్చ భిక్షుకః
సర్వ సంపద్వి హీనశ్చ తావ దేవ హరిప్రియే॥ 16
జ్ఞానం దేహి చ ధర్మాం చ సర్వ సౌభాగ్య మీప్సితం
ప్రభావం చ ప్రతాపం చ సర్వాధికారమేవ చ ॥ 17
జయం పరాక్రమం యుద్ధే పరమైశ్వర్య మేవ చ
ఇదం స్తోత్రం మహాపుణ్యం త్రిసంధ్యం యః పఠేన్నరః॥ 18
కుబేర తుల్యః స భవేత్ రాజ రాజేశ్వరో మహాన్
పంచలక్ష జపే నైవ స్తోత్ర సిద్ధిర్భవే న్నృణాం ॥ 19
సిద్ధ స్తోత్రం యః పఠేత్ మాస మేకం తు సంతతం
మహా సుఖీ రాజేంద్రో భవిష్యతి న సంశయః॥ 20

ఇతి దేవీ భాగవతే మహాలక్ష్మీ స్తోత్రం సంపూర్ణం

## శ్రీ రాహు పంచవింశతి స్తోత్రం

ఈ స్తోత్రం రాహువు యొక్క 25 పేర్లుతో కూడినది. రాహు దోషముతో బాధపడేవారు మరియు అనేక సమస్యలు, రుగ్మతలతో వేదన చెందేవారు రాత్రి 9 గంటలు దాటిన తరువాత తలస్నానం చేసి మీ దేవుని మందిరంలో కూర్చుని ఈ రాహు పంచవింశతిని 22సార్లు పారాయణ చేసినట్లయితే మీ మీ సమస్యలకు త్వరిత గతినమార్గం సుగమమం అగును.

రాహుర్దానవ మంత్రిచ సింహికా చిత్తానంద ।
అర్థకాయ సదాక్రోధి చంద్రాదిత్య విమర్ధనా ॥
రౌద్రో రుద్రప్రియో దైత్య స్వభానుర్భానుర్ భీతిదా ।
గ్రహరాజా సుధాపాయి రాకాతిష్యాభిలాషుకా ॥
కాలదృష్టి కాలరూప శ్రీకంఠ హృదయాశ్రయా ।
విదంతుదా సింహికాయో ఘోరరూపో మహాబలా ॥
గ్రహపీడకరో ద్రాంష్ట్రికర్తనేత్రో మదోదరా ।
పంచవింశతి నామాని సృత్వా రాహుం సదానరః॥

ఫలశ్రుతి :

యఃపఠేత్ మహతిపీడా తస్య నాశయతి కేవలం ।
ఆరోగ్యం పుత్రం తులం శ్రీయం ధాన్యం పశుంతథా ॥
దదతి రాహుతస్మై రహపఠేత్ స్తోత్రం ఉత్తమం ।
సతతం పఠేత్ యస్తు జీవత్ వర్షం శతం నరః॥

## బ్రహ్మకృత నిద్రాదేవీ స్తుతి

సనాభికములే విష్ణోః విష్ణో బ్రహ్మ ప్రజాపతిః
దృష్ట్వా తా వసురౌ చోగ్రౌ ప్రసుప్తంచ జనార్ధనం॥ 1
తుష్టావ యోగనిద్రాం తాం ఏకాగ్ర హృదయ స్థితః
ప్రబోధనార్ధాయ హరేః హరినేత్ర కృతాలయాంః॥ 2
విశ్వేశ్వరీం జగద్ధాత్రీం స్థితి సంహారకారిణీం
స్తౌమి నిద్రాం భగవతీం విష్ణో రతులాం తేజసః ప్రభుః॥ 3
త్వం స్వాహా త్వం స్వధా త్వం హి వషట్కారః స్వరాత్మికా
సుధాత్వ మక్షరే నిత్యే త్రిధామాత్రాత్మికా స్థితా ॥ 4
అర్ధమాత్రా స్థితా నిత్యా యానుచ్చార్యా విశేషతః
త్వమేవ సంధ్యా సావిత్రీ త్వం దేవీ జననీ పరా॥ 5
త్వయైతత్ ధార్యతే విశ్వం త్వయైతత్ సృజ్యతే జగత్
త్వయైతత్పా ల్యతే దేవి త్వ మత్యంతే చసర్వదా॥ 6
విసృష్టౌ సృష్టిరూపా త్వం స్థితిరూపా చ పాలనే
తథా సంహృతిరూపాం తే జగతోస్య జగన్మయే॥ 7
మహావిద్యా మహామాయా మహా మేధా మహాస్మృతిః
మహామోహా చ భగవతీ మహాదేవీ మహేశ్వరీ॥ 8
ప్రకృతిః త్వం చ సర్వస్య గుణత్రయ విభావినీ
కాళరాత్రిః మహారాత్రిః మోహరాత్రిశ్చ దారుణా ॥ 9
త్వం శ్రీఃత్వమీశ్వరీ త్వం హ్రీః త్వం బుద్ధిః బోధలక్షణా
లజ్జా పుష్టిః తథా తుష్టిః త్వం శాంతిః క్షాంతి రేవ చ ॥ 10
ఖడ్గినీ శూలినీ ఘోరా గదినీ చక్రిణీ తథా
శంఖిణీ చాపినీ బాణభుశుండీ పరిఘాయుధా॥ 11
సౌమ్యా సౌమ్యతరా శేష సౌమ్యేభ్య స్త్వ తిసుందరీ
పరా పరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ ॥ 12
యచ్చకించి త్క్వచిద్వస్తు సదసద్వాఖిలాత్మికే
తస్య సర్వస్య యా శక్తిః సా త్వం కింస్తూయసే మయా ॥ 13
యయా త్వయా జగత్స్రష్టా జగత్పాత్యత్తి యో జగత్
సోపి నిద్రావశం నీతః కః త్వాం స్తోతు మహేశ్వరః॥ 14
విష్ణుః శరీర గ్రహణ మహ మీశాన ఏవ చ
కారితాస్తే యతోతస్త్వాం కః స్తోతుం శక్తిమాన్ భవేత్॥ 15
స్వాతమిత్థం ప్రభావైః స్వై రుదారై ర్దేవి సంస్తుతా

మోహయైె తౌ దురాధర్షౌ అసురౌ మధుకైటభౌ॥ 16
ప్రబోధంచ జగత్స్వామీ నీయతా మచ్యుతో లఘు
బోధశ్చ క్రియతామస్య హంతు మేతౌ మహాసురౌ॥ 17
ఏవం స్తుతా తదా దేవీ తామసీ తత్ర వేధసా
విష్ణోఃప్రబోధనార్థాయ నిహంతు మధుకైటభౌ॥ 18
నేత్రాస్య నాసికాబాహు హృదయేభ్యస్త థోరసః
నిర్గమ్య దర్శనే తస్థౌ బ్రహ్మణో వ్యక్త జన్మనః॥ 19
ఉత్తస్థౌ చ జగన్నాథః తయా ముక్తో జనార్ధనః
ఏకార్ణవే హి శయనా త్తతః స దదృశే చ తౌ॥

ఇతి మార్కండేయ పురాణే నిద్రా దేవీ స్తోత్రం సంపూర్ణం

## మంగళ చండీ స్తోత్రము

రక్ష రక్ష జగన్మాత దేవీ మంగళ చండికే
హారికే విపదాం రాశే ర్హర్షం మంగళ కౌశికే॥
హర్ష మంగళ దక్షేచ హర్షమంగళదాయికే
శుభే మంగళ దక్షే చ శుభే మంగళ చండికే॥
మంగళే మంగళార్హేచ సర్వమంగళ మంగళే
సతాం మంగళదే దేవి సర్వేషాం మంగళవారే॥
పూజ్యే మంగళవారే చ మంగళాభీష్ట దేవతే
పూజ్యే మంగళ భూపస్య మనువంశస్య సంతతం ॥
మంగలాధిష్ఠాతృదేవీ మంగళానాం చ మంగళే
సంసార మంగళాధారే మోక్ష మంగళదాయినీ॥
వారేచ మంగళాధారే పారే చ సర్వ కర్మణాం
ప్రతి మంగళవారే చ పూజ్యే మంగళ సుఖప్రదే॥

ఇతి మంగళ చండికా స్తోత్రం సంపూర్ణం

## విద్యావృద్ధికారక **సిద్ధ సరస్వతీ స్తోత్రము**

వినియోగము -

అస్యశ్రీ సరస్వతీ స్తోత్ర మంత్రస్య బ్రహ్మా ఋషిః, గాయత్రీ ఛందః శ్రీ సరస్వతీదేవి దేవతా, ధర్మార్థ కామ మోక్షార్థే పాఠే వినియోగః॥

బ్రహ్మోవాచ -

ఆరూఢ్యాశ్వేతహంసే భ్రమతి చ గగనే దక్షిణే చాక్ష సూత్రం
వామే హస్తే చ దివ్యాంబర కనకమయం పుస్తకం జ్ఞానగమ్యాం।
సా వీణా వాదయంతీం స్వకరం జపైః శాస్త్ర విజ్ఞాన శబ్దైః
క్రీడంతీ దివ్యరూపా కరకమలధరా భారతీ సుప్రసన్నా ॥ 1
శ్వేత పద్మాసనా దేవీ శ్వేతగంధాను లేపనా
అర్చితా మునిభిః సర్వే ఋషిభిః స్తూయతే సదా ॥ 2

ఏవం ధ్యాత్వా సదా దేవీం వాంఛితం లభతే నరః॥ 3
శుక్లాం బ్రహ్మ విచారసార పరమాం ఆద్యాం జగద్వ్యాపినీం
వీణా పుస్తకధారిణీం అభయదాం జడాంధకారా పహాం ।
హస్తే స్ఫాటిక మాలికాం బిభ్రతీం పద్మాసనా సంస్థితాం
వందే తాం పరమేశ్వరీం భగవతీం బుద్ధిప్రదాం శారదాం ॥ 4
యా కుందేందు తుషార హార ధవళా యా శుభ్రవస్త్రావృతా
యా వీణా వరదండ మండితకరా యాశ్వేత పద్మాసనా ।
యా బ్రహ్మాఽచ్యుత శంకర ప్రభృతిభిర్దేవైః సదా వందితా
సా మాం పాతు భగవతీ సరస్వతీ నిశ్శేష జాడ్యాపహా ॥ 5
హ్రీం హ్రీం హ్రీం హృద్యైకబీజే శశిరుచికమలే కల్పవిస్పష్టశోభే
భవ్యే భవానుకూలే కుమతివనదానే విశ్వవంద్యాంఘ్రి పద్మే॥ 6
పద్యే పద్మోపవిష్టే ప్రణతజన మనోమోద సంపాదయిత్రీ
ప్రోత్ఫుల్ల జ్ఞానకూటే హరినిజదయితే దేవీ సంసార సారే॥ 7
ఐం ఐం ఐం ఇష్టమంత్రే కమలభవ ముఖాంభోజ భూతేస్వరూపే
రూపా రూప ప్రకాశే సకలగుణమయే నిర్గుణే నిర్వికారే॥ 8
న స్థూలే నైవ సూక్ష్మే ఽప్యవిదిత విభవే నాఽపి విజ్ఞానవత్వే
విశ్వే విశ్వాంతరాత్మే సుఖే నమితే నిష్కలే నిత్య శుద్ధే ॥ 9
హ్రీం హ్రీం హ్రీం జాప్యపుష్టే హిమరుచి ముకుటే పల్లకీ వ్యగ్రహస్తే
మాతర్మాత ర్నమస్తే దహ దహ జడతాం దేహిబుద్ధిం ప్రశస్తాం॥ 10
విద్యే వేదాంత వేద్యే పరిణత పఠితే మోక్షదే ముక్తిమార్గే
మార్గాతీత స్వరూపే భవ మమ వరదా శారదా శుభ్రహారే॥ 11
ధీం ధీం ధీం ధారణాఖ్యే ధృతి మతి నతిభిర్నామభిః కీర్తనీయే
నిత్యే ఽనిత్యే నిమిత్తే మునిగణ నమితే నూతనే వై పురాణే॥ 12
పుణ్యే పుణ్య ప్రవాహే హరి హర నమితే నిత్యశుద్ధే సువర్ణే
మాత మాత్రార్ధ తత్త్వే మతి మతి మతిదే మాధవ ప్రీతి మోదీ॥ 13
హ్రూం హ్రూం హ్రూం స్వస్వరూపే దహ దహ దురితం పుస్తక వ్యగ్రహస్తే
సంతుష్టాకర చిత్తే స్మితముఖీ సుభగే జృంభిణి స్తంభవిద్యే॥ 14
మోహే ముగ్ధప్రవాహే కురు మమ విమతి ధ్వాంతవిఘ్నే స మీడే
గీః గౌః వాగ్భారతీ త్వం కవివర రసనా సిద్ధిదే సిద్ధిసాధ్యే॥ 15
స్తౌమి త్వాం త్వాంచ వందే మమ ఖలు రసనాం నో కదాచిత్ త్యజేథా
మామే బుద్ధిః వృద్ధిదా భవతు న చ మనోదేవి మే యాతు పాపం॥16
మామే దుఃఖం కదాచిత్ కచిదపి విషయేఽవ్యస్తు మే అనాకులత్వం
శాస్త్రే వాదే కవిత్వే ప్రసరస్తు మమధీః మాఽస్తు కంఠా కదాపి॥ 17
ఇత్యేతత్ శ్లోక ముఖ్యైః ప్రతిదినం ఉషా తు స్తౌతి యో భక్తి నమ్రః
వాణీ వాచస్పతే రవ్యవిదిత విభవో వాక్పటు ర్ముక్త కంఠః॥ 18
సా స్యాత్ ఇష్టలాభైః సుతమివ సతతం పాతి సా చ దేవీ
సౌభాగ్యం తస్యలోకే ప్రభవతి కవితా వివాదః తం ప్రయాతి॥ 19
నిర్విఘ్నం తస్య విద్యా ప్రభవతి సతతం చాశ్రుత గ్రంథబోధః
కీర్తిః త్రైలోక్య మధ్యే నివసతి వదనే శారదా తస్య సాక్షాత్ ॥ 20
దీర్ఘాయుః లోకపూజ్యః సకలగుణనిధిః సంతతం రాజమాన్యో

వాగ్దేవ్యాః సమప్రసాదా త్రిజగతి విజయీ జాయతే సత్సభాసు॥ 21
బ్రహ్మచారీ వ్రతీ మౌనీ త్రయోదశ్యాం నిరామిషః
సారస్వతో జనః పాఠాత్ స కృదిష్టార్థ లాభవాన్ ॥ 22
పక్షద్వయే త్రయోదశ్యాం ఏక వింశతి సంఖ్యయా
అవిచ్ఛిన్నః పఠే దిమా ధ్యాత్వా దేవీం సరస్వతీం ॥ 23
సర్వపాప వినిర్ముక్తః సుభగో లోకవిశ్రుతః
వాంఛితం ఫలమాప్నోతి లోకేఽ స్మిన్ నాత్ర సంశయః॥ 24
బ్రహ్మణేతి స్తవం ప్రోక్తం సరస్వత్యాః స్తవం శుభం
ప్రయత్నేన పఠేన్నిత్యం సోఽ మృతత్వాయ కల్పతే ॥ 25

## శ్రీ ధనదా స్తోత్రమ్

ఓం నమస్సర్వ స్వరూపేచ । నమః కళ్యాణదాయికే
మహా సంపత్ప్రదే దేవి । ధనదాయై నమోస్తుతే ॥
మహాభోగప్రదే దేవి । మహాకామ ప్రపూరితే ।
సుఖ మోక్ష ప్రదేదేవి ధనదాయై నమోస్తుతే ॥
బ్రహ్మరూపే । సదానందే సదానంద స్వరూపిణి
ధ్రుతసిద్ధి ప్రదేదేవి ధనదాయై నమోస్తుతే ॥
ఉద్యత్సూర్య ప్రకాశాభే । ఉద్యదాదిత్య మండలే
శివతత్వ ప్రదేదేవి । ధనదాయై నమోస్తుతే ॥
విష్ణురూపే విష్ణుమతే । విశ్వపాలనకారిణి
మహాసత్వ గుణాక్రాంతే । ధనదాయై నమోస్తుతే ॥
శివరూపే శివానందే । కారణానంద విగ్రహే
విశ్వసంహార రూపేచ । ధనదాయై నమోస్తుతే ॥
పంచతత్వ స్వరూపేచ పంచాచార సదారతే
సాధకాభీష్టదే దేవి । ధనదాయై నమోస్తుతే॥

ఈ ధనదా స్తోత్రము అత్యద్భుతమైనది. దీనిని త్రికాలములందు భక్తి శ్రద్ధలతో పఠించినచో ధనవంతులై సర్వభోగములు అనుభవింతురు.

## అర్గళా స్తోత్రమ్

అస్యశ్రీ అర్గళా స్తోత్ర మంత్రస్య విష్ణు ఋషిః । అనుష్టుప్ఛందః శ్రీ మహాలక్ష్మీ ర్దేవతా । మంత్రోదితా దేవ్యో బీజం । నవార్ణోమంత్రశ్శక్తిః శ్రీ సప్తసతి మంత్రస్తత్వం । శ్రీ జగదంబా ప్రీత్యర్థే స్తోత్ర పాఠాంగత్వేన జపే వినియోగః॥ ఓం నమశ్చండికాయై ।

మార్కండేయ ఉవాచ –

జయంతీ మంగళా కాళీ భద్రకాళీ కపాలినీ ।
దుర్గాక్షమా శివాధాత్రీ స్వాహా స్వధా నమోస్తుతే ॥ 1
మధుకైటభవిద్రావి విధాతృవరదే నమః
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 2
మహిషాసుర నిర్నాశివిధాత్రి వరదేనమః ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 3

వందితాంఘ్రియుగే దేవి దేవి సౌభాగ్యదాయిని ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 4
రక్తబీజవధో దేవి చండముండ వినాశిని ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 5
అంచిత్యరూపచరితే సర్వశత్రు వినాశిని ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 6
న తేభ్య స్సర్వదా భక్త్యా చండికే ప్రణతాయ మే ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 7
స్తువద్భ్యో భక్తిపూర్వం త్వాం చండికే వ్యాధినాశిని ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 8
చండికే సతతం యే త్వా మర్చ యంతీహ భక్తితః।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 9
దేహి సౌభాగ్య మారోగ్యం దేహి దేవి పరం సుఖం ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 10
విధేహి ద్విషతాం నాశం విధేహి బల ముచ్చకైః।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 11
విధేహి దేవి కళ్యాణం విధేహి విపులాం శ్రియం ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 12
విద్యావంతం యశస్వంతం లక్ష్మీవంతం జనం కురు ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 13
ప్రచండ దైత్య దర్పఘ్నే చండికే ప్రణతాయ మే ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 14
చతుర్భుజే చతుర్వక్త్ర సంస్తుతే పరమేశ్వరి ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 15
కృష్ణేన సంస్తుతే దేవి శశ్వద్భక్త్యా తథాంబికే ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 16
హిమాచలసుతానాథ పూజితే పరమేశ్వరీ ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 17
సురాసుర శిరోరత్న నిఘృష్టచరణేంబికే ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 18
ఇంద్రాణీపతి సద్భావ పూజితే పరమేశ్వరి ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 19
దేవి ప్రచండ దోర్దండ దైత్యదర్ప వినాశిని ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 20
దేవి భక్తజనోద్దామ దత్తానందోదయేంబికే ।
రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥ 21
పత్నీం మనోరమాం దేహి మనోవృత్తానుసారిణీం ।
తారిణీం దుర్గసంసార సాగరస్య కులోద్భవామ్ ॥ 22
ఇదం స్తోత్రం పఠిత్వా తు మహాస్తోత్రం పఠే న్నరః।
స తు సప్తశతీసంఖ్యా వర మాప్నోతి సంపదః॥ 23

# దేవతాకృత దేవీ స్తోత్రమ్

ఓం దేవా ఊచుః ఓం 1

ఓం నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః।
నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాస్మతామ్ ॥ 2
ఓం రౌద్రాయై నమోనిత్యాయై గౌర్యై ధాత్ర్యైనమో నమః।
జ్యోత్స్నాయై చేందురూపిణ్యై సుఖాయై సతతం నమః॥ 3
కల్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై కుర్మో నమోనమః।
నైరృత్యై భూభృతాం లక్ష్మ్యై శర్వాణ్యై తే నమోనమః॥ 4
దుర్గాయై దుర్గపారాయై సారాయై సర్వకారిణ్యై ।
ఖ్యాత్యై తథైవ కృష్ణాయై ధూమ్రాయై సతతం నమః॥ 5
అతి సౌమ్యాతి రౌద్రాయై నమస్తస్యై నమో నమః।
నమో జగత్ప్రతిష్ఠాయై దేవ్యై కృత్యై నమో నమః॥ 6
ఓం యాదేవీ సర్వభూతేషు చేతనే త్యభిధీయతే ।
ఓం నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం,ఓం నమస్తస్యై నమోనమః।7
యా దేవీ సర్వభూతేషు చేతనే త్యభిధీయతే ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 8
యాదేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 9
యాదేవీ సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 10
యాదేవీ సర్వభూతేషు క్షుధారూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 11
యాదేవీ సర్వభూతేషు ఛాయారూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 12
యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 13
యాదేవీ సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 14
యాదేవీ సర్వభూతేషు క్షాన్తిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 15
యాదేవీ సర్వభూతేషు జాతిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 16
యా దేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 17



యాదేవీ సర్వభూతేషు శాన్తిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 18
యాదేవీ సర్వభూతేషు శ్రద్ధారూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 19
యాదేవీ సర్వభూతేషు కాన్తిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 20
యాదేవీ సర్వభూతేషు లక్ష్మీరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 21
యాదేవీ సర్వభూతేషు వృత్తిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 22
యాదేవీ సర్వభూతేషు స్మృతిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 23
యాదేవీ సర్వభూతేషు దయారూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 24
యా దేవీ సర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 25
యాదేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 26
యాదేవీ సర్వభూతేషు భ్రాంతిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥ 27
ఇంద్రియాణా మధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషు యా ।
భూతేషు సతతం తస్యైవ్యాప్యై దేవ్యై నమోనమః॥ 28
ఓం చితిరూపేణ యా కృత్స్నమేతద్వ్యాప్యస్థితా జగత్ ।
ఓం నమస్తస్యై ఓం,ఓం నమస్తస్యై ఓం, ఓంనమస్తస్యైనమోనమః॥29
స్తుతా సురైః పూర్వ మభీష్టసంశ్రయా
తథా సురేంద్రేణ దినేషు సేవితా ।
కరోతు సానః శుభహేతు రీశ్వరీ ।
శుభాని భద్రాణ్యభిహంతు చాపదః॥ 30
యా సాంప్రతం చోద్ధతదైత్య తాపితై
రస్మాభి రీశా చ సురై ర్నమస్యతే
యా చ స్మృతా తత్క్షణ మేవ హన్తినః
సర్వాపదో భక్తి వినమ్రమూర్తిభిః॥ 31

ఇతి శ్రీ మార్కండేయ పురాణాంతర్గత దేవీ మాహాత్మ్యే శుంభాసుర నిధనేచ్ఛయా దేవతాకృతం దేవీస్తోత్రం సంపూర్ణమ్.

# రాజమండ్రి నుండి దేశాంతర కాలము

ముహూర్త విషయంలో సమయ సవరణ

ముఖ్యముగా ముహూర్తముల విషయములో ప్రదేశ సవరణ చేసు కోవాలి. రాజమండ్రి నుండి తూర్పు వైపున్న వారు తీసివేసి, పడమరనున్నవారు కలుపుకుని ముహూర్తములను సరిచేసుకోవాలి. అంతే కాని రాష్ట్ర మంతటా ఒకే సమయమును వాడరాదు. ఏ ప్రదేశమునకు ఎంత సరిచేసుకోవాలో ఈ క్రిందిన గమనించుకోగలరు. హైదరాబాద్‌లో వివాహ ముహూర్తం అనుకుందాము. ఇది రాజమండ్రికి తయారు చేసిన పంచాంగము కనుక 13 నిమిషాలు కలుపుకుని ముహూర్తము నిర్ణయిం చుకోవాలి.

ఉదాహరణకు 14-4-2013, పగలు గం 12 -19 ని॥లకు ముహూర్తం ఉన్నది. 13 ని॥లు కలుపుకుని గం 12-32 ని॥లకు ముహూర్త సమయమగును. విశాఖపట్నంలో 6 ని॥లు తగ్గించుకుని గం 12-13 ని॥లకు ముహూర్త సమయ మగును. ఇలాగే ప్రతీ ముహూర్తమును ఇతర ప్రాంతాల వారు నిర్ణయించు కోవా లి. సమయ నిర్ధారణ పట్టికను ఈ క్రింద ఇవ్వడమైనది. ఏం చేయాలో కూడా చూపిస్తున్నాము.

| ప్రదేశం | సవరణ ఎంత | ఏం చేయాలి | ప్రదేశం | సవరణ ఎంత | ఏం చేయాలి |
|---|---|---|---|---|---|
| హైద్రాబాదు | 13 ని॥ | కలుపు | జగిత్యాల | 11 ని॥ | కలుపు |
| నిడదవోలు | 1 ని॥ | కలుపు | వరంగల్ | 8 ని॥ | కలుపు |
| తాడేపల్లిగూడెం | 1 ని॥ | కలుపు | ఖమ్మం | 6 ని॥ | కలుపు |
| చింతలపూడి | 3 ని॥ | కలుపు | నల్గొండ | 10 ని॥ | కలుపు |
| ఏలూరు | 2 ని॥ | కలుపు | గుంటూరు | 5 ని॥ | కలుపు |
| భీమవరము | 2 ని॥ | కలుపు | మద్రాసు | 6 ని॥ | కలుపు |
| అనంతపురము | 16 ని॥ | కలుపు | బెంగుళూరు | 16 ని॥ | కలుపు |
| హిందూపురము | 17 ని॥ | కలుపు | బళ్ళారి | 18 ని॥ | కలుపు |
| గుంటూరు | 5 ని॥ | కలుపు | ఔరంగాబాద్ | 25 ని॥ | కలుపు |
| తెనాలి | 4 ని॥ | కలుపు | ఢిల్లీ | 18 ని॥ | కలుపు |
| ఒంగోలు | 7 ని॥ | కలుపు | తుని | 3 ని॥ | తగ్గించు |
| విజయవాడ | 4 ని॥ | కలుపు | కాకినాడ | 2 ని॥ | తగ్గించు |
| మచిలీపట్నం | 2 ని॥ | కలుపు | అన్నవరం | 2 ని॥ | తగ్గించు |
| సూళ్ళూరుపేట | 7 ని॥ | కలుపు | నర్సీపట్నం | 4 ని॥ | తగ్గించు |
| తిరుపతి | 9 ని॥ | కలుపు | విశాఖపట్నం | 6 ని॥ | తగ్గించు |
| చిత్తూరు | 10 ని॥ | కలుపు | శ్రీకాకుళం | 8 ని॥ | తగ్గించు |
| కడప | 12 ని॥ | కలుపు | ఇచ్ఛాపురం | 12 ని॥ | తగ్గించు |
| కర్నూలు | 15 ని॥ | కలుపు | భువనేశ్వర్ | 10 ని॥ | తగ్గించు |
| సంగారెడ్డి | 14 ని॥ | కలుపు | రాజమండ్రి సుమారు 20-25 కి.మీ లు | యథాతథం | |
| ముంబాయి | 32 ని॥ | కలుపు | | | |

## రాజమండ్రి నుండి మరికొన్ని ముఖ్యపట్టణములకు లగ్నప్రమాణములు-పుష్కరకాలము

| లగ్నము | రాజమండ్రి గం.ని.సె. | పుష్కరం గం.ని.సె. | మద్రాసు గం.ని.సె. | తిరుపతి గం.ని.సె. | హైదరాబాద్ గం.ని.సె. | విజయవాడ గం.ని.సె. | విజయనగరం గం.ని.సె. |
|---|---|---|---|---|---|---|---|
| మేషం | 1-44-48 | 1-14 | 1-48-00 | 1-47-12 | 1-44-24 | 1-45-12 | 1-44-0 |
| వృషభం | 2-00-12 | 0-56 | 2-02-00 | 2-1-36 | 2-0-0 | 2-0-48 | 2-0-0 |
| మిధునం | 2-12-24 | 1-46 | 2-10-24 | 2-11-36 | 2-12-24 | 2-12-00 | 2-12-24 |
| కర్కాటక | 2-12-24 | 0-31 | 2-10-00 | 2-10-24 | 2-12-48 | 2-12-24 | 2-13-12 |
| సింహం | 2-6-46 | 1-29 | 2-3-12 | 2-4-00 | 2-7-12 | 2-6-24 | 2-7-36 |
| కన్య | 2-5-12 | 0-58 | 2-1-36 | 2-2-24 | 2-5-36 | 2-4-48 | 2-6-24 |
| తుల | 2-9-36 | 1-44 | 2-6-48 | 2-7-12 | 2-10-24 | 2-9-36 | 2-10-48 |
| వృశ్చిక | 2-14-00 | 0-33 | 2-12-00 | 2-12-24 | 2-12-24 | 2-13-36 | 2-14-48 |
| ధనుస్సు | 2-7-12 | 1-29 | 2-8-00 | 2-7-36 | 2-7-12 | 2-7-12 | 2-6-48 |
| మకరం | 1-51-46 | 0-52 | 1-55-12 | 1-53-36 | 1-51-12 | 1-52-0 | 1-51-12 |
| కుంభం | 1-39-12 | 1-19 | 1-42-24 | 1-42-48 | 1-38-24 | 1-39-12 | 1-38-0 |
| మీనం | 1-36-24 | 0-22 | 1-40-00 | 1-39-12 | 1-36-00 | 1-36-48 | 1-35-36 |

### గృహారంభ, గృహప్రవేశ విషయమున చూచుకొన దగిన వృషభ, కలశ చక్రశుద్ధి

నూతన గృహారంభ, గృహప్రవేశ విషయమై సూర్యుడున్న నక్షత్రము మొదలు చంద్రుడున్న నక్షత్రము వరకు వృషభ చక్రమున అభిజిత్తును కలిపియు , కలశ చక్రమున అభిజిత్తు కాకుండగాను లెక్కించి ఫలమును తెలిసికొనవలయును.

**వృషభ చక్రము :** 3 మృత్యువు 4 దుర్దశ 4 స్థైర్యము 3 ధనము 4 ధనలాభము 4 ధాన్యము 3 దారిద్ర్యము 3 హాని.

**కలశ చక్రము :** 1 హాని 4 ప్రవాసము 4 నిర్భయము 4 ధాన్యము 4 నిర్ధనము 4 గర్భస్రావము 3 లక్ష్మి 3 ఆయుర్వృద్ధి.

గ్రహస్థితి అనుసరించి ముహుర్త నిర్ణయము చేసినప్పుడు గ్రహబలమే ప్రధానము, వృషభ కలశ చక్ర శుద్ధులు పెద్దగా పట్టించుకోవలసిన అవసరం లేదు.

## పేరును బట్టి నక్షత్ర,పాద,రాశి,గణం,జంతువు,నాడి పట్టిక

| పేరులో మొదటి అక్షరం | నక్షత్రము పాదం | రాశి | గణం | జంతువు | నాడి |
|---|---|---|---|---|---|
| చూ,చే,చో,లా | అశ్విని1,2,3,4 | మేష | దేవ | గుర్రం | ఆది |
| లీ,లూ,లే,లో | భరణి1,2,3,4 | మేష | మనుష్య | ఏనుగు | మధ్య |
| ఆ | కృత్తిక 1 | మేష | రాక్షస | మేక | అంత్య |
| ఈ,ఊ,ఏ | కృత్తిక 2,3,4 | వృషభ | రాక్షస | మేక | అంత్య |
| ఓ,వా,వీ,వూ | రోహిణి1,2,3,4 | వృషభ | మనుష్య | పాము | అంత్య |
| వే,వో | మృగశిర1,2 | వృషభ | దేవ | పాము | మధ్య |
| కా,కి | మృగశిర3,4 | మిథున | దేవ | పాము | మధ్య |
| కూ,ఖం,గ,చ్ఛ | ఆరుద్ర1,2,3,4 | మిథున | మనుష్య | కుక్క | ఆది |
| కే,కో,హా | పునర్వ 1,2,3 | మిథున | దేవ | పిల్లి | ఆది |
| హి | పునర్వసు 4 | కర్కాట | దేవ | పిల్లి | ఆది |
| హూ,హే,హో,డా | పుష్యమి1,2,3,4 | కర్కాట | దేవ | మేక | మధ్య |
| డీ,డూ,డే,డో | ఆశ్రేష1,2,3,4 | కర్కాట | రాక్షస | పిల్లి | అంత్య |
| మా,మీ,మూ,మే | మఖ 1,2,3,4 | సింహ | రాక్షస | ఎలుక | అంత్య |
| మో,టా,టీ,టూ | పుబ్బ 1,2,3,4 | సింహ | మనుష్య | ఎలుక | మధ్య |
| టే | ఉత్తర 1 | సింహ | మనుష్య | గోవు | ఆది |
| టో,పా,పి | ఉత్తర 2,3,4 | కన్య | మనుష్య | గోవు | ఆది |
| పూ,షం,ణా,ఠ | హస్త1,2,3,4 | కన్య | దేవ | దున్న | ఆది |
| పే,పో | చిత్త 1,2 | కన్య | రాక్షస | పులి | మధ్య |
| రా,రీ | చిత్త 3,4 | తుల | రాక్షస | పులి | మధ్య |
| రూ,రే,రో,తా | స్వాతి1,2,3,4 | తుల | దేవ | దున్న | అంత్య |
| తీ,తూ,తే | విశాఖ 1,2,3 | తుల | రాక్షస | పులి | అంత్య |
| తో | విశాఖ 4 | వృశ్చిక | రాక్షస | పులి | అంత్య |
| నా,నీ,నూ,నే | అనూ1,2,3,4 | వృశ్చిక | దేవ | లేడి | మధ్య |
| నో,యా,యీ,యూ | జ్యేష్ఠ1,2,3,4 | వృశ్చిక | రాక్షస | లేడి | ఆది |
| యే,యో,బా,బీ | మూల1,2,3,4 | ధనుస్సు | రాక్షస | కుక్క | ఆది |
| బూ,ధా,భా,ఢా | పూ॥షాఢ1,2,3,4 | ధనుస్సు | మనుష్య | కోతి | అంత్య |
| బే | ఉ॥షాఢ 1 | ధనుస్సు | మనుష్య | ముంగిస | అంత్య |
| బో,జా,జి | ఉ॥షాఢ2,3,4 | మకర | మనుష్య | ముంగిస | అంత్య |
| జూ,జే,జో,ఖా | శ్రవణ1,2,3,4 | మకర | దేవ | కోతి | అంత్య |
| గా, గీ | ధనిష్ఠ 1,2 | మకర | రాక్షస | గుర్రం | ఆది |
| గూ, గే | ధనిష్ఠ 3,4 | కుంభ | రాక్షస | గుర్రం | ఆది |
| గో,సా,సీ,సూ | శతభిష1,2,3,4 | కుంభ | రాక్షస | గుర్రం | ఆది |
| సే, సో, దా | పూ॥భాద్ర1,2,3 | కుంభ | మనుష్య | సింహం | ఆది |
| దీ | పూ॥భాద్ర 4 | మీనం | మనుష్య | సింహం | ఆది |
| దు,శ్యం,ఝా,ధా | ఉ॥భాద్ర1,2,3,4 | మీనం | మనుష్య | గోవు | మధ్య |
| దే,దో,చా,చి | రేవతి1,2,3,4 | మీనం | దేవ | ఏను | అంత్య |

గమనిక -పైన పేరులో మొదటి అక్షరాలు ఆయా నక్షత్రములకు చెంది నవిగా గుర్తించాలి.ఇందులో ఉన్న అక్షరాలు కాక వేరే అక్షరాలు ఉన్నట్ల యితే ఉదా-సత్యనారాయణ అనే పేరు ఉందనుకుందాం, మొదటి అక్షరం"స"అయింది.పట్టికలో అదిలేదు.శతభిషా నక్షత్రానికి ఎదురుగా"సా" అనే అక్షరము ఉన్నది.దీనికి ముందు"స","సా"అనే అక్షరాలు శతభిషం 2 వపాదం అవుతుంది.అలానే మిగిలినవి తెలుసుకోవలెను.

**నామ నక్షత్ర సందేహ వివరణ:**

**నరస్య ద్వయనామా చ**
**ఆదినామాన్ విసర్జయేత్ ।**
**అంత్యనామంగృహీత్వాచ,**
**ఇత్యేతే లగ్న కారణమ్ ॥**

విశేష నామములు కలవారు ఆది నా మము లను విడిచి పెట్టవలెను. అనగా 'వీర వెంకట సత్యనారాయణ' అను నామమునకు చివరి నామమగు సత్య నారాయణ గ్రహించవలెను.

ద్విత్వాక్షర ములు వచ్చినప్పుడు అనగా ప్రభాకర్ అనే పేరు వచ్చిన ప్పుడు 'ప' క్రింది ఉన్న "్ర" రకార మునకు పలికే 'ర'అనే అక్షర మును తీసుకొనవలెను. అలానే 'శ్రీ' ఉన్న ప్పుడు క్రింది ఉన్న"్ర" రకా రమున కు పలికే, 'శ్రీ'లోని 'ఈ'కార మును కలుపుకుని 'రీ' గా తీసుకొనవలెను. పై చెప్పిన ప్రకారము వచ్చే నక్ష త్రము నామ నక్షత్రముగా గ్రహిం చాలి.

| నామము - | నక్షత్ర - | |
|---|---|---|
| కృష్ణుడు | స్వాతి | 1 |
| శ్రీధరుడు | చిత్త | 4 |
| క్షేత్రపాలుడు | హస్త | 2 |
| జ్ఞానుడు | ఆర్ద్ర | 3 |
| క్షేముడు | పునర్వసు | 1 |
| ఫణి | ఉత్తర | 3 |
| ద్రోణ,ద్రౌపది | స్వాతి | 3 |
| భీముడు | మూల | 4 |
| భైరవుడు | పూర్వాషాఢ | 3 |

## శిశుజననము - నక్షత్ర,పాద దోషములు

| నక్షత్రము | 1వ పాదం | 2వ పాదం | 3వ పాదం | 4వ పాదం |
|---|---|---|---|---|
| అశ్విని | తండ్రికి | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | మంచిది | శిశువునకు |
| కృత్తిక | మంచిది | చెడ్డది | మంచిది | తల్లికి |
| రోహిణి | తండ్రి,మామ | తండ్రి,మామ | తండ్రి,మామ | తండ్రిమామ |
| మృగశిర | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| ఆరుద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | చెడ్డది | చెడ్డది | మంచిది |
| ఆశ్రేష | మంచిది | ధనహాని | తల్లి | తండ్రి |
| మఖ | చెడ్డది | మంచిది | చెడ్డది | మంచిది |
| పుబ్బ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఉత్తర | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| హస్త | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| చిత్త | చెడ్డది | చెడ్డది | మంచిది | మంచిది |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |
| అనూరాధ | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| జ్యేష్ఠ | తల్లి | సోదర,మామ | శిశువునకు | తండ్రికి |
| మూల | తండ్రికి | తల్లికి | ధనహాని | మంచిది |
| పూర్వాషాఢ | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| ఉత్తరాషాఢ | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ఠ | మంచిది | చెడ్డది | మంచిది | మంచిది |
| శతభిషం | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| పూర్వాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఉత్తరాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |

సూచన :- తల్లితండ్రులు, లేదా అన్నల, లేదా అక్కల జన్మ నక్షత్రమందు శిశుజన్మమయిననూ, వర్జ్యము, దుర్ముహూర్తము, గ్రహణములందుగాని, అమావాస్యనాడుగాని జన్మించిననూ, ప్రేగులు మెడకు చుట్టు కొని పుట్టిననూ నక్షత్రజపము, నవగ్రహశాంతి దానములు, హెూమశాంతి, రుద్రాభిషేకం, అమ్మవారికి కుంకుమార్చన సువర్ణదానము జరిపించినచో దోషము తొలగి ఆయురారోగ్య సుఖ శాంతులతో వర్ధిల్లెదరు.

# గౌరీ పంచాంగము

## పగటి ముహూర్తములు ఒక్కొక్కటి 1 1/2 గం॥ ప్రమాణం

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| 1. ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| 2. లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| 3. విషం | ఉద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| 4. అమృ | లాభం | లాభం | ఉద్యో | లాభం | కలహం | ఉద్యో |
| 5. శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం |
| 6. ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | శుభం | లాభం |
| 7. అమృ | లాభం | విషం | ధనం | కలహం | ధనం | ఉద్యో |
| 8. విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

## రాత్రి ముహూర్తములు ఒక్కొక్కటి 1 1/2 గం॥ ప్రమాణం

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| 1. శుభం | రోగం | జ్వరం | లాభం | శుభం | అమృ | విషం |
| 2. అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| 3. జ్వరం | ఉద్యో | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| 4. రోగం | ధనం | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| 5. కలహం | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహం |
| 6. లాభం | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| 7. ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| 8. రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

## రాహు కాలము

| | | | |
|---|---|---|---|
| ఆది | సా. | 4-30 | ల6-00 |
| సోమ | ఉ. | 7-30 | ల9-00 |
| మంగ | మ. | 3-00 | ల4-30 |
| బుధ | మ. | 12-00 | ల1-30 |
| గురు | మ. | 1-30 | ల3-00 |
| శుక్ర | ఉ. | 10-30 | ల12-00 |
| శని | ఉ. | 9-00 | ల10-30 |

## గుళిక కాలము

| | | | |
|---|---|---|---|
| ఆది | మ. | 3-00 | ల 4-30 |
| సోమ | మ. | 1-30 | ల 3-00 |
| మంగ | మ. | 12-00 | ల 1-30 |
| బుధ | ఉ. | 10-00 | ల12-00 |
| గురు | ఉ. | 9-00 | ల10-30 |
| శుక్ర | ఉ. | 7-30 | ల 9-00 |
| శని | ఉ. | 6-00 | ల 7-30 |

## యమగండ కాలము

| | | | | |
|---|---|---|---|---|
| ఆది | మ. | 12-00 | ల | 1-30 |
| సోమ | ఉ. | 10-30 | ల | 12-00 |
| మంగ | ఉ. | 9-00 | ల | 10-30 |
| బుధ | ఉ. | 7-30 | ల | 9-00 |
| గురు | ఉ. | 6-00 | ల | 7-30 |
| శుక్ర | మ. | 3-00 | ల | 4-30 |
| శని | మ. | 1-30 | ల | 3-00 |

## దినాధిపతులు - తారాబలము తెలిసికొను పట్టిక

| జన్మనామ నక్షత్రము / రోజువారీ నక్షత్రము | అశ్వి మఖ మూల | భర పుబ్బ పూ॥షా | కృత్తి ఉత్తర ఉ॥షా | రోహి హస్త శ్రవ | మృగ చిత్త ధని | ఆర్ద్ర స్వాతి శతభి | పున విశా పూ॥ద్ర | పుష్య అనూ ఉ॥ద్ర | ఆశ్రే జ్యేష్ఠ రేవ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 |
| భరణి | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 |
| కృత్తిక | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 |
| రోహిణి | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 |
| మృగశిర | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 |
| ఆరుద్ర | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 |
| పునర్వసు | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 |
| పుష్యమి | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 |
| ఆశ్రేష | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 |
| మఖ | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 |
| పుబ్బ | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 |
| ఉత్తర | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 |
| హస్త | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 |
| చిత్త | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 |
| స్వాతి | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 |
| విశాఖ | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 |
| అనూ | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 |
| జ్యేష | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 |
| మూల | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 |
| పూర్వాషాఢ | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 |
| ఉత్తరాషాఢ | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 |
| శ్రవణ | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 |
| ధనిష్ఠ | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 | కే 5 |
| శతభిష | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 | గు 4 |
| పూ॥భాద్ర | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 | రా 3 |
| ఉ॥భాద్ర | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 | బు 2 |
| రేవతి | బు 2 | రా 3 | గు 4 | కే 5 | చ 6 | శ 7 | శు 8 | కు 9 | ర 1 |

అధిపతి-శని, వాహనము- సింహము, నువ్వులు, బంగారము దానము, ప్రారంభము నుండి గం 3.12ని॥లు వదిలిన తరువాత ఉపయోగించుకోవచ్చు. 8.మిత్రతార : మిత్రలాభము,విశేష సుఖము.అధిపతి - శుక్రుడు, వాహనము - గ్రద్ధ ,ఎల్ల వేళలా ఉపయోగం. 9.పరమ మిత్రతార :సాధనముతో పనులు నెరవేరును..అధిపతి - కుజుడు, వాహనము - హంస. ఎల్ల వేళలా ఉపయోగం.

**తారాబలము చూచుకునేవిధము:** జన్మ నక్షత్రము నుండి దిన నక్షత్ర ము వరకు లెక్కించి 9 చే భాగించగా వచ్చిన శేషమును బట్టి తారా బలము తెలుసుకొన వలెను.1) జన్మతార 2) సంపత్తార 3) విపత్తార 4) క్షేమతార 5) ప్రత్యక్తార 6) సాధనతార 7) నైధనతార 8) మిత్రతార 9) పరమమైత్రతార ఈ 9 లో 1,3,5,7 మంచి తారలు కావు. 2,4,6,8,9 మంచివి.(సున్నా శేషము వస్తే 9 వ తారగా భావించవలెను).

## దినాధిపతుల ఫలితములు

**1.రవి ఫలము :** సాహసము,ధనవ్యయము,ఉష్ణము,సంచారము, కార్య విలం బము,రాజకీయ వ్యవహారములు,నూతన వార్తా శ్రవణము, అకాలభోజనము. **2. చంద్ర ఫలము :** నూతన వస్త్రలాభము, ధనలాభము,స్త్రీ సౌఖ్యము, బంధుమిత్ర దర్శనము, గౌరవము, మృష్టాన్నభోజనప్రాప్తి,గొప్ప వారి తో పరిచయములు, ఉత్సాహము శుభవర్తమానము. **3. కుజ ఫలము :** ఆకస్మిక అపాయములు, ధన వ్యయము, కలహము, అకాలభోజనము, వ్యవహారపు చిక్కులు, ఇతరుల సహాయముకోరుట, సాహసము. **4. బుధ ఫలము :** క్రయ విక్రయాల వలన ధనలాభము,శాస్త్రప్రసం గము, ప్రయత్న కార్యసిద్ధి, సౌఖ్యము, శుభవర్తమానము,విద్యావంతు లతో పరిచయము, నూతన విషయముల యందు పాల్గొనుట. **5. గురు ఫలము :** దైవభక్తి, విద్యాగోష్టి, ధనలాభము, బంధుమిత్రదర్శ నము,పరోపకారబుద్ధి, సత్ప్రవర్తన, గౌరవము, అధికారము, యత్నకార్యజయము. **6. శుక్ర ఫలము :** నూతన వస్త్రలాభము, ధనలాభము, స్త్రీసౌఖ్యము సంగీతసాహిత్యప్రసంగములలో పాల్గొనుట, బంధుమిత్ర దర్శ నము, వినోదములు, సద్గ్రంధపఠనము, ప్రేమవ్యవహారములు. **7. శని ఫలము :** నీచజన సహవాసము, ధనవ్యయము, మాసినబట్ట లుధరించుట,కార్యఆటంకములు,అనాచారము,త్రిప్పట,సంచారము, మనస్తా పము. **8.రాహు ఫలము :** ధనవ్యయము,నీచజన సహవాస ము,కార్యవిఘ్న ములు,వ్యవసాయము వలన ధనలాభము, సంచారము,దురాలోచ న,అకాల భోజనము,చోరభయము. **9. కేతు ఫలము:** విచిత్ర వస్త్రప్రాప్తి, పురాణశ్రవణము, పుణ్యానదీస్నా నము, చోరభయము, విషజంతు దర్శనము, కార్య విలంబము,సజ్జన సహవాసము, నష్టధనప్రాప్తి.

## తారలకు అధిపతులు - శాంతులు

**1.జన్మతార :** మనస్తాపము,దేహనాశనము. అధిపతి - సూర్యుడు, వాహనము-నెమలి, తోటకూర దానము, ప్రారంభము నుండి గం 2.48 ని॥లు వదిలిన తరువాత ఉపయోగించుకోవచ్చు. స్త్రీలకు మంచిది. **2.సంపత్తార :** ధనలాభము, సుఖము.అధిపతి - బుధుడు, వాహనము-గుర్రము.ఎల్ల వేళలా ఉపయోగం. **3.విపత్తార :** కార్యహాని.అధిపతి - రాహువు, వాహనము-మేక, బెల్లం దానము, ప్రారంభము నుండి గం 1.12 ని॥లు వదిలిన తరువాత ఉపయోగించుకోవచ్చు. **4.క్షేమతార :** కార్యసిద్ధి, ప్రజాక్షేమము.అధిపతి-గురుడు,వాహనము- ఏనుగు, ఎల్లవేళలా ఉ పయోగం. ముఖ్యంగా ప్రయాణాలకు. **5.ప్రత్యక్తార :** కార్యహాని. అధిపతి - కేతువు, వాహనము - కాకి, ఉప్పు దానము, ప్రారంభము నుండి గం 3.12 ని॥లు వదిలిన తరువాత ఉ పయోగించుకోవచ్చు. **6.సాధనతార :** పనులు సాధింతురు,కీర్తి లాభము,అధిపతి- చంద్రుడు, వాహనము - నక్క. ఎల్ల వేళలా ఉపయోగం. 7. **నైధనతార :** ప్రాణ నష్టకారకుడు, అలసట.

## ప్రయాణములకు ఆనందాది యోగములు

ప్రయాణాల విషయంలో ఇది ముఖ్యమైనది. గ్రహస్థితి బాగున్నప్పుడు పట్టించుకోవలిసిన అవసరం లేదు.ఎప్పుడైనా ప్రయాణ సమయంలో చెడ్డయోగాలు వస్తే నిమిషాలు వదిలి చేయవచ్చు. గదాయోగము ప్రారంభమున 24 ని॥లు,కాల, ముసలకు 48 ని॥లు పద్మా,లంబ కు1.36ని॥లుధ్వ్వాక్ష,వజ్ర లకు 2 గం॥లు, యోగ ప్రారంభ మున విడిచి పెట్ట వలెను. తదుపరి కాలము శుభప్రదము.

ఆనంద, ధాత్రీ, సౌమ్య, ధ్వజ, శ్రీవత్స, ఛత్ర, మిత్ర, మానస, పద్మ, సిద్ధ, శుభ, అమృత, మాతంగ, వర్ధమాన యోగములు శుభప్రదము.

# హోరా చక్రము - అధిపతులు - ఫలితములు

సూర్యోదయము లగాయతు సూర్యాస్తమయము వరకు గల కాలమును 12చే భాగించగా పగటియందు కాలహోరలగును.

| వారం | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని |
| సోమ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి |
| మంగళ | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర |
| బుధ | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ |
| గురు | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| శుక్ర | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు |
| శని | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |

సూర్యాస్తమయము లగాయతు సూర్యోదయము వరకు గల కాలమును12చే భాగించగా రాత్రి కాలమందు కాలహోరలగును.

| వారం | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| సోమ | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు |
| మంగళ | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |
| బుధ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని |
| గురు | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి |
| శుక్ర | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర |
| శని | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ |

గమనిక - హెూర అనగా గంట కాలము అను అర్థము. పగలు- రాత్రి సుమారు గంట చొప్పున గ్రహములు పరిపాలించును.గురు, శుక్ర, బుధ, పూర్ణచంద్రుడు (శుక్ల అష్టమి నుండి బహుళ అష్టమి వరకు) శుభ గ్రహ హెూరలు.శుభ ఫలము.రవి,కుజ,శని,క్షీణచం ద్రుడు (బహుళ నవమి నుండి శుక్ల సప్తమి వరకు) పాపులతో కూ డిన బుధుడు పాప గ్రహ హెూరలు.అశుభ ఫలము. ఏరోజున ఏహెూరలో సూర్యోదయముగునో ఆ రోజునకు ఆ హెూర గ్రహ నామము తో ఆ దినమును చెప్పుకొనుచున్నాము. అనగా శుక్రవారమునాడు సూర్యోదయము శుక్రహెూరలో అగును. కావున ఆ రోజునకు ఆ హెూరతో శుక్రవారముగా వ్యవహరించుచున్నాము. ఇట్లే రవ్యాది వారములు ఏర్పడినవి.

## హొరాధిపతులు - ఫలితములు

**1. రవి** : రాజకీయ వ్యవహారములు, ఔషధసేవకు ,కోర్టువ్యవహారములు, ప్రభుత్వ ఉద్యోగ ప్రయత్నములకు, సన్మానము చేయుటకు, అధికారులతో ముచ్చటించుటకు, కీర్తిదాయకమైన పనులు ప్రారంభించుటకు మంచిది.

**2. చంద్ర** : తెల్లని వస్తువులు క్రయ విక్రయములు, మాతృసేవ, సుఖ భోజ నమునకు,ఆలోచనలకు,సముద్రప్రయాణము,క్రొత్త వస్తువులధా రణకు, దేవతార్చన ప్రారంభమునకు శుభప్రదము.

**3. కుజ** : కరంటుతో చేయు పనులకు, వ్యవసాయపు పనులు చేయు టకు, ఇటుక బట్టీలపై, నిప్పు పెట్టుటకు, సాహస కార్యములు చే యుటకు, రాజసేవ ప్రారంభించుటకు, సైన్యములో చేరుటకు, కలహములాడుటకు, భూ సేకరణ కుమంచిది.

**4. బుధ** : వ్యాపార పనులకు, వ్యాకరణము అభ్యసించుటకు, గణితా భ్యాస మునకు, రత్నములు కొనుటకు, అమ్ముటకు, గ్రంథ రచన ప్రారంభమునకు, మంత్రములు నేర్చుకొనుటకు, శుభము.

**5. గురు** : బంగారము ధరించుటకు,వివాహ ప్రసంగములకు,గ్రంథా రంభ-పఠనములకు,సంస్క ృత భాషను నేర్చుకొనుటకు,బ్యాంకులో ధనము దాచుట కు, తీర్థయాత్రా ప్రయాణములకు, నూతన వస్త్ర - వస్తువులు ధరించుటకు, కవిత్వ ప్రారంభమునకు, వాహనములు కొనుటకు శుభము.

**6.శుక్ర** : తెల్లని వస్త్రములు ధరించుటకు,పుష్పములు కొనుటకు, అమ్ముటకు,భరత నాట్యము నేర్చుకొనుటకు,పరిమళ ద్రవ్య సేకరణకు, గాంధర్వ వివాహమునకు,శుభము.

**7. శని** : ఇనుము,తిలలు,నూనె నల్లని వస్తువులు కొనుటకు-వాడుటకు, యంత్రవిభాగములవ్యాపారమునకు,జూదమాడుటకుమంచిది.

గ్రహ కారకత్వములను బట్టి ఆయా కారకత్వ పనులను చేయు టకు ఈ హెూరా కాలములు యోగ్యముగా నుండును. ముహూర్తములు లేని రోజులలో హెూరాచక్రమును ఉపయోగించుకుని పనులను ఆచరిం చుకోవ చ్చును.శుభ ముహూర్తముల విషయంలో లగ్న బలమే ప్రధానం కానీ హెూర లతో పనిలేదు. ఇది ముఖ్యముగా గమనించుకోవలెను.

## 2017-2018 శ్రీ హేవళంబి నామ సం॥ర దినాధిపతులు-దినచర్యతోబాటు తారాబలం చూచుకొనువిధము

**జన్మలేక నామనక్షత్రములరీత్యా ప్రతిదినము వచ్చునిత్య నక్షత్రములబట్టి ఈ దిగువ నక్షత్రాధిపతిని చూచుకొనవలెను.**

| జన్మనక్షత్రము లేక నామ నక్షత్రము | అశ్వని మఖ మూల | భరణి పుబ్బ పూ॥షాఢ | కృత్తిక ఉత్తర ఉ॥షాఢ | రోహిణి హస్త శ్రవణం | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆరుద్ర స్వాతి శతభిషం | పున విశాఖ పూ॥భా | పుష్య అనూ ఉ॥భా | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని, మఖ, మూల | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 |
| భరణి, పుబ్బ, పూ॥షాఢ | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 9 |
| కృత్తిక, ఉత్తర, ఉ॥షాఢ | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 |
| రోహిణి, హస్త, శ్రవణం | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 |
| మృగశిర, చిత్త, ధనిష్ఠ | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 |
| ఆరుద్ర, స్వాతి, శతభిషం | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 2 | రవి 4 |
| పున, విశాఖ, పూ॥భాద్ర | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 |
| పుష్య, అనూ, ఉ॥భాద్ర | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 |
| ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 |

ఇందు 1. జన్మతార 2. సంపత్తు 3. విపత్తు 4. క్షేమ 5. ప్రత్యక్ 6. సాధన 7. నైధన 8.మిత్ర 9. పరమమైత్ర తారలు వచ్చుచుండును. కాని జన్మ, విపత్, ప్రత్యక్, నైధనతారలు మంచివికావు. మిగిలిన తారలు మంచివి.

☙ చంద్రబలం ముఖ్యముగా జన్మరాశికి 1-3-6-7-10-11 రాశులు ఉభయపక్షము లందును, శుక్లపక్షమున 2-5-9, కృష్ణపక్షమున 4-8-12 రాశులలో ఉన్న చంద్రుడు చంద్రబలమునకు మంచిది. వివాహాది శుభకార్యములకు చంద్రబలం తప్పనిసరిగా చూడవలెను.

శ్రీ గణేశాయ నమ:

# ఆంధ్రప్రదేశ్ - భారత దేశ సౌభాగ్యములు

| | | | |
|---|---|---|---|
| వరు,రవి చంద్ర శుక్ర | లగ్నం కుజ,బుధ | | |
| ఇంద్ర, కేతు | **వర్ష లగ్న కుండలి** హేవిలంబ సంవత్సర ప్రారంభం ది 28-03-2017 ఉదయము 8.28 | | |
| | | | రాహు |
| యమ శని | | | గురు |

| | | | |
|---|---|---|---|
| వరుణ శుక్ర | రవి, బుధ | కుజ | |
| ఇంద్ర కేతు | **జగల్లగ్న కుండలి** రవి మేషంలో ప్రవేశ ప్రారంభ చక్రం ది13-04-2017 రాత్రి 1.56 | | |
| లగ్నం | | | రాహు |
| యమ శని | | చంద్ర | గురు |

చైత్రశుద్ధ పాడ్యమి ప్రారంభము. మేష లగ్నం వృశ్చిక నవాంశ యందు ప్రవేశించినది.

లగ్నమందుకుజుడు,బుధుడు, పంచ మంలో రాహువు. షష్ఠంలో గురుడు, భాగ్యమందు యముడు, శని, లాభమందు ఇంద్రుడు.కేతువు, వ్యయమందు వరుణుడు,రవి,చంద్ర,శుక్రుడు.

చైత్రమాసమున రవి మేషరాశి ప్రవేశము మకర లగ్న మిథున నవాంశయందు జరిగినది.

ద్వితీయమందు ఇంద్రుడు, కేతువు, తృతీయమందు వరుణ,శుక్ర చతుర్థంలో రవి, బుధ, పంచమంలో కుజుడు, అష్టమంలో రాహువు, భాగ్యమందు గురుడు, రాజ్యమందు చంద్రుడు, వ్యయ మందు యముడు, శని.

వర్ష, జగల్లగ్న కుండలులు పరిశీలన చేయగా దేశమునందు సానుకూల పరిస్థితులు ఏర్పడుతున్నవి. క్రమేపి అభివృద్ధి జరుగుచుండును. తీవ్రవాద సమస్య పొంచి ఉన్ననూ రక్షణసైన్యము తిప్పి కొట్టును. ఆర్థిక లావాదేవీలు ఇతర దేశాలతో ఒప్పందాలు విశేషంగా బలపడతాయి. దేశమునందు వర్షములు ఎక్కువగాపడును. పంటలు సమృద్ధిగా పండి ఆహార సమస్యను పరిష్కరించెదరు. రాజకీయనాయకులకు అనిశ్చితి ఏర్పడును. అన్నిరంగములయందు విజయము సాధింతురు. ప్రజలకు హాని కలిగించే మాదకద్రవ్యాలు మార్కెట్టులో ఎక్కువగా లభ్యమవుతాయి.ప్రముఖ పుణ్యక్షేత్రములందు సాంఘిక శుభ కార్యములు అధికమగును. సాఫ్టువేర్ రంగమునందు క్రొత్త మార్పులు జరుగుతాయి. ఉద్యోగ అవకాశాలు కూడా పెరుగుతాయి. పర్యాటక రంగము ధనములేక అభివృద్ధి తక్కువగా ఉం టుంది. నిరుద్యోగ సమస్యల విషయంలో సరియైన నిర్ణయము ప్రభుత్వ ములు తీసుకుంటాయి. క్రీడారంగమునందు గెలుపు కన్నా ఓటములే ఎక్కువ.

న్యాయస్థానముల యందు న్యాయము ఎక్కువ పాళ్ళలో ఉండును. రైలు, విమాన ప్రమాదములను నివారించుటలో ప్రణాళికలను ఏర్పడును. స్త్రీలపై అత్యాచారాలు, దాడులు తగ్గుముఖం పడతాయి.

ప్రభుత్వ వైద్యశాలలయందు అనారోగ్యము ఎక్కువగా ఉండును. కేంద్ర, రాష్ట్రంలో మంత్రివర్గ మార్పులు జరుగుతాయి. రాష్ట్రమునందు మంచి నాయకుని కోల్పోయే అవకాశము ఉన్నది. ప్రయివేటు సంస్థలు ప్రజలనుండి విపరీత ధనమును దోచు కొందురు. విద్యావ్యవస్థలో గొప్పమార్పులు జరుగుతాయి. మీడియా రంగమునందు చేసిన తప్పులు కప్పి పుచ్చుకొందురు. గతంలో తలపెట్టిన ప్రాజెక్టులు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సఫలముచేయలేవు. సినీరంగమునందు కుదేలయే సూచనలు కలవు.

ప్రభుత్వ పథకములు ప్రజలకు అందుబాటులోనికి వచ్చుట కష్టము. ఇతరదేశముల యందు ప్రమాద సూచనలు ఎక్కువగా కలవు. మత పరమైన దాడులు, మతమార్పిడులు ఎప్పటిలాగే ఎక్కువుగా జరుగుతాయి. అన్ని రాష్ట్రములకన్నా తూర్పు రాష్ట్రాలు అన్ని రంగములయందు అభివృద్ధి దిశగా ముందుకు సాగుతాయి. గ్యాస్, విద్యుత్ సరఫరాలో సంక్షోభము ఎక్కువవు తుంది. చిన్నతరహా, చేతి పరిశ్రమల వారికి సహాయము ఎక్కువగా అందుతుంది. ప్రజల నెత్తిన వడ్డీ భారము మరింత పెరుగుతుంది. పేపరు ధరలు తగ్గుముఖం పట్టును. బంగారము ధర కాస్త పెరుగును. సాధువులు, సన్యాసులు, మఠాధిపతులు, పీఠాధిపతులు వ్యక్తిగత భేధాభిప్రాయాలతో పోట్లాడుకుంటారు.

తెలంగాణ ప్రజలు వచ్చిన రాష్ట్ర స్వాతంత్రముతో ఆనందాను భూతులను కలిగి ఉంటారు. పురావస్తుశాఖలో విశేష విషయాలను కనుగొని విస్మయాన్ని కలిగిస్తారు. ఖగోళ శాస్త్రజ్ఞులు పరిశోధనా ఫలాలు సామాన్యప్రజలకు ఉపయోగపడవు. మంచి వర్షములు పడినను ఆ నీరు వృధాగా సముద్రంలో

కలసిపోవును.(ఇప్పటికైనా రాజకీయ నాయకులు తమతమ వ్యక్తిగత ప్రయోజనాలు మరచి నదుల అనుసంధానము చేయ వలసినదిగా విజ్ఞప్తి చేయుచున్నాము.)

శ్రీ హేవిలంబి నామ సంవత్సరమునందు కాలస్వరూపుడైన సర్వేశ్వరుడు అందరికీ ఆయురారోగ్యములను కలిగించి చల్లగా చూచుగాక!

సర్వులకు శుభం భూయాత్ ...!!

శ్రీగణేశాయ నమః

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# స్వస్తిశ్రీ హేమలంబ నామ సంవత్సర పంచాంగము

**2017** **అయనాంశలు** **2018**

**24° - 05' - 44"**

## సంవత్సర ఫలం

**హేవిళంబౌ నృపాస్సర్వే పరస్పర విరోధినః। ప్రజాపీడాత్వనర్ఘంచ తథాపిసుఖినోజనాః॥**

హేమలంబసంవత్సరమున నాయకులు అన్యోన్య విరోధులగుదురు. ప్రజలకు పీడ కలుగును. ధరలుతగ్గును. జనులుసుఖవంతులగుదురు.

### పంచవత్సరాత్మక యుగము

పంచవత్సరాత్మక యుగముననుసరించి "హేమలంబ" కు సంవత్సరము అందురు. అగ్నిదేవుడు అధిపతి. తిలలుదానము చేసినచో శుభములు కలుగును.

### గురుదయాబ్ద ఫలము

గురుడు హస్త యందు ఉదయించుటచే చైత్రాబ్దముగా చెప్పబడినది.ఆహారధాన్యములు కొరత ఏర్పడును, మంచిధాన్యము లభించదు. స్త్రీలకు దోషయుక్తముగా నుండును.

### బార్హస్పత్య మానము

బార్హస్పత్య మానము అనుసరించి " సాధారణ"నామ సంవత్సరమగును. అధిపతి అగ్ని. పశువులు పాలను ఎక్కువగానిచ్చును. పంటలు మధ్యమఫలప్రదమగును.

చైత్ర-వైశాఖమున అధిక వడగాల్పులు, ధాన్య,రస జాతులకు ధరలు తరుగును. జ్యేష్ఠ-ఆషాఢ-శ్రావణములందు రసవస్తువులకు ధరలుపెరుగును.భాద్రపద ఎక్కువ వర్షములు కురియును, పంటలు తక్కువగా నుండును. ఆశ్వయుజమున దేశమునందు సంక్షోభము,ప్రజానష్టమువాటిల్లును.కార్తీక-మార్గశిర-పుష్య-మాఘమాసమున ప్రభుత్వాలు అనాలోచితముగా పనిచేయును. ఫాల్గుణములో విశేషముగా జనులకు శుభము.

(మధ్యదేశప్రాంతములయందు యుద్ధము వచ్చును.)

**శని సంచార ఫలము :** వత్సరాది నుండి జూన్ 21వరకు ధరలు మందముగా నుండును. అక్టోబరు 26 వరకు వర్షములు తక్కువగా పడును. తదుపరి నాయకుల్లో చాలా మంది అవినీతి గోతములు బయటపడును.

**గురు సంచార ఫలము :** వత్సరాది నుండి సెప్టెంబరు వరకు దేశము నందు సుభిక్షముగా నుండును. తదుపరి ప్రసారమాధ్యమాలపై జనులు తిరుగుబాటు చేయుదురు.

## రాజాది నవ నాయకులు

1.రాజ్ఞః కుజస్య ఫలమ్

శ్లో॥ **అగ్నితస్క రరోగాస్యు ర్నృపవిగ్రహతా భృశం ।**
**హతసస్యోబహువ్యాళో భౌమే వర్షాధిపేసతి ॥**

కుజుడు రాజైనందువలన రాజవిరోధం అధికంగా ఉండును. అగ్ని,చోర, రోగభయములు అధికమగును. భూమియందు పంటలు తక్కువగును. సర్పజాతుల భయము ఎక్కువగా ఉండును.

2.మంత్రిణః గురోః ఫలమ్

శ్లో॥ **దేశ క్షేమాభివృద్ధ్యర్థం ప్రజా సౌఖ్య ఖరం యధా ।**
**సన్మంత్రిణో మంత్రియంతి గురౌ మంత్రిపదంగతే ॥**

గురుడు మంత్రియైనందువలన దేశమునకు క్షేమవృద్ధియూ,ప్రజాసౌఖ్యమును కోరే నాయకులకు యోగ్యులగు మంత్రులు లభించెదరు.

3.సేనాధిపతేః బుధస్య ఫలమ్

శ్లో॥ **వాతాహతా వారిధరాః కదాచిత్ వర్షంతి సస్యాని ఫలాన్వితాని ।**
**నరా స్త్రియః కామరతాభవేయు స్సేనాధిపత్యేఖలు సోమసూనోః ॥**

బుధుడు సేనాధిపతి అయినందువలన వాయువు తోకూడిన మేఘములు ఒకానొకప్పుడు వర్షించును. పంటలు పూర్తిగాపండును. స్త్రీ,పురుషులుకామము నందు ఆసక్తి కలిగిఉందురు.

4.సస్యాధిపతేః రవేః ఫలమ్

శ్లో॥ **గోధూమ యవముఖ్యాని కుళుత్థ చణకానిచ ।**
**సమృద్ధాని భవిష్యంతి రవౌ సస్యాధినాయకే ॥**

రవి సస్యాధిపతి అయినందువలన గోధుమ, యవ్వలు, ఉలవలు, శనగలు మొదలగు ధాన్యములు పూర్తిగా పండును.

5.ధాన్యాధిపతేః రవేః ఫలమ్

శ్లో॥ **మధ్యవృష్టిః ఫలం స్వల్ప మనర్ఘంచ మహద్భయం ।**
**రక్తసస్యాని జాయంతే సూర్యేధాన్యాధిపేసతి ॥**

రవి ధాన్యాధిపతి అయినందువలన మధ్యమ వృష్టి,పంట తక్కువ, ధరలు తగ్గుటయూ, మహా భయము కలుగును. ఎరుపు రంగు పంటలు పుష్కలముగా పండును.

6.అర్ఘాధిపతేః బుధస్య ఫలమ్

శ్లో॥ **అర్ఘాధినాథే రజనీక రాత్మజే వృష్ట్యర్ఘసస్యాని బహూనిచస్యుః ।**
**కుమారపాషండ జినేంద్రజాలాకాః ప్రభూత హాస్యానతథాపరేజనాః ॥**

బుధుడు అర్ఘాధిపతి అయినందువలన వర్షము, ధరలు, పంటలు అధికముగా ఉండును. కుమార, పాషండ, జైన, ఐంద్రజాలిక మతస్తులు నవ్వులపాలు అగుదురు.

7.మేఘాధిపతేః గురోః ఫలమ్

శ్లో॥ **సస్యార్ఘ వృష్టిభిస్తుష్టా భవేద్భూమి ర్నిరంతరం ।**
**వీతరోగభయాస్సర్వే గురౌ మేఘాధిపేసతి ॥**

గురుడు మేఘాధిపతి అయినందువలన భూమిపంటలతోను, ధరలతోను, వర్షములతోను పుష్కలముగా ఉండును. జనులందరూ రోగభయములేక సుఖముగా ఉందురు.

8.రసాధిపతేః కుజస్యః ఫలమ్

శ్లో॥ **రజితలవణంసర్పి తిలతైలగేడాదయః ।**
**శూన్యార్ఘం యాంతితేసర్వే భౌమయది రసాధిపే ॥**

కుజుడు రసాధిపతి అయినందువలన నువ్వులు, నెయ్యి, నూనె, బెల్లము, వెండి, ఉప్పు, మొదలగు రస జాతులకు ధరలు తగ్గును.

9.నీరసాధిపతేః రవేః ఫలమ్

శ్లో॥ **నీరసాధివత్ సూర్యే తామ్ర చందనయోరపి ।**
**రత్న మాణిక్యముక్తానాం జాయతేవృద్ధిరుత్తమా ॥**

రవి నీరసాధిపతి అయినందువలన రాగా, మంచి గంధము, రత్నములు, మాణిక్యములు, ముత్యములు ఉత్తమముగా ఉండును.

## వర్షప్రమాణము

శ్లో॥ షష్టీయోజన విస్తీర్ణం,శతయోజనమున్నతం । ఆఢకస్య ప్రమాణంతు దేవమానేనగణ్యతే ॥
దశభాగా స్సముద్రేషు,పర్వతేషుచ సప్తచ । ద్వేభాగౌభువి పర్జన్యస్త్వే పంచవర్షతి చిత్రిధా ॥

పది భాగములు సముద్రమునందు, ఏడు భాగములు పర్వతములయందు, రెండు భాగములు భూమియందు వర్షము పడును. కావున వర్షములు తక్కువగానే యుండును.

## పురోహితాది ఉపనాయకులు

1.పురోహితుడు - రవి
2.పరీక్షకుడు - శని
3.గణకుడు - చంద్రుడు
4.గ్రామపాలకుడు - గురుడు
5.దైవజ్ఞుడు - బుధుడు
6.రాష్ట్రాధిపతి- కుజుడు
7.సర్వ దేశోద్యోగపతి - గురుడు
8.అశ్వాధిపతి - గురుడు
9.గజాధిపతి - రవి
10.పశూనామధిపతి - బుధుడు
11.దేవాధిపతి - రవి
12.నరాధిపతి - బుధుడు
13.గ్రామాధిపతి - శని
14.వస్త్రాధిపతి - కుజుడు
15.రత్నాధిపతి - గురుడు
16.వృక్షాధిపతి - రవి
17.జంగమాధిపతి - రవి
18.సర్పాధిపతి - చంద్రుడు
19.మృగాధిపతి - బుధుడు
20.శుభాధిపతి - కుజుడు
21.స్త్రీణామాధిపతి - గురుడు

| **శుభాధిపత్యాలు** | శుభులు | పాపులు |
|---|---|---|
| **రాజాది నవనాయకులు :** | **4** | **5** |
| **పురోహితాది నాయకులు :** | **11** | **10** |
| **మొత్తం :** | **15** | **15** |

పాపాధిపత్యములు ఎక్కువగా వచ్చినందున నాయకులకు, ప్రజలకు అరిష్టముగా నున్నది. 100 కి 65 శాతం పంట ఫలించును.

## కాల నామ మేఘము

శ్లో॥ **మేరో: దక్షిణదిగ్భాగే మేఘోత్పత్తి: । దక్షిణ దిక్కున మేఘములు ఏర్పడును.**

ఫలం: **నిరంతరం మహావర్షం మధ్యదేశే మహాజలం ।ఫలంతి సర్వధాన్యాని కాలమేఘస్య లక్షణమ్ ॥**

మధ్య దేశములయందు ఎక్కువ వర్షము, ఎక్కువ జలము ఉండును. అన్ని ధాన్యములు ఫలించును.

## ఆర్ద్ర ప్రవేశ ఫలము

**ఈ సంవత్సరమున జ్యేష్ఠ బహుళ త్రయోదశినాడు అనగా 21-6-2017 వ తేది తె గం 4.59 ని॥లకు (తెల్లవారితే 22 వ తేది) సూర్యుడు ఆరుద్ర నక్షత్రమునందు ప్రవేశము జరుగుచున్నది.**

| | | |
|---|---|---|
| తిథి | త్రయోదశి | వర్షముచే భూమి నిండును |
| వారం | బుధ | అధికధరలు |
| నక్షత్రం | కృత్తిక | వర్షాభావము |
| యోగం | ధృతి | సుభిక్షము |
| కరణము | గరజి | సుభిక్షము |
| కాలము | తెల్లవారుజాము | సుభిక్షము |
| లగ్నం | వృషభం | పశువృద్ధి |
| మండలము | 1 | సస్యానుకూల వృష్టి |

**మౌఢ్యములు**
**గురుమూఢమి :**
**ది 10-10-2017 నుండి 11-11-2017 వరకు**
**శుక్రమూఢమి :**
**వత్సరాది నుండి ది. 31-3-2017 వరకు తిరిగి 30-11-2017 నుండి 19-2-2018 వరకు**

## కర్తరి

ది 4.5.2017 మ 2.30 ని॥లకు రవి భరణీ నక్షత్రం 3 వ పాదం లోనికి ప్రవేశించును.గాన చిన్న (డొల్లు) కర్తరి ప్రారంభం.తిరిగి 11.5.2017 ఉ 11.54 ని॥లకు కృత్తిక నక్షత్రంలోనికి ప్రవేశించు నున్నందు వలన పెద్ద కర్తరి ప్రారంభమగును. ది 28.5.2017 రా 7.25 ని॥లకు రోహిణీ నక్షత్రం 2 వ పాదం లోనికి ప్రవేశించును. ఇక్కడితో కర్తరి పూర్తిఅగును.

## నక్షత్రరీత్యా సంవత్సర ఫలం

| | |
|---|---|
| అశ్విని-పుష్యమి-స్వాతి-అభిజిత్ | అలంకారప్రాప్తి |
| భరణి-ఆశ్రేష-విశాఖ-శ్రవణం | రోగభయర్తి |
| కృత్తిక-మఖ-అనూరాధ-ధనిష్ఠ | ఆయుర్వృద్ధి |
| రోహిణి-పుబ్బ-జ్యేష్ఠ-శతభిషం | ధనలాభం |
| మృగశిర-ఉత్తర-మూల-పూర్వాభాద్ర | మనస్తాపం |
| ఆరుద్ర-హస్త-పూర్వాషాఢ-ఉత్తరాభాద్ర | రాజపూజ్యం |
| పునర్వసు-చిత్త-ఉత్తరాషాఢ-రేవతి | యుద్ధభయం |

## పశుపాలకాది నిర్ణయము

**పశుపాలకుడు - యముడు**

శ్లో॥ **అనర్ఘ మల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథాతృణం । పశుపీడాభవేన్నిత్యం యమశ్చేత్పశునాయకే ॥**
పశుపాలకుడు యముడైనందువలన ధరలు తగ్గును. తక్కువ వర్షము పడును. పాలు తక్కువ, గడ్డి ఎక్కువగా ఉండును. పశువులకు పీడ కలుగును.

**గోష్ఠప్రాపకుడు - శ్రీ కృష్ణుడు**

శ్లో॥ **పశువృద్ధి స్సుభిక్షంచ బహుసస్యార్ఘ సంపద: । సంపూర్ణం తృణవృద్ధిస్స్యా ద్గోపాలే పశునాయకే ॥**
గోపాలుడు గోష్ఠప్రాపకుడు అయినందువలన పశువృద్ధి, సుభిక్షము, వర్షము, పంటలు, గడ్డి వృద్ధిగా ఉండును. ఆవులు పాలను ఎక్కువగా ఇచ్చును.

**గోష్ఠబహిష్కర్త - బలరాముడు**

శ్లో॥ **సువృష్టి సర్వదేశానాం సర్వసస్యసమృద్ధయ: । మధ్య దేశే సుభిక్షంచ రామశ్చే త్పశునాయకే ॥**
బలరాముడు గోష్ఠబహిష్కర్త అయినందువలన మంచి వర్షములు పడును. అన్ని దేశములకు పంటలు వృద్ధి అగును. మధ్య దేశమున సుభిక్షము కలుగును.

# మకర సంక్రాంతి పురుష ఫలము

**స్వస్తిశ్రీ హేమలంబ నామ సంవత్సర పుష్యబహుళ త్రయోదశి ఆదివారం మూలా నక్షత్రయుక్త వృషభలగ్నమందు దీనికి సరియగు ఇంగీషు తేది 14.1.2018 మ గం 1.38 ని.లకు సూర్యుడు మకర రాశిలోనికి ప్రవేశించును. ఈ రోజునే జనులెల్లరూ సంక్రాంతి పండుగను జరుపుకొనుట శ్రేష్టము. ఈనాటి నుండే ఉత్తరాయణము ప్రారంభమగును.**

ఈ సంక్రాంతి పురుషునకు 8విశాల నేత్రములు,4 ముఖములు,8 చెవులు కలిగి 100 యోజనముల పొడవు,12 యోజనాల వైశాల్యము కలిగి ఉండును.

**నామ స్నానాది ఫలములు**

| | | | |
|---|---|---|---|
| 1. | నామం | ఘోరా | శూద్రులకు అరిష్టము |
| 2. | స్నానం | అగరు | సవృష్టి |
| 3. | వస్త్రం | కంబళ | మునులకు నాశనము |
| 4. | గంధం | వస | విష నాశనము |
| 5. | పుష్పము | నల్ల కలువ | ఫలనాశనకరము |
| 6. | ఆభరణము | పగడము | దుష్టనాశనము |
| 7. | పాత్ర | తగరము | రోగప్రదము |
| 8. | ఆహారము | పెరుగు | తేజో నాశనము |
| 9. | ఫలము | తాటిపండు | వృష్టి నాశనము |
| 10. | ఆయుధము | తోమరము | నాయకులకు పరస్పరము విరోధం |
| 11. | ఛత్రము | మయూర | మరణభయము తొలగిపోవును |
| 12. | వాహనము | ఏనుగు | పరిపాలకులకు పరస్పరము విరోధం |
| 13. | అవస్థా | కూర్చుని | సామాన్య వృష్టి |
| 14. | చేష్టా | లోలా | ఆకలి భయము |
| 15. | దిక్కు | వాయువ్యము | వాయువ్య దేశములకు అరిష్టము |
| 16. | తిది | త్రయోదశి | జల ప్రళయము |
| 17. | వారము | ఆది | వ్యాధి భయము |
| 18. | నక్షత్రము | మూల | రాజులకు అరిష్టం |
| 19. | యోగము | ధృవ | స్థిరము |
| 20. | కరణము | వణిజ | ధరలు తగ్గును |
| 21. | కాలము | మధ్యాహ్నము | మంచివారికి నాశనము |
| 22. | లగ్నము | వృషభం | సుఖము, దు:ఖము సమానముగా ఉండును. |
| 23. | ముహుర్తము | 9 | ఆయుష్షు (ఖర్చులు అధికముగా ఉండును) |
| 24. | మాసము | పుష్యము | శుభదాయకము |
| 25. | పక్షము | కృష్ణ | ప్రజలకు క్షేమము, ఆరోగ్యము. జంతువులకు రోగబాధలధికం. |

**వస్తు ఫలితములు:- వస్తు ఫలితములు:- రాగి, మంచి గంధం, రత్నములు, మాణిక్యములు, ముత్యములు, గోధుమ ధాన్యములకు ధరలు పెరుగును.**

## కందాయ ఫలములు

| నక్షత్రము | మొదటి సంఖ్య | రెండవ సంఖ్య | మూడవ సంఖ్య | నక్షత్రము | మొదటి సంఖ్య | రెండవ సంఖ్య | మూడవ సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 0 | 2 | 0 | చిత్త | 7 | 0 | 1 |
| భరణి | 3 | 0 | 2 | స్వాతి | 2 | 1 | 3 |
| కృత్తిక | 6 | 1 | 4 | విశాఖ | 5 | 2 | 0 |
| రోహిణి | 1 | 2 | 1 | అనూరాధ | 0 | 0 | 2 |
| మృగశిర | 4 | 0 | 3 | జ్యేష్ఠ | 3 | 1 | 4 |
| ఆరుద్ర | 7 | 1 | 0 | మూల | 6 | 2 | 1 |
| పునర్వసు | 2 | 2 | 2 | పూర్వాషాఢ | 1 | 0 | 3 |
| పుష్యమి | 5 | 0 | 4 | ఉత్తరాషాఢ | 4 | 1 | 0 |
| ఆశ్రేష | 0 | 1 | 1 | శ్రవణం | 7 | 2 | 2 |
| మఖ | 3 | 2 | 3 | ధనిష్ఠ | 2 | 0 | 4 |
| పుబ్బ | 6 | 0 | 0 | శతభిషం | 5 | 1 | 1 |
| ఉత్తర | 1 | 1 | 2 | పూర్వాభాద్ర | 0 | 2 | 3 |
| హస్త | 4 | 2 | 4 | ఉత్తరాభాద్ర | 3 | 0 | 0 |
| | | | | రేవతి | 6 | 1 | 2 |

కందాయ ఫలములలో ఒక్కొక్క సంఖ్య 4 మాసములకు సూచించును.

అనగా చైత్రము నుండి ఆషాఢము వరకు మొదటి సంఖ్య, శ్రావణము నుండి కార్తీకము వరకు రెండవ సంఖ్య, మార్గశిరము నుండి ఫాల్గుణము వరకు మూడవ సంఖ్యను కందాయముగా చూసుకొనవలెను.

ఇందు బేసి సంఖ్యలు ధనలాభములు,సరి సంఖ్య సమ లాభమును సూచించును.మొదటి సున్న వ్యాధిని,రెండవ సున్న భయమును, మూడవ సున్న ఋణమును సూచించును. **మూడు సున్నాలే వచ్చిన యెడల సంవత్సరమంతయూ కష్ట జీవనము సాగును.**

## కావేరీ నదీ పుష్కరములు

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ హేమలంబ నామ సంవత్సర భాద్రపద బ॥సప్తమి మంగళవారము అనగా ది12-9-2017 ఉ5.58 ని॥లకు దేవగురువు అయిన బృహస్పతి తులారాశిలోనికి ప్రవేశించును.కావున కావేరీ నదికి పుష్కరములు జరుగును. సెప్టెంబరు 12 నుండి సెప్టెంబరు 23 తారీఖు వరకు 12 రోజులూ పుష్కరములు జరుగును. ఈ పుష్కర సమయములో పుణ్యస్నానాలు, చనిపోయిన పెద్దలకు పిండప్రదాన, గోదానాది దానములు చేయుట శ్రేయస్కరము. వంశాభివృద్ధి, పాప నాశనము.

## గ్రహణాలు

**2017-18**

1.చంద్రగ్రహణం, 7-8-2017,

| | |
|---|---|
| స్పర్శకాలం | రా10-52 |
| మధ్యకాలం | రా11-50 |
| మోక్షకాలం | రా12-49 |
| పుణ్యకాలం | గం1-57ని॥లు |

2.చంద్రగ్రహణం,

31-1-2018,బుధవారం,పూర్ణిమ

సంపూర్ణగ్రహణం

| | |
|---|---|
| స్పర్శకాలం | సా5-17 |
| నిమీలనకాలం | రా6-21 |
| మధ్యకాలం | రా6-59 |
| ఉన్మీలనకాలం | రా7-37 |
| మోక్షకాలం | రా8-41 |
| పుణ్యకాలం | గం3-24ని॥లు |

సూర్యాస్తమయం తరువాత గ్రహణం పాటించవలెను.

## హేమలంబలో గ్రహాలు రాశి సంచారాలు

**రవి**

| | | | |
|---|---|---|---|
| ఏప్రి | 13 | రా1.56 | మేషం |
| మే | 14 | రా10.48 | వృషభం |
| జూన్ | 14 | తె5.24 | మిథునం |
| జూలై | 16 | సా4.16 | కర్కాటకం |
| ఆగ | 16 | రా12.38 | సింహం |
| సెప్టె | 16 | రా12.32 | కన్య |
| అక్టో | 17 | మ12.27 | తుల |
| నవం | 15 | మ12.14 | వృశ్చికం |
| డిసె | 15 | రా2.56 | ధనుస్సు |
| జన | 14 | మ1.38 | మకరం |
| ఫిబ్ర | 12 | రా2.39 | కుంభం |
| మార్చి | 14 | రా11.34 | మీనం |

**కుజ**

| | | | |
|---|---|---|---|
| ఏప్రి | 12 | తె3.53 | వృషభం |
| మే | 26 | రా1.12 | మిథున |
| జూలై | 11 | మ2.37 | కర్కాటక |
| ఆగ | 27 | ఉ8.07 | సింహం |
| అక్టో | 13 | మ3.42 | కన్య |
| నవ | 29 | తె5.03 | తుల |
| జన | 16 | తె4.55 | వృశ్చికం |
| మార్చి | 07 | సా6.17 | ధనుస్సు |

**బుధ**

| | | | |
|---|---|---|---|
| జూన్ | 3 | రా7.44 | వృషభం |
| | 18 | రా10.41 | మిథునం |
| జూలై | 02 | రా2.54 | కర్కాటకం |
| | 21 | ఉ10.12 | సింహం |
| సెప్టె | 26 | రా12.18 | కన్య |
| అక్టో | 13 | రా11.40 | తుల |
| నవం | 1 | రా12.33 | వృశ్చికం |
| | 24 | మ1.46 | ధనుస్సు |
| డిశె | 10 | తె4.12 | వృశ్చికం |
| జన | 6 | రా7.40 | ధనుస్సు |
| | 27 | రా12.52 | మకరం |
| ఫిబ్ర | 14 | తె3.12 | కుంభం |
| మార్చి | 03 | ఉ6.43 | మీనం |

**శుక్ర**

| | | | |
|---|---|---|---|
| మే | 31 | ఉ8.51 | మేషం |
| జూన్ | 29 | రా7.26 | వృషభం |
| జూలై | 26 | సా4.59 | మిథునం |
| ఆగ | 21 | ఉ10.40 | కర్కాటక |
| సెప్టె | 15 | ఉ10.19 | సింహం |
| అక్టో | 09 | రా9.12 | కన్య |
| నవం | 02 | రా11.47 | తుల |
| నవ | 26 | రా9.55 | వృశ్చికం |
| డిశె | 20 | సా6.17 | ధనుస్సు |
| జన | 13 | మ2.30 | మకరం |
| ఫిబ్ర | 06 | ఉ11.44 | కుంభం |
| మార్చి | 02 | ఉ11.28 | మీనం |

**గురుడు :** 12.09.2017 ఉ5.58 వరకు కన్యారాశిలోను తదుపరి తులారాశిలో సంచారం

**శని** – సంవత్సరాది నుండి 20.06.2017 తె3.24 వరకు ధనుస్సురాశి యందుఉండును, తదుపరి వృశ్చిక రాశిలో ఉండును, తిరిగి 26.10.2017 మ 2.04 నుండి ధనుస్సు రాశి యందు సంచారము చేయును.

**రాహువు :** సంవత్సరాది నుండి 17.08.2017 తె4.58 వరకు సింహరాశి యందు తదుపరి కర్కాటక రాశి యందు సంచారం చేయును.

**కేతువు :** సంవత్సరాది నుండి 17.08.2017 తె4.58 వరకు కుంభరాశి యందు తదుపరి మకర రాశి యందు సంచారం చేయును.

**చంద్రుడు** – రోజు వారీ నక్షత్రాన్ని బట్టి చంద్రుడు రాశి సంచారం జరుగును.

**గమనిక** – పై గ్రహ సంచారాన్ని బట్టి ఆయా రాశులలో గ్రహాలను స్పష్టంగా వేసుకోవచ్చును.

## 2017-2018 శ్రీ హేమలంబ నామ సంవత్సర మాసాధిపతుల చక్రము

| తెలుగు మాసములు | ప్రారంభ ఇంగ్లీషు తేదీలు | అశ్విని మఖ మూల | భరణి పుబ్బ పూర్వాషాఢ | కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ | రోహిణి హస్త శ్రవణం | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆరుద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూర్వాభాద్ర | పుష్యమి అనూరాధ ఉత్తరాభాద్ర | ఆశ్రేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చైత్రము | 28.03.2017 | బుధ | రాహు | గురు | కేతు | చంద్ర | శని | శుక్ర | కుజ | రవి |
| వైశాఖము | 27.04.2017 | కేతు | చంద్ర | శని | శుక్ర | కుజ | రవి | బుధ | రాహు | గురు |
| జ్యేష్ఠము | 26.05.2017 | రవి | బుధ | రాహు | గురు | కేతు | చంద్ర | శని | శుక్ర | కుజ |
| ఆషాఢము | 25.06.2017 | గురు | కేతు | చంద్ర | శని | శుక్ర | కుజ | రవి | బుధ | రాహు |
| శ్రావణము | 24.07.2017 | బుధ | రాహు | గురు | కేతు | చంద్ర | శని | శుక్ర | కుజ | రవి |
| భాద్రపదము | 22.08.2017 | శని | శుక్ర | కుజ | రవి | బుధ | రాహు | గురు | కేతు | చంద్ర |
| ఆశ్వయుజము | 21.09.2017 | రవి | బుధ | రాహు | గురు | కేతు | చంద్ర | శని | శుక్ర | కుజ |
| కార్తీకము | 20.10.2017 | శుక్ర | కుజ | రవి | బుధ | రాహు | గురు | కేతు | చంద్ర | శని |
| మార్గశిరము | 19.11.2017 | బుధ | రాహు | గురు | కేతు | చంద్ర | శని | శుక్ర | కుజ | రవి |
| పుష్యము | 19.12.2017 | శని | శుక్ర | కుజ | రవి | బుధ | రాహు | గురు | కేతు | చంద్ర |
| మాఘము | 18.01.2018 | రవి | బుధ | రాహు | గురు | కేతు | చంద్ర | శని | శుక్ర | కుజ |
| ఫాల్గుణము | 16.02.2018 | శుక్ర | కుజ | రవి | బుధ | రాహు | గురు | కేతు | చంద్ర | శని |

## మాసాధిపతుల ఫలితములు

1. రవి ఫలములు – రాజకీయ గోష్టి, వింత వార్తలను వినుట, ప్రయాణములు, ఉద్యోగ ప్రయత్నములు, అధికారులతో పరిచయం, ధైర్యం, ధనలాభ విజయము, స్థాన చలనము.

2. చంద్ర ఫలములు – నీటి ప్రయాణం, తలచిన పనులయందు జయం, స్త్రీసౌఖ్యం, శుభకార్య ప్రసంగములు సుఖ భోజనం, మంచి ఉత్తరములు వచ్చుట, వ్యాపార లాభములు, ఉద్యోగ వ్యవహార లాభములు, గౌరవము దేవ బ్రాహ్మణ భక్తి.

3. కుజ ఫలములు – భూ, వన సంచారములు స్థిరాస్తులను కొనుట వ్యవహార చిక్కు, జాతి విరోధములు, రక్త దర్శనం, మనోకాఠిన్యత, ఉద్యోగములో స్థాన చలనములు లేక సెలవులు పెట్టుట.

4. బుధ ఫలములు – వ్యాపార వృద్ధి, గృహ జీవితానందము, సుఖ భోజనము, యుక్తిగా వ్యవ హరించుట, బంధుమిత్ర సమాగమములు, గృహమందు శుభములు జరుగుట, యత్నీకృత కార్యలాభం.

5. గురు ఫలములు – ఆరోగ్యం, కృషివృద్ధి, ధనలాభములు, ఉద్యోగ లాభం, దేవబ్రాహ్మణ భక్తి, పుణ్యక్షేత్ర సంచారములు. సత్కార్యాచరణం, స్త్రీ సౌఖ్యం, సంతానాభివృద్ధి, విద్యాభివృద్ధి, జయం, భూ గృహ లాభములు, సుఖ జీవనము.

6. శుక్ర ఫలములు–గృహమున శుభకార్యములు చేయుట, స్త్రీసౌఖ్యం, కృషి వృద్ధి, ధనధాన్య వృద్ధి, భూగృహ లాభములు, పరీక్షలలో జయం, గృహజీవితానందము స్త్రీలతో విరోధం.

7. శని ఫలములు – తలచిన కార్యములందు విఘ్నములు, నువ్వులు, మినుములు, ఆముదాలు, ఉప్పు, నూనెల వల్ల లాభం.

8. రాహు ఫలములు – ఆచారం తక్కువ, ధన వ్యయం, కుటుంబ, సంతాన పీడలు, పర్వతవన ప్రదేశ సంచారములు, ఇతర కులముల వారితో స్నేహం ఆశాభంగములు, విద్యావిఘ్నం, దగాలు పొందుట, యుక్తిగా వ్యవహరించుట, వ్యసనముల గూర్చి ఖర్చు.

9. కేతు ఫలములు – ఈశ్వర భక్తి, ధార్మిక చింతన అకస్మాత్తుగా ధనలాభం, ప్రయాణం, లోభత్వం, విరక్తి.

## వాస్తు విషయములు

- ఇంటికి దక్షిణము స్థలములో దక్షిణము నామమాత్రము ఖాళీవదలి బలమైన షెడ్డులు, గోదాములు, చుట్టు ఇండ్లు గాని నిర్మించుకోవాలి. అసలు ఇంటి కంటే దక్షిణము ఇండ్ల పునాదిపై కప్పు మెరకగా ఉండాలి.
- తూర్పు రోడ్డు ఉండి స్థలము కంటే రోడ్డు మెరకగను, స్థలము యొక్క పడమర భాగము పల్లముగా వున్న పడమర ఖాళీ వీలున్నంత తక్కువగా ఉండునట్లు గోడతోగాని దడితో గాని వేరు చేయాలి.
- సింహద్వారము లేక ముఖద్వారమునకు సూటి ఉండునడక ఆపి తూర్పు ఈశాన్యము గేటు నుండి రాకపోకలు పెంచాలి. అప్పుడు ఇంటి తూర్పు రోడ్డు మెరక దృష్టికి కనబడకుండా ఉండి కొంత దోషతీవ్రత తగ్గుతుంది.

## పండుగలు - పర్వదినాలు - ముఖ్య దినాలు

హిందూ పండుగలను మాత్రమే ఇక్కడ ఇస్తున్నాము. అన్య మతస్థుల విషయాలు ఇక్కడ ఇవ్వడంలేదు. కారణం పంచాంగాన్ని నమ్మరు కనుక. పంచాంగాన్ని నమ్మితే సూర్య, చంద్రులను నమ్మాలి. సూర్య, చంద్రులను నమ్మితే సృష్టించిన శివున్ని నమ్మితీరాలి. శివున్ని నమ్మితే వేదాన్ని నమ్మాలి. ఒకవేళ నమ్మితే అన్యమతస్తులం కాదని హిందువులమేనని ఒప్పుకుని తీరాలి, తప్పదు మరి....మిగతా పంచాంగ కర్తలు కూడా హిందూ పండుగలను మాత్రమే వ్రాయమని, ఇతర మతస్తులవి పంచాంగంలో వ్రాయవద్దని మనవి చేస్తున్నాము.

**చైత్ర మాసము**

మార్చి

28 **ఉగాది**,సంవత్సరాది, వసంత నవరాత్ర ఆరంభం, వేప ఆకును తినవలెను. ఉదక దానము, చలివేంద్రములు ఏర్పాటు ప్రతీ ఇంటిపై కాషాయ ధ్వజమును ఎగురవేయవలెను. ఆర్.యస్.యస్వ్యవస్థాపకులు **డా॥ హెడ్గేవార్ జయంతి**

29 చంద్ర దర్శనం,దక్షిణ శృంగం

30 ఆందోళినీ వ్రతం,సౌభాగ్య గౌరీవ్రతం,డోలోత్సవం మత్స్య జయంతి

31 గణేశ దమన పూజ,

ఏప్రియల్

1 లక్ష్మీ పూజ,హయవ్రతము, నాగపూజ,

2 స్కంద దమనం

3 సూర్య దమనం

4 అశోకాష్ఠమి,భవానీ జయంతి

5 శ్రీరామ (నవమి)జన్మదినం, కళ్యాణం కాదు పట్టాభిషేకం చేయాలి

6 ధర్మరాజ దశమి కామద ఏకాదశి

7 వామన ద్వాదశి

8 అనంగ త్రయోదశి శని త్రయోదశి

9 చైత్ర(మదన) పూర్ణిమ,

15 సంకట హర చతుర్థి

22 వరూధినీ ఏకాదశి

25 మాసశివరాత్రి కష్టాంగారకచతుర్దశి

26 అమావాస్య

**వైశాఖ మాసము**

27 చంద్ర దర్శనం, దక్షిణశృంగం

28 అక్షయతృతీయ, సింహాచల చందనోత్సవం, పరశురామజయంతి,

29 గంగాస్నానం

30 శంకరాచార్యజయంతి

మే

2 గంగాజయంతి

3 బుధాష్టమి

6 మోహినీఏకాదశి,అన్నవరమున సత్యదేవుని కల్యాణం

7 పరశురామద్వాదశి

9 నరసింహ జయంతి

10 కూర్మజయంతి పూర్ణిమ,అర్ధనారీశ్వరవ్రతం

14 సంకష్ట హర చతుర్థివ్రతం

21 హనుమజ్జయంతి

22 అపరఏకాదశి

24 మాసశివరాత్రి

25 అమావాస్య

**జ్యేష్ఠ మాసము**

26 కరవీరవ్రతం

27 చంద్ర దర్శనం

28 రంభాతృతీయ

29 ఉమావతారం

31 వనగౌరీవ్రతం

జూన్

4 దశహరావ్రతం

4 నిర్జలేకాదశి

6 రామలక్ష్మణద్వాదశి

9 వృషభ పూజా,జ్యేష్ఠ పూర్ణిమ భార్గవరాకావ్రతం

13 సంకష్ట హరచతుర్థి

17 త్రిలోచనపూజా

20 యోగినీఏకాదశి

22 మాసశివరాత్రి

23 వటసావిత్రివ్రతం,అమావాస్య

**ఆషాఢ మాసము**

25 చంద్రదర్శనం

26 పూరీజగన్నాథరథయాత్ర

27 భౌమచతుర్థి

28 స్కంద పంచమి

29 కుమారషష్ఠి

30 వివస్వతసప్తమి

జూలై

3 లక్ష్మీవ్రతారంభం

4 శయన ఏకాదశి తొలి ఏకాదశి చాతుర్మాసారంభం

9 వ్యాస(గురు)పూర్ణిమ సింధూస్నానపుణ్యదినం

8 గోపద్మవ్రతం

11 చాతుర్మాస్యద్వితీయ అశూన్యశయనవ్రతం

12 సంకష్ట హరచతుర్థి

19 కామికాఏకాదశి

21 మాసశివరాత్రి
23 అమావాస్య

**శ్రావణ మాసము**

24 చంద్ర దర్శనం
25 స్వర్ణగౌరీవ్రతం
26 నాగ చతుర్థి
27 నాగపంచమి
గరుడ పంచమి
28 సూర్యషష్ఠీవ్రతం
కల్కిజయంతి
30 భానుసప్తమి

**ఆగష్టు**

2 దధివ్రతారంభం
3 పుత్రదఏకాదశి
గురుఏకాదశివ్రతం
4 దామోదర ద్వాదశి
వరలక్ష్మీవ్రతం
5 శని త్రయోదశి
7 శ్రావణ పూర్ణిమ
హయగ్రీవావతారం
ఉపాకర్మ,రక్షాబంధన్
11 సంకట హరచతుర్థి
14 శీతలావ్రతం
దశఫలవ్రతం,కృష్ణాష్టమి
18 అజఏకాదశి
19 శని త్రయోదశి
20 మాసశివరాత్రి
21 అమావాస్య
అమాసోమవ్రతం

**భాద్రపద మాసము**

23 గజగౌరీవ్రతం
చంద్రదర్శనం
24 షోడశోమావ్రతం
వరాహజయంతి
25 వినాయక చవితి
26 ఋషిపంచమి
27 పాపహర షష్టి
28 అముక్తాభరణ సప్తమి
29 దూర్వాష్టమివ్రతం
30 నంద నవమి
31 క్షీరవ్రతారంభం
గజలక్ష్మీవ్రతం

**సెప్టెంబరు**

1 పరివర్తన ఏకాదశి
2 వామనజయంతి
5 అనంతపద్మనాభవ్రతం
6 ఉమామహేశ్వరవ్రతం
మహాలయారంభం
8 బృహత్యుమావ్రతం
9 వాస్తుపురుషజయంతి
సంకటహరచతుర్థి
11 చంద్రషష్ఠీవ్రతం
కపిలషష్టి
భరణీమహాలయం
13 మధ్యాష్టమి,రుద్రాష్టమి
16 ఇంద్ర ఏకాదశి
17 యతీనాంమహాలయం
18 గజచ్ఛాయా
విషశస్త్రాదిహతమహాలయం
మాసశివరాత్రి
కష్టాంగారకచతుర్దశి
20 అమావాస్య, కుశగ్రహణం

**ఆశ్వయుజ మాసము**

21 శరన్నవరాత్రి,చంద్ర దర్శనం
22 ప్రీతిద్వితీయ
23 స్తనవృద్ధిగౌరీవ్రతం
25 ఉపాంగలలితావ్రతం
27 మూల-సరస్వతి పూజ
28 కాళికాష్టమి,దుర్గాష్టమి
29 మహర్నవమి
30 విజయదశమి
బుద్ధజయంతి

**అక్టోబరు**

1 పాశాంకుశఏకాదశి
2 పద్మనాభద్వాదశి
5 కౌముదీపూజ,దానఫలవ్రతం
పూర్ణిమ,వాల్మీకి జయంతి
8 అట్లతదియ
చంద్రోదయగౌరీవ్రతం
9 సంకటహరచతుర్థి
15 రమాఏకాదశి
18 నరక చతుర్దశి
యమతర్పణం
మాసశివరాత్రి
19 కేదారవ్రతం
దీపావలిఅమావాస్య

**కార్తీక మాసము**

20 బలిపాద్యమి
21 చంద్రదర్శనం,యమపూజ
ధన్వంతరిద్వితీయ
22 త్రిలోచనగౌరీపూజ
23 నాగచతుర్థి
26 అగ్నిపూజనం
28 గోష్టాష్టమీవ్రతం
29 అక్షయనవమీవ్రతం
30 యాజ్ఞవల్క్యజయంతి
31 బోధన ఏకాదశి

**నవంబరు**

1 యోగీశ్వరద్వాదశి
క్షీరాబ్ధిద్వాదశి
చాతుర్మాసంపూర్తి
2 వైకుంఠచతుర్దశి
3 తులసీవ్రతోద్యాపనం
జ్వాలాతోరణం
4 పూర్ణిమ
7 సంకట హరచతుర్థి
14 ఉత్థానఏకాదశి
15 యమప్రీతిదీపదానం
16 మాసశివరాత్రి
18 అమావాస్య
గీతాజయంతి

**మార్గశిర మాసము**

20 చంద్ర దర్శనం
24 సుబ్రహ్మణ్యషష్టి
26 మిత్రసప్తమి
భానుసప్తమి
29 మోక్షదఏకాదశి
30 మత్స్యద్వాదశి
గురుఏకాదశివ్రతం

**డిసెంబరు**

1 హనుమద్వ్రతం

2 పాషాణచతుర్దశి

3 పూర్ణిమ, దత్తజయంతి చంద్రపూజా

6 సంకట హరచతుర్థి

9 త్రిస్రోష్టకాలు

10 కాలభైరవాష్టమి

13 సఫలఏకాదశి

16 మాసశివరాత్రి శని త్రయోదశి

18 అమావాస్య అమాసోమవ్రతం

**పుష్య మాసము**

19 చంద్రదర్శనం

24 తుళువషష్టి

29 పుత్రద-ముక్కోటి ఏకాదశి

30 కూర్మద్వాదశి

**జనవరి**

1 పూర్ణిమ

5 సంకట హరచతుర్థి

8 తిస్రోష్టకాలు

12 షట్తిలఏకాదశి వివేకానందజయంతి

13 భోగి

14 సంక్రాంతి

15 కనుమ, మాసశివరాత్రి

16 ముక్కనుమ, అమావాస్య

**మాఘ మాసము**

18 మాఘస్నానం చంద్ర దర్శనం

21 తిల-కుందచతుర్థి

22 మదనపంచమి

24 రథసప్తమి సూర్యచంద్రవ్రతం

25 భీష్మాష్టమి భీష్మతర్పణం

26 భారతమాత పూజోత్సవం

27 జయ-భీష్మఏకాదశి

28 భీష్మద్వాదశి

30 సింధూస్నానపుణ్యదినం మహామాఘి

**ఫిబ్రవరి**

3 సంకట హరచతుర్థి

6 త్రిస్రోష్టకాలు

11 విజయఏకాదశి

14 మాసశివరాత్రి మహాశివరాత్రి

15 అమావాస్య

**ఫాల్గున మాసము**

17 చంద్రదర్శనం

19 శాంతచతుర్థి

26 అమలఏకాదశి

27 నృసింహద్వాదశి కామదహనం

**మార్చి**

1 హోళికాపూర్ణిమ మదనపూర్ణిమ

2 వసంతోత్సవం

5 సంకట హరచతుర్థి

8 త్రిస్రోష్టకాలు

13 పాపమోచనఏకాదశి

15 మాసశివరాత్రి

17 అమావాస్య

## 18 విలంబ ఉగాది

**ఈ పుణ్య కాలముల యందు పితృదేవతలకు పిండ ప్రదానములు,తర్ప ణములు చేసినచో వంశాభివృద్ధి కలుగును. దానములు, ధర్మములు ఆచరిం చుటకు శుభము. కోటి రెట్లు ఫలము.**

## శ్రీహేమలంబలో సూర్యసంక్రమణ- పుణ్యకాలాలు

**మేష** 13-4-2017 రా 1.56 13 రా 9.56 నుండి 14 ఉ 5.56 వరకు విషువత్ పుణ్యకాలము

**వృషభ** 14-5-2017 రా 10.48 14 సా 4.24 నుండి రా 10.48 వరకు హరిపద పుణ్యకాలము

**మిధున** 14-6-2017 తె 5.24 14 తె 5.24 నుండి 15 ఉ 11.48 వరకు షడశీతి పుణ్యకాలము

**కర్కాటక** 16-7-2017 సా 4.16 15 తె 4.16 నుండి 16 సా 4.16 వరకు దక్షిణాయన పుణ్యకాలము

**సింహ** 16-8-2017 రా 12.38 16 రా 12.38 నుండి 17 ఉ 7.02 వరకు హరిపద పుణ్యకాలము

**కన్య** 16-9-2017 రా 12.32 16 రా 12.32 నుండి 17 ఉ 6.56 వరకు షడశీతి పుణ్యకాలము

**తులా** 17-10-2017 మ 12.27 17 ఉ 8.27 నుండి సా 4.27 వరకు విషువత్ పుణ్యకాలము

**వృశ్చిక** 16-11-2017 మ12.14 15 తె 5.50 నుండి 16 రా 6.38 వరకు హరిపద పుణ్యకాలము

**ధనుస్సు** 15-12-2017 రా 2.52 15 రా 2.52 నుండి 16 ఉ 9.16 వరకు షడశీతి పుణ్యకాలము

**మకర** 14-1-2018 మ 1.38 14 మ 1.38 నుండి రా 1.38 వరకు ఉత్తరాయన పుణ్యకాలము

**కుంభ** 12-2-2018 రా 2.39 12 రా 8.15 నుండి రా 2.39 వరకు హరిపద పుణ్యకాలము

**మీన** 14-3-2018 రా 11.34 14 రా 11.34 నుండి తె 5.58 వరకు షడశీతి పుణ్యకాలము

**ఈ పుణ్య కాలముల యందు పిత్రు దేవతలకు పిండ ప్రదానములు, తర్పణములు చేసినచో వంశాభివృద్ధి కలుగును. దానములు,ధర్మములు ఆచరించుటకు శుభము.కోటి రెట్లు ఫలము.**

## మాధ్వ పుణ్యదినములు

మార్చి 29 వేదవ్యాస తీర్థర
ఏప్రి 05 కవీంద్ర తీర్థర
09 సత్యవ్రత తీర్థర
14 వాగీస తీర్థర
24 సత్య విజయ తీర్థర
28 విద్యాదిరాజ తీర్థర
మే 01 రామచంద్ర తీర్థర
27 సత్యసంధ తీర్థర
జూన్ 07 సత్యాభినవ తీర్థర
11 సత్యపూర్ణ తీర్థర
12 రఘువర తీర్థర
జూలై 02 సత్యాధిరాజ తీర్థర
04 శ్రీజయ తీర్థర
23 శ్రీసత్యాధీన తీర్థర

30 సత్యవర తీర్థర
ఆగష్టు 09 రాఘవేంద్ర తీర్థర
31 సత్యేష్టకామ తీర్థర
సెప్టె 20 మాధవ తీర్థర
27 సత్యవరాయణ తీర్థర
28 సత్యపరాక్రమ తీర్థర
అక్టో 30 సత్యవర తీర్థర
31 వేదనిధి తీర్థర
నవం 07 విద్యానిధి తీర్థర
17 పద్మనాభ తీర్థర
29 సత్యనిధి తీర్థర

30 సత్యనాథ తీర్థర
డిసెం 14 రఘునాథ తీర్థర
30 రఘూత్తమ తీర్థర
జన 07 సత్యకామ తీర్థర
08 నరహరి తీర్థర
15 విద్యాధీస తీర్థర
16 పురందర దాసరి
26 ఆనంద తీర్థర
ఫిబ్ర 17 సత్యబోధ తీర్థర
18 వాదిరాజ తీర్థర
19 వ్యాసరాజస్వామీగళు
21 సత్యవ్రత తీర్థర

## వైష్ణవ తిరు నక్షత్రములు

2017
మార్చి 29 పెరియ పెరుమాళ్ తి.న
ఏప్రి 01 నంబెరుమాళ్ తి.న
26 వటుకనంబి తి.న
28 ఉయ్యకొండార్ తి.న
30 ఎరుంబమానార్ తి.న
మే 01 చక్రవర్తి తిరుమానార్ తి.న
08 కడంబియాచార్ తి.న
09 మధురకవి యాళ్వార్ తి.న
10 పెరియనంబి తి.న
26 తిరుక్కోటి యార్నంబి తి.న
జూన్ 04 దేవీ ప్పెరుమాళ్ తి.న
06 హళయసింగర్ తి.న
06 పెరియతిరు మడైనంబి తి.న
07 నమ్మాళ్వార్ తి.న
08 శ్రీపరాశరబట్టర్ తి.న
09 తిరువంగ ప్పెరుమాళ్ తి.న
జూలై 03 ప్పెరియాళ్వార్ తి.న
03 నడకుత్తిర్ విధిపిళ్ళై తి.న
03 తిరువరంగ పెరుమానార్ తి.న
05 నాధమునిగళ్ తి.న
08 తిరుయాళ్వార్ తి.న
27 మారనేరనంబి తి.న
26 చూడికుడుత్తనాంచార్ తి.న
26 శ్రీఆండాళ్ తి.న
26 కందాడైకోనప్ప తి.న
28 బదరీనారాయణ పెరుమాళ్ తి.న
ఆగష్టు 06 ఆళవందార తి.న
06 పుణ్డరీకాక్షుల తి.న
07 తెర్క్యాళ్వార్ తి.న
సెప్టె 12 శ్రీకణ్ణపిరిన్ తి.న
12 పెరియనాచ్చారిపిళ్ళై తి.న

12 నయనారచ్చాం పిళ్ళై తి.న
24 తిరుమళైనంబి తి.న
అక్టో 01 వేదాంత దేశికర్ తి.న
01 తిరువేంగడత్తార్ తి.న
25 మణవాళ మహామునుల తి.న
26 గురువ యిప్పినార్ తి.న
26 శేనైమొదలియార్ తి.న
27 వేలాంజీలైయప్పన్ తి.న
28 పోయిఘయాళ్వార్ తి.న
28 పిళ్ళై లోకాచార్య తి.న
29 పూదత్తాళ్వార్ తి.న
29 తిరుమళైయాండార్ తి.న
30 పేయాళ్వార్ తి.న
నవ 05 కూపకులోత్తమ దాసర్ తి.న
19 కోటికన్యాదాన తాతాచార్ తి.న
డిసె 02 మాధవ పెరుమాళ్ తి.న
03 తిరుమంగయాళ్వార్ తి.న
03 నంబిపిళ్లై యాల్వార్ తి.న
04 తిరుప్పాణి యాళ్వార్ తి.న
16 నాలూచార్ తి.న
17 తొండరడిప్పోడి యాళ్వార్ తి.న
17 పెరియనంబి తి.న
జన 28 కోపలూన్-ఎంబెరుమానార్ తి.న
30 ఎంబురై తి.న
ఫిబ్ర 02 తిరుముడిశై యాళ్వార్ తి.న
05 కూరత్తాళ్వార్ తి.న
08 గురుకావలప్పన్ యాళ్వార్ తి.న
12 సొట్టయినంబియాళ్వార్ తి.న
25 తిరుకచ్చినంబి తి.న
26 కులశేఖరాళ్వార్ తి.న
26 తిరుమలైయాండార్ తి.న
28 పిళ్లైయురంగావిల్ తి.న
మార్చి 01 మరణంగాల్ నంబి తి.న

# 2017-2018 శ్రీ హేమలంబ నామ సంవత్సర అశ్వనాది కార్తెల వర్షయోగ చక్రము

| కార్తె | తేది | ప్రవేశనక్షత్రం | వాహనం | ఫలం |
|---|---|---|---|---|
| రోహిణి | మే 25 | కృత్తిక | అశ్వం | పర్వతవృష్టి |
| మృగశిర | జూన్ 8 | అనూరాధ | మేక | అల్పవృష్టి |
| ఆరుద్ర | జూన్ 21 | కృత్తిక | గాడిద | అల్పవృష్టి |
| పునర్వసు | జూలై 5 | అనూరాధ | నక్క | అల్పవృష్టి |
| పుష్యమి | జూలై 19 | రోహిణి | నెమలి | ఖండవృష్టి |
| ఆశ్రేష | ఆగ 2 | జ్యేష్ఠ | ఎలుక | అల్పవృష్టి |
| మఖ | ఆగ 16 | రోహిణి | మేక | అల్పవృష్టి |
| పుబ్బ | ఆగ 30 | జ్యేష్ఠ | ఏనుగు | పర్వతవృష్టి |
| ఉత్తర | సెప్టె 13 | మృగశిర | మండూక | సువృష్టి |
| హస్త | సెప్టె 26 | జ్యేష్ఠ | నెమలి | ఖండవృష్టి |
| చిత్త | అక్టో 10 | మృగశిర | ఎలుక | అల్పవృష్టి |
| స్వాతి | అక్టో 23 | జ్యేష్ఠ | మేక | అల్పవృష్టి |
| విశాఖ | నవ 6 | రోహిణి | గాడిద | అల్పవృష్టి |
| అనూరాధ | నవ 19 | అనూరాధ | ఎలుక | అల్పవృష్టి |

# శ్రీ హేమలంబ నామ సం॥ర వర్ష ధాన్యాది ప్రమాణములు

వర్షం - 5
ధాన్యం - 7
శీతం - 13
తృణం - 7
ఉష్ణం - 17
మారుతం - 13
ప్రజావృద్ధి - 15
తన్నాశ - 15
రాజవిద్వరం - 11
ఉగ్రం - 5
పుణ్యం - 5
పాపం - 5
వ్యాధి - 18
ఉపశమనం - 24
ఆచారం - 27
అనాచారం - 27
జననం - 24
మరణం - 24
దేశోపప్లవం - 6
దేశస్వాస్థ్యం - 27
చోరభయం - 15
తన్నాశ - 24
అగ్నిభయం - 6
శాంతి - 15
మృగోపద్రవం - 3
మృగక్షయం - 24
కీటకభయం - 3
తన్నాశ - 18
మూషకవృద్ధి - 21
తన్నాశ - 12
సర్పవృద్ధి - 18
తన్నాశ - 15
కామం - 3
లోభం - 9
మోహం - 9
మదం - 3
మాత్సర్యం - 18
సుఖం - 3
దు:ఖం - 9
భోగం - 12
విడంబం - 12
ద్వేషం - 9
ప్రతిష్ఠ - 3
అప్రతిష్ఠ - 21
ద్యూతం - 12
మత్తత - 27
పురుషోత్పత్తి - 15
స్త్రీ ఉత్పత్తి - 27
ధాతు - 12
భయం - 21
శౌర్యం - 3

దుష్టనిగ్రహం - 9
శిష్టపాలనం - 15
సత్యం - 21
అసత్యం - 27
విశ్వాసం - 6
అవిశ్వాసం - 9
దయ - 12
నిర్దయ - 15
న్యాయం - 18
అన్యాయం - 21
సస్యవృద్ధి - 7
తన్నాశ - 4
పశువృద్ధి - 4
తన్నాశ - 7
శుకవృద్ధి - 7
తన్నాశ - 7
ద్రుమకీట - 8
తన్నాశ - 8
క్షుధా - 1
తృష్ణ - 3
నిద్ర - 11
ఆలస్య - 5
ఉద్యోగం - 11
శాంతం - 13
క్రోధం - 11
దంబం - 3
మిత్రభేదం - 1
ఇష్టత - 13
రసనిష్పత్తి - 7
ఫలనిష్పత్తి - 11
ఉత్సాహం - 9
జ్ఞానం - 17
అజ్ఞానం - 11
కాపట్యం - 3
నిష్కాపట్యం - 13
ధార్మికం - 17
అధార్మికం - 1
గోమాయువృద్ధి-7
తన్నాశ - 13
సస్యకీట - 4
తన్నాశ - 13
శరభవృద్ధి - 1
తన్నాశ - 1
మశకవృద్ధి - 1
తన్నాశ - 7
మత్కుణ - 4
తన్నాశ - 7
వృశ్చికవృద్ధి - 10
తన్నాశ - 10
వ్యాఘ్రవృద్ధి - 13
తన్నాశ - 10

పక్షివృద్ధి - 3
తన్నాశ - 2
ధేనువృద్ధి -1
తన్నాశ - 1
మహిషవృద్ధి - 5
తన్నాశ - 5
మృగవృద్ధి - 1
తన్నాశ - 4
ఛాగవృద్ధి - 4
తన్నాశ - 1
అశ్వవృద్ధి - 3
తన్నాశ - 3
గజవృద్ధి - 1
తన్నాశ - 1
ఉష్ట్రవృద్ధి - 2
తన్నాశ - 2
విప్రవృద్ధి - 3
తన్నాశ - 2
క్షత్రియవృద్ధి - 5
తన్నాశ - 4
వైశ్యవృద్ధి - 4
తన్నాశ - 1
శూద్రవృద్ధి - 5
తన్నాశ - 3
మ్లేచ్ఛవృద్ధి - 4
తన్నాశ - 4
సంకరవృద్ధి - 3
తన్నాశ - 1
నవరత్నాభివృద్ధి- 3
తన్నాశ - 5
మరకతవృద్ధి - 2
మాణిక్యవృద్ధి - 2
వజ్రవృద్ధి - 4
వైఢూర్యవృద్ధి - 5
గోమేధికవృద్ధి - 1
పుష్యరాగవృద్ధి - 1
ఇంద్రనీలవృద్ధి - 1
ప్రవాళవృద్ధి - 1
మౌక్తికవృద్ధి - 1
ఇతరరత్నవృద్ధి - 1
సువర్ణవృద్ధి - 0
రజితవృద్ధి - 2
తామ్రవృద్ధి - 8
కాంశ్యవృద్ధి - 2
లోహవృద్ధి - 12
అయంవృద్ధి - 8
త్రపువృద్ధి - 10
సీసంవృద్ధి - 10
రసవృద్ధి - 6
వ్రీహి - 16
శాలి - 16

కుళుత్థ - 10
తిలవృద్ధి - 2
మాషవృద్ధి - 8
ముద్గ - 2
సర్షప - 16
చణక - 8
అఢక - 10
గోధూమ - 16
కోద్రవ - 2
ప్రియం - 6
యవ - 14
శ్యామ - 16
రాజమాష - 12
నీవార - 2
శింబిధా - 2
పనస - 22
నారికేళ - 19
మాతు - 22
జంబీర - 4
ఖర్జూర - 10
రంభాఫలం - 19
చూత - 7
కపిత్థ - 19
తింత్రిణి - 25
ధాత్రి - 1
అతివృష్టి - 17
అనావృష్టి - 17
మూషక - 11
శలభ - 3
శుకవృద్ధి - 9
స్వచక్ర - 3
పరచక్ర - 17
స్వప్నం - 0
సుషుప్తి - 2
జాగ్రత - 8
పైశూన్య - 2
క్రోధం - 12
సంగమం - 8
జ్ఞానం - 10
అజ్ఞానం - 10
భక్తి - 6
ధ్యానం - 0
అండజ - 5
స్వేదజ - 7
ఉద్భిజ - 13
జరాయుజ - 7
స్థావర - 17
జంగమ - 13
విద్యుత్ - 1
శిలాపాతం - 5
గర్జితం - 0

## ధరలు-వరలు

**వివిధ వస్తువుల ధరలు హెచ్చు తగ్గులు ఈ విధముగా ఉన్నవి.ఇవి కేవలం సూచనప్రాయం మాత్రమే.కారణం ప్రస్తుతము ఎక్కడ చూసినా అన్యాయం,అవినీతి ఎక్కువగా ఉన్నాయి.అసలు ధరలు ఎంతంత పెరుగుతున్నాయో లేదో మనమే ఆలోచించుకోవాలి. అందుకోసం ముఖ్యమైన కొన్ని వస్తువులు శాస్త్ర ప్రకారం,వర్తమాన మార్కెట్ విలువలకు సమతూకంగా ఇవ్వడం జరుగుతోంది. ఇందులో ధర పెరుగుతుందా, తగ్గుతుందా అనేదే విషయం.**

ధాన్యము,మిర్చి,బంగారం,ఫ్యాన్సీ,సుగంధ ద్రవ్యాలు,కర్ర సామాగ్రి ధరలు రెట్టింపగును.

గోధుములు, వస్త్రములు, నూనె,ఎర్రధాన్యం, నల్లధాన్యం, పొగాకు, దుంప, చింతపండు, వెండి, ఇత్తడి, సిమెంటు, ఎలక్ట్రానిక్ వస్తువులు,విలాస వస్తువులు ధరలు పెరుగును.

కొబ్బరి, నేయి, పసుపు, రాగి, ఉల్లి, ఇనుము, పశువులు, పాల ఉత్పత్తులు, నిత్యావసరములు ధరలు సమానముగా ఉండును. పండ్ల జాతులు ధరలు తగ్గును.

### యోగ పంచక ఫలము

1) జ్యేష్ఠ శుక్ల పాడ్యమి - శుక్రవారము అగుట వలన జనులకు సుభిక్షము కలిగి క్షేమ,ఆరోగ్యవంతులై ఉందురు.మంచి వర్షములు పడి పంటలు పండును.

2) ఆషాఢ శుక్ల పంచమీ-బుధవారము అగుట వలన సుభిక్షము, శరీరమునకు ఆరోగ్యము కలుగును.

3) ఆషాఢశుక్ల నవమి-చిత్తా నక్షత్రం అగుట వలన అన్ని పంటలు సమృద్ధిగా పండి,ప్రజలు ఆనందముగా ఉందురు.

4) ఆషాఢ బహుళ ద్వాదశి-రోహిణీ నక్షత్రం అగుట వలన అన్ని పంటలు నశించును.

5) పుష్య బహుళ అమావాస్య-బుధవారం అగుట వలన పశువృద్ధి ఎక్కువగా కలుగును.

### వాతావరణం

గ్రహగతులను,నాడీ యోగములను పరిశీలించగా ఈ సంవత్సరము నందు వాతావరణము క్రింది విధముగా ఉన్నది. ఒక రోజు అటుఇటుగా సరిపోవును. ప్రస్తుతము వాతావరణము విపరీత కాలుష్యముచే ఉన్నందువలన తుఫాను వచ్చినప్పుడు మాత్రమే వర్షములు పడుతున్నది.గమనించండి.

**1) చైత్రము- మార్చి 28 నుండి ఏప్రిల్ 26 వరకు** ఈ మాసమంతయూ ఎక్కువ ఎండగా ఉండి ఉక్కపోయును. వేడి ఎక్కువగా ఉండును.పగలు ఎండగా ఉండును రాత్రులందు కొద్దిపాటి చల్లని గాలులు వీచును.నవమి ప్రాంతంలో చిరుజల్లులు పడును. **2) వైశాఖము-ఏప్రి 27 నుండి మే 25 వరకు** 27-మే10వేడిఎక్కువగుచుండును.పగలు,రాత్రులు ఎక్కువవేడిగాలులచే దాహార్తి ఎక్కువగును. 11-25 అధికమైన వేడి గాల్పులవలన అగ్ని ప్రమాదములు సంభవించును, తీవ్ర తాపముచే ప్రజలు అల్లాడుచుండును. **3)జ్యేష్టము మే 26 నుండి జూన్ 24 వరకు** మే 26-జూన్ 9 చివరిలో సామాన్య వర్షములు పడును.ఎక్కువ ఎండలుంటాయి. 10-24 వర్షములు పడుచుండును,వర్షము పడినను ఉష్ణతాపము ఎక్కువగా ఉండును. **4) ఆషాఢము జూన్ 25 నుండి జూలై 23 వరకు** జూన్ 25- జూలై 9 ఎక్కువ వర్షములు.పగటికాల మందు తాపము కలుగుచుండును. 10-23 సాధారణ వర్షములతోపాటు పిడుగుపాటులు పడును. **5) శ్రావణము జూలై 24 నుండి ఆగష్టు 21 వరకు** జూలై 24- ఆగ 7 వానలు తక్కువ రోజులు పడినను అధికముగా కురియును. 8-21 మబ్బులు,ఎండలు సమపాళలో ఉండును. **6) భాద్రపదము ఆగష్టు 22 నుండి సెప్టెంబరు 20 వరకు** ఆగ 22-సెప్టె 6 అధిక జల్లులు పడుచుండును.వాయుగుండముచే అప్పుడప్పుడు అధిక వర్షములు పడును. 7-20 మిశ్రమ వాతావరణము ఏర్పడును. **7) ఆశ్వయుజము సెప్టెంబరు 21 నుండి అక్టోబరు 19 వరకు** సెప్టె 21-అక్టో 5 ఒక మోస్తరు వర్షములు పడుచుండును. 6-19 అక్కడక్కడ జల్లులు పడుచుండును, కొద్ది చలి ఏర్పడును. **8) కార్తీకము అక్టోబరు 20 నుండి నవంబరు 18 వరకు** అక్టో 20-నవ 4 వాతావరణము సామాన్యముగా ఉన్ననూ, వర్షములు పడే సూచనలు కలవు. 5-18 వాతావరణము సామాన్యము,చలి ఎక్కువగును. **9)మార్గశిరము నవంబరు 19 నుండి డిసెంబరు 18 వరకు** ఈ మాసమంతయూ రాత్రులందు చలి ఎక్కువగా ఉండును. నవంబరు నెలాఖరున అనుకోని తుఫాను ఏర్పడును. **10) పుష్యము డిసెంబరు 19 నుండి జనవరి 17 వరకు** ఈ మాసమంతయూ అక్కడక్కడ ఎక్కువ చలిచే ప్రజలు పీడింప బడుదురు. **11) మాఘము జనవరి 18 నుండి ఫిబ్రవరి 15 వరకు** ఈ మాసమంతయూ ఉదయకాలమందు మంచు తెరలు అధికముగా ఉండును. **12) ఫాల్గుణము ఫిబ్రవరి 16 నుండి మార్చి 17 వరకు** ఈ మాసమంతయూ వేడి ఎక్కువగుచుండును.ఉదయకాలమందు ఆకాశము మేఘావృతమై ఉండును.మాసాంతమున అక్కడక్కడ చిరుజల్లులుపడే అవకాశాలు ఉన్నవి.

## ప్రయాణములకు ఆనందాది యోగములు

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | యోగం రోజు | ఫలితం |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | అనూ | ఉ.షా | శత | ఆనంద 15 | కార్యసిద్ధి |
| భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | కాలదన్డ 27 | కార్యసిద్ధి |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | ధూమ్ర 8 | ధననష్టం |
| రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | ధాత్రీ 14 | కార్యసిద్ధి |
| మృగ | ఆశ్రే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | సౌమ్య 30 | సర్వసౌఖ్యం |
| ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ధ్వాంక్ష 5 | కార్యహాని |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | ధ్వజ 10 | కార్యహాని |
| పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | శ్రీవత్స 3 | లాభం |
| ఆశ్రే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | వజ్ర 2 | కార్యహాని |
| మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆరు | ముద్గర 1 | కలహం |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | ఛత్ర 3 | స్త్రీలాభం |
| ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | మిత్ర 5 | మిత్రలాభం |
| హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్రే | మానస 2 | కార్యలాభం |
| చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆరు | మఖ | పద్మ 1 | ధనలాభం |
| స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | లంబ 3 | కష్టం |
| విశా | పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | ఉత్పాత 4 | ధనలోభం |
| అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | మృత్యు 10 | సర్పదర్శనం |
| జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆరు | మఖ | చిత్త | కాల 5 | అవమానం |
| మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధ 7 | కార్యసిద్ధి |
| పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | శుభ 6 | పనిపూర్తి |
| ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | అనూ | అమృత 2 | కార్యసిద్ధి |
| అభి | పూ.భా | భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | ముసల 8 | దుఃఖం |
| శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గద 40 | చెరుపు |
| ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | మాతఙ్గ 2 | వాహనలాభం |
| శత | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | అనూ | ఉ.షా | రాక్షస 9 | మిత్రకలహం |
| పూ.భా | భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | చర 8 | దుర్వార్తలు |
| ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | స్థిర 3 | సమలాభం |
| రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | వర్ధమాన10 | శివానుగ్రహం |

ప్రయాణకాలంలోఆంజనేయస్వామిని,మృత్యుంజయుదుని స్మరిస్తూండినా శుభము.



# మేషరాశి ఫలితములు

అశ్విని 1,2,3 పాదములు, భరణి, 1,2,3,4 పాదములు
కృత్తిక 1, 2 పాదములు

ఆదాయం - 8 వ్యయం - 14 రాజపూజ్యం - 4 అవమానం - 3

గ్రహగతులను పరిశీలించగా ఈసంవత్సరమంతయు సామాన్య యోగప్రదముగా ఉన్నది. విఘ్నములు కలిగినను పనులు నెరవేరును. తొందరపాటు మాటతనమువలన పట్టింపులుఏర్పడును. ధనసంబంధ వ్యవహారాల్లో సొంతనిర్ణయములు తీసుకొనుటమేలు. సోదరవర్గమునుండి సహాయము అందును. నూతన గృహనిర్మాణము, పంటపొలాలను కొనుగోలుచేయుదురు. ఆడసంతానము వలన కొంతచికాకు ఏర్పడును. కోర్టుకార్యములు,విదేశీ వ్యవహారాలు సంవత్సర చివరకు వాయిదా వేయుట మంచిది. నూతన జీవిత భాగస్వామివలన ధనలాభము కలుగును. ఆరోగ్య విషయమునందు తగుజాగ్రత్తలు తీసుకొనుటమంచిది. పిత్రార్జితముచేతికందును. ఉద్యోగముల యందు ప్రమోషన్లు, వ్యాపారము నందు లాభము కలుగును. లాభసాటి వ్యవహారాలు అనుకూలించును. నిద్రలేమితనమువలన శిరోవ్యాధికలుగును. కాలి సంబంధ వ్యాధులు సంక్రమించును.

వ్యవసాయదారులకురెండు పంటలు కలసివచ్చును. విద్యార్థులకు యోగ ప్రదముగాఉండును. కాంట్రాక్టర్లు,బ్రోకర్లు, ఫైనాన్స్‌వారికి లాభసాటి వ్యాపారము కలుగును. ఫ్యాన్సీ,కిరాణా, వస్త్ర వ్యాపారులకు విశేష యోగప్రధముగా ఉన్నది. మద్యంవిక్రేతలకు, ప్రత్తి,జోళ్ళు వారికి ధనాదాయము ఉన్నను సుఖము కలగదు. సినీరంగమునందు వారికి,కళాకారులకు ప్రోత్సాహక బహుమతులు వచ్చును. పురోహిత,జ్యోతిష,వాస్తు పండితులకు చేయుపనులయందు ఆటంకములు కలిగి తీవ్రనిరాశకు గురిఅగుదురు. డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లకు సంఘమున గౌరవము ఏర్పడును. రాజకీయ నాయకులకు పదవీ భంగముకలుగుచున్నది. ఈ రాశి స్త్రీలకు విశేషముగా మంచిఫలితములు కలుగుచున్నవి.

### నక్షత్ర ఫలితాలు

**అశ్విని 1,2,3,4**-తలచిన కార్యాలన్నీ విజయంతంగా పూర్తి చేసుకో గలుగుతారు. అనారోగ్య బాధలుండవు. సహఉద్యోగులకు సహకరించే అవకాశం లభిస్తుంది. అనుకూల పరిస్థతులేర్పడతాయి. ధనలాభంతో ఆనందంగా ఉంటారు. ప్రయత్న కార్యాలన్నిటిలో సఫలీకృతులవుతారు.

**భరణి 1,2,3,4**-శుభకార్యప్రయత్నాలుసులభంగా నెరవేరతాయి. అద్భుతమైన అవకాశాలనుపొందుతారు. శుభవార్తలువింటారు. ఆత్మీయులసహకారం సంపూర్ణంగా లభిస్తుంది. అధికారులతో గౌరవింపబడుతారు. ఆత్మీయుల సహకారం లభిస్తుంది.

**కృత్తిక 1**- కీర్తి,ప్రతిష్టలు అధికమవుతాయి. వినోదాల్లో పాల్గొంటారు. శుభ వార్తలు వింటారు. నూతనగృహకార్యాలపై శ్రద్ధవహిస్తారు. బంధు,మిత్రులతోకలిసి విందులు,వినోదాల్లో పాల్గొంటారు. స్థిరాస్తులకుసంబంధించినసమస్యలు పరిష్కరింపబడతాయి.

## నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**అశ్విని 1**-గురు,చంద్ర,**అశ్విని 2**-శని,రాహు,**అశ్విని 3**- కుజ,బుధ, **అశ్విని 4**-రవి,కుజ, **భరణి 1**-కేతు,శుక్ర, **భరణి 2**-గురు,శని, **భరణి 3**-బుధ,రవి, **భరణి 4**-కేతు,రాహు,**కృత్తిక 1**-కుజ,శుక్ర గ్రహములకు **జపము,దానము చేయవలెను.**

## మేష రాశి వారి స్వభావము

సామాన్యముగా మధ్యమ దేహముతో నుందురు. కళ్లు ఎర్రగా నుండును. నిశిత దృష్టిని కలిగి యందురు. అగ్నివలె వీరి దేహము వేడిగా నుండును. నిర్భయముగా ఉందురు. ఉద్రేకముతో పనిని చేయుదురు. ఉదార స్వభావము,స్వలాభ పరులుగా నుందురు. ఖర్చును ఎక్కువగా చేయు దురు. అనేక మార్గాలలో కార్యములను సాధింతురు. హక్కులకోసం పోరాడుదురు. అందరిలోనూ ఎక్కువగా మీరే మాట్లాడుతారు. నిష్కర్షగా విషయమును తేల్చుదురు. చిన్న తనము నుండి ఎక్కువ కష్టములచే జీవనమును సాగింతురు. ఇతరులను ఎక్కువగా అనుసరింతురు. స్నేహితులతో జాగ్రత్తగా మెలుగుదురు. తొందరపాటు తగ్గించుకున్న యెడల జీవనము చక్కగా సాగును.

**మాసవారి ఫలితములు**

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు షష్ఠస్థానమున సంచారముచే ఆర్థికపరమైన అంశాలలో జాగ్రత్తవహించుటమేలు తదుపరి సప్తమస్థాన సంచారముచే వ్యవహారములందు జయము కలుగును.

ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు భాగ్యస్థానమున సంచారముచే విదేశీవ్యవహారములు లాభించును. తదుపరి అక్టోబరు 26 వరకు అష్టమస్థాన సంచారముచే ఆరోగ్యసమస్యలు కలుగును. తదుపరి భాగ్యస్థానమున సంచారముచే నిలచిన పనులు పూర్తగును. ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు పంచమస్థాన సంచారముచే ఆలోచనలోమార్పులుసంభవం. తదుపరి చతుర్థస్థాన సంచారముచే గృహమున అశాంతి.

ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు లాభస్థాన సంచారముచే రాజకీయంగాఎదుగుదల. తదుపరి దశమస్థాన సంచారముచే ఉద్యోగమందు మార్పులు.

**ఏప్రిల్ :** హాయిదాపడుతున్న పనులు పూర్తిచేస్తారు. భక్తిశ్రద్ధలతో పూజాపునస్కారాలను నిర్వహిస్తారు.వివాదాలు ఏర్పడినా పరిష్కరించుకుంటారు. రాజకీయ కార్యక్రమాల పట్ల ఆకర్షితులవుతారు.ఉద్యోగ,వ్యాపారాలుసక్రమంగా సాగుతాయి.ఆర్థికస్థితి మెరుగవడంవలన ఉత్సాహంతో ఉంటారు.గతంలో నిలచిన బిల్లులు చెల్లిస్తారు. ప్రముఖులతో పరిచయాలు పెరుగుతాయి. స్థిరాస్తి లావాదేవీలు అనుకూలత ఉంటాయి. **పరిహారాలు : గణపతి అష్టోత్తరము ఉదయ సాయంకాలములు చదవండి**

**మే :** ప్రయాణాలలో శ్రమ కలిగినా ఫలవంతంగానే ఉంటుంది. ఇతరుల ఆశయాలను తెలియచేయడానికి కష్టపడవలసి వస్తుంది.కృషికి తగిన గుర్తింపు ప్రజాదరణ అందుకుంటారు. తీరికలేకుండా సమయాన్నిగడుపుతారు. ఇతరుల సహకారంతో ముఖ్యమైన పనులను మెళకువతో సాధిస్తారు. సకాలంలో కావలసిన వనరులను సమకూర్చుకుంటారు. **పరిహారాలు : సాయిబాబా వారికి 2 చపాతీలు నివేదన చేయండి**

**జూన్ :** కాలానుగుణంగావచ్చే మార్పులనుగురించి అనుగుణంగామసలుతారు.శుభకార్యము లందు పాల్గొని అందరితో కులాసాగా గడుపుతారు. ఇతరుల సహకారంతో నూతన పదవులు పొందుతారు. సమర్థవంతంగా ముఖ్యకార్యాలను చేపడతారు. ఇతరులకు సలహాలిచ్చి వారి సమస్యలు పోయేలాచూస్తారు. **పరిహారాలు : సుబ్రహ్మణ్యపూజ చేసి, పాలు నివేదన చేయాలి**

**జులై :** గృహవాతావరణం ప్రోత్సాహకరంగా ఉండును.రాబడికి మించి వ్యయం ఎక్కువగా ఉండే అవకాశాలు ఉన్నాయి.ఆస్తి లావాదేవీలు, నిర్మాణాలు,ప్రయాణాలు విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకొనుటమంచిది.కుటుంబవ్యక్తుల అవసరాలకు తగిన పనులను చేస్తారు. నూతన పెట్టుబడులు పెడతారు.అధికార ప్రయత్నాలు తగిన విధంగా చేస్తారు. **పరిహారాలు : లవంగాన్ని నాలుక క్రిందిభాగమున పెట్టుకోండి**

**ఆగస్టు :** నూతన వ్యక్తులతో పరిచయం పెంచుకుంటారు.వృత్తి, ఉద్యోగాలలో కొత్త ఒరవడిని సృష్టిస్తారు.పిల్లలవిషయంలో శ్రద్ధనువహించవలసిన అవసరంఉన్నది.అభివృద్ధిపనులు చేపడ తారు. ఆశించిన ఫలితాలను సాధించుటలో సిద్ధహస్తులవుతారు.సభలు,సమావేశాల్లో పాల్గొని తగిన గౌరవాన్నిఅందుకుంటారు. **పరిహారాలు : మినుములు దానం చేయండి**

**సెప్టెంబర్ :** వృత్తి,ఉద్యోగాల్లో వ్యతిరేక సూచనలు కలవు.క్రొత్త ఆదాయమార్గాలను వినియోగించుకొంటారు. కుటుంబసభ్యులతో విందువినోదాలలో పాల్గొంటారు. ఆదాయం ఆశించినంతగా ఉండక పోవచ్చు. ఇతరుల వ్యవహారాలు జాగ్రత్తగా చక్కబెడతారు.అపూర్వ దేవతా దర్శనము వలన మానసిక ప్రశాంతతను పొందుతారు. **పరిహారాలు : రోజూ ఆవుకు 4 అరటిపండ్లు తినిపించండి**

**అక్టోబర్ :**యాగములను నిర్వహిస్తారు.మనోల్లాసముచే జీవనముసాగిస్తారు.విజ్ఞాన వంతమైన విషయాలనుసేకరిస్తారు. అనుకూల శుభవర్తమానాలుఅందుతాయి. దీర్ఘకాల ప్రణాళికలను ప్రారంభిస్తారు. కుటుంబవ్యక్తులు అన్నివిధాలా సహకరిస్తారు.ఆర్థిక లావాదేవీలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.దానధర్మాలకు ధనాన్ని వెచ్చిస్తారు. **పరిహారాలు : దుర్గాసూక్తము చదవండి**

**నవంబర్ :** సాగుతున్న విషయాల్లో అభివృద్ధి కనిపించి ఉపశమనంపొందుతారు. శత్రు వర్గము వారితో దూరంగా ఉండడంశ్రేయస్కరం. లాభసాటి ఒప్పందాలు కుదుర్చుకుంటారు. సన్నిహితుల,మిత్రుల సలహాలకోసం ఎదురుచూస్తారు. విద్యా,సాంస్కృతిక రంగాల్లో ప్రయత్నాలు ఫలప్రదంగా ఉంటాయి. అభిరుచికి తగిన ఆహారాన్నిస్వీకరిస్తారు. **పరిహారాలు : సుబ్రహ్మణ్యపూజ చేసి, పాలు నివేదన చేయాలి**

**డిసెంబర్ :** వ్యవహారాలు ప్రారంభంలో సమస్యలు ఉన్నా సహనంతో కొనసాగిస్తారు. ఆత్మీయుల,పెద్దల కలయిక వలన క్రొత్తఉత్సాహాన్ని పొందుతారు. వృత్తిపరంగా అభివృద్ధిని సాధిస్తారు.ధార్మిక,ఆధ్యాత్మిక కార్యక్రమాల పట్ల ఆసక్తి చూపుతారు. దూర ప్రయాణాలు చేయ వలసి ఉన్నందున జాగ్రతలు తీసుకోవడంశుభకరం. రాజకీయంలో కృషికి తగినగుర్తింపు లభిస్తుంది. **పరిహారాలు : బెల్లంముక్కను దేవునికి నివేదన చేసి ఆరగించండి**

**జనవరి :** ఆరంభించిన పనులన్నీ పూర్తిచేస్తారు.మనోభావాలను అర్థంచేసుకునే వ్యక్తులు పరిచయమవుతారు.కొత్త ఆదాయమార్గాలు అనుకూలిస్తాయి. కుటుంబంలోని వ్యక్తుల సహకారంతో పనులను చేపట్టడం మేలుగాఉంటుంది. సంతృప్తికరమైన జీవనాన్ని గడుపుతారు. గృహమున శుభకార్యాలు నిర్వహిస్తారు. **పరిహారాలు : పేదలకు వస్త్రదానము చేయాలి**

**ఫిబ్రవరి :** నూతనప్రయోగాలు జయప్రదంగాసాగుతాయి. అవసరానికి తగినడబ్బులు వచ్చే సూచనలున్నాయి. శారీరక శ్రమవల్ల అశాంతి కలగవచ్చు. ఉన్నత పదవులు,బాధ్యతలు పెరుగుతాయి.దూరప్రాంత ప్రయాణాలు అనుకూలంగా సాగి తృప్తినిస్తుంది.ఆదాయం లభించి పనులు సులువుగా పూర్తిచేయగలుగుతారు. పరిహారాలు : దాసించెక్కను పాలతో అరగదీసి తిలకంగా పెట్టుకోండి

**మార్చి :** వాక్చాతుర్యముచే అనేకమందిని ఆకర్షిస్తాయి.ఇతరులసహకారంతో నూతన లక్ష్యాలను సాధించడానికి సమాయత్తమవుతారు.ఆర్థిక ఒప్పందాలు సంతృప్తికరంగా నిర్వహిస్తారు. వివాదాలు ఉన్నా సామ రస్యంగా వ్యవహరిస్తారు. ఉద్యోగ ప్రయత్నాలు అనుకూలిస్తాయి.దూర ప్రాంతాల నుండి వస్తు సామగ్రులు లభ్యమవుతాయి. **పరిహారాలు : గోధుమలు దానం చేయండి.**



# వృషభరాశి ఫలితములు

కృత్తిక 2,3,4, పాదములు, రోహిణి 1,2,3,4, పాదములు
మృగశిర 1,2, పాదములు

**ఆదాయం - 2 వ్యయం - 8 రాజపూజ్యం - 7 అవమానం -3**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు మంచి ఆలోచనతో కార్యములు సాధించుకుందురు. నూతన వ్యక్తుల పరిచయాలద్వారా లాభములు కలుగును. ఆర్థిక, విదేశీ, కోర్టువ్యవహారాలు అనుకూలముగా సాగును. బంధువర్గము నుండి సహకారము కలుగును. పుత్రసంతానము లేనివారికి ఈ సంవత్సరము కలుగును. శత్రువుల ద్వారా కొంతచికాకు కలుగుచున్నది. జీవిత భాగస్వామికి అనారోగ్యము కలుగును. ఆకస్మిక దూరప్రాంత ప్రయాణాలవలన లాభము చేకూరును. గతంలో నిలచిన స్థిరాస్తివ్యవహారాలు కొలిక్కివచ్చును. నూతన ఉద్యోగములయందు స్థిరపడును. గృహమున శుభకార్యములవలన ధనముఖర్చవు చుండును.

వ్యవసాయదారులకు మొదటిపంట మేలుగాఉన్నది. విద్యార్థులకుగుర్తింపు కలిగినపోటీపరీక్షలయందు విజయాన్ని సాధంతురు. కాంట్రాక్టర్లు, బ్రోకర్లు, ఫైనాన్స్ వారికి నూతనపెట్టుబడును కలసివచ్చుటచే ఆనందాన్ని పొందెదరు. ఫ్యాన్సీ, కిరాణా, వస్త్ర వ్యాపారులకు శ్రమచేత ఫలితాన్ని సాధించుకోవలెను. కంప్యూటరు రంగము వారికి ఆదాయము బాగుగానున్నది. మద్యం విక్రేతలకు, పోలీసువారికి, ప్రత్తి, జోళ్ళవ్యాపారులకు విశేషదనాదా యమున్నది. సినీరంగమునందు వారికి, కళాకారులకు ఇతర ప్రాంతములయందు గుర్తింపు కలుగును. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితు లకు ఆదాయము మెండుగావున్నది. డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లకు విశేషముగా సంఘమున గౌరవముకలుగును. రాజకీయ నాయకులకు నూతన పదవులను అలంకరించి సంతోషముగా ఉందురు. ఈ రాశి స్త్రీలకు శ్రమచేత ఫలితాలను సాధించుకొని పురోగతిని సాధించెదరు.

### నక్షత్ర ఫలితాలు

**కృత్తిక 2,3,4-** పిల్లలఇబ్బందులెదుర్కొంటారు. భోజన సౌఖ్యముం టుంది. అనారోగ్య బాధలుంటాయి. నూతన వ్యక్తులు పరిచయ మవుతారు. వృత్తిరీత్యా క్రొత్త సమస్యలను ఎదుర్కొంటారు. అపకీర్తి రాకుండ జాగ్రత్త పడుట మంచిది. మానసికాందోళనతో ఉంటారు.

**రోహిణి 1,2,3,4-**తలచిన కార్యాలకు ఆటంకాలెదురవుతాయి. ఆర్థిక ఇబ్బందు లుంటాయి. నూతనవ్యక్తులజోలికి వెళ్ళరాదు. మనోద్వేగానికి గురి అవుతారు. కోపాన్ని తగ్గించుకోవడం అన్నివిధాల శ్రేయస్కరం. క్రొత్త పనులు ప్రారంభించరాదు. మానసికఆందోళన అధికమవుతుంది.

**మృగశిర 1,2-** ఇతరులకు ఇబ్బందిని కలుగజేసే పనులను మానుకోవాల్సి వస్తుంది. వ్యతిరేక ఫలితాలు కలిగే అవకాశముంటుంది. జాగ్రత్త అవసరం. ధైర్యసాహసాలుంటే మేలు. సంతోషంగా కాలం గడుపుతారు. కుటుంబ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఇతరులచే గౌరవింపబడుదురు.

### నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**కృత్తిక 2-**శని, కుజ, **కృత్తిక 3-**గురు, రాహు, **కృత్తిక 4-**శుక్ర, చంద్ర, **రోహిణి 1-**శని, బుధ, **రోహిణి 2-**గురు, కేతు, **రోహిణి 3-**చంద్ర, శని, **రోహిణి 4 -** రాహు, కుజ, **మృగశిర 1-**బుధ, శని, **మృగశిర 2-**రవి, శుక్ర **గ్రహములకు జపము, దానము చేయవలెను.**

## వృషభ రాశి వారి స్వభావము

లావు దేహముతో నుందురు. కళ్లు తెల్లగా నుండును. సామాన్య దృష్టిని కలిగి యందురు. వీరి దేహము చల్లగా నుండును. భయముగా ఉందురు. సావధానముగా పనిని చేయుదురు. ఉదార స్వభావము, లాభ పరులుగా నుందురు. ఖర్చును తక్కువగా చేయుదురు. ఇతరుల ద్వారా కార్యములను సాధింతురు. బద్ధకముగా ఉం దురు. సంగీత సాహిత్యములందు విషయపరిజ్ఞానము కలవారగుదురు. తమ రహస్యములను ఇతరులకు తెలియనీయరు. ఓర్పు ఎక్కువ. పూర్వార్జితమును సాధింతురు. క్రమేపీ అభివృద్ధిని పొందుదురు. మధుర పదార్థములను ఎక్కువగా తినెదరు. విద్యయందు అభిలాషను కలిగియుందురు. ప్రతీ విషయమును నిశితముగా పరిశీలింతురు.

**మాసవారి ఫలితములు**

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు పంచమస్థానమున సంచారముచే పుత్రసంతానము వలన శుభము తదుపరి షష్టస్థాన సంచారముచే ఇతరులతో కలహములు కలుగును.

ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు అష్టమస్థానమున సంచారముచే ఆరోగ్యము నందు చికాకులు. తదుపరి అక్టోబరు 26 వరకు సప్తమస్థాన సంచారముచే ఇంటిలో శుభకార్యములుజరుగును. తదుపరి అష్టమస్థానమున సంచారముచే నిలచిన పనులు పూర్తగును. ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు చతుర్థస్థాన సంచారముచే బంధువుల వలన అవమానాలు. తదుపరి తృతీయస్థాన సంచారముచే సోదర సహకారములు. ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు దశమస్థాన సంచారముచే భాగస్వామ్య వ్యవహారములు కుదురును. తదుపరి భాగ్యస్థాన సంచారముచే పుణ్యక్షేత్ర దర్శనము.

**ఏప్రిల్ :** గౌరవ పురస్కారాలు లభిస్తాయి.ఆర్థిక సమస్యలు పరిష్కారమవుతాయి.రావలసిన ధనం అందుతుంది.బంధుమిత్రుల నుండి దూరముగా ఉండుట మేలు. ఏకపక్ష నిర్ణయాలు తీసుకోకపోవడం మంచిది.నూతన వ్యాపారాలు ప్రారంభం చేస్తారు.గృహ అవసరాలకు తగిన వస్తువులు కొనుగోలుచేస్తారు. యజ్ఞములందు పాల్గొంటారు. **పరిహారాలు : పెరుగు అన్నం పేదలకు పంచండి**

**మే :** ఆదాయానికి మించి ఖర్చులుంటాయి.అపరిచితవ్యక్తులతో దూరంగాఉండడం మంచిది. ఉద్యోగస్తులకు పై అధికారుల నుండి,తోటివారి వలన సమస్యలు వస్తాయి. సమయానుకూలంగా కార్యక్రమాలు నిర్వహిస్తారు. పనులు విజయవంతంగా పూర్తిచేస్తారు. కష్టంలేకుండా బాకీలు వసూలవుతాయి. కోర్టు లావాదేవీలు పరిష్కారమవుతాయి **పరిహారాలు : రామరక్షాస్తోత్రము రోజుకు 3 సార్లు చదవండి**

**జూన్ :**నూతనవ్యాపారాలు ప్రారంభంచేస్తారు. ఇతరుల నిర్ణయాలను గౌరవిస్తారు. స్నేహితుల సహాయ సహకారాలు లభిస్తాయి. గృహమున వివాహ శుభకార్యాలు జరుగుతాయి. సందర్భాను సారంగా వ్యవహారాలను సాగిస్తారు.ఏదో ఒక విషయంలో మనస్థిమితం అంతగాఉండక పోవచ్చు. గతంలో నిలచిన ప్రమోషన్లు ఉద్యోగస్తులకు అందుతాయి. **పరిహారాలు :తిరుపతిస్వామి వారిని దర్శించండి,హుండీలో 101 రూ. వేయండి**

**జులై :** వ్యవహారాలను వేగవంతముగా ముందుకు సాగిస్తారు.క్రొత్త ఆలోచనలతో నూతన కార్యాలను ప్రారంభిస్తారు.కుటుంబమున బరువు –బాధ్యతలు ఏర్పడతాయి.ధార్మిక కార్యాల యందు పాల్గొంటారు. భాగస్వామ్య వ్యవహారాలు విజయవంతముగా పూర్తవుతాయి. విద్యా, వృత్తిరంగాల్లో సానుకూల వాతావరణం ఏర్పడుతుంది.పుణ్య తీర్థములయందు స్నానమాచరిస్తారు. **పరిహారాలు : పెసలు దానం చేయండి**

**ఆగస్టు :** గతంలో నిలచిన వివాహ ప్రయత్నాలు ఫలవంత మవుతాయి.శత్రువర్గము వారితో విభేదాలు ఏర్పడుటకు అవకాశమున్నది.తక్కువ శ్రమతో ఎక్కువ లాభాన్ని పొందుతారు.నూతన వాహనాలు కొనుగోలు చేస్తారు.గృహప్రయత్నాలు అనుకూలిస్తాయి.నూతన స్త్రీ పరిచయాలద్వారా కుటుంబమున తగాదాలు ఏర్పడును. **పరిహారాలు : బొబ్బర్లు దానం చేయండి**

**సెప్టెంబర్ :** ఆత్మీయులతో కలిసి సంతోషముగా గడుపుతారు.గతంలో రావలసిన బ్యాంకు ఋణాలు అందుతాయి. నేత్ర సంబంధ వ్యాధులు వచ్చుటకు అవకాశమున్నది.నిరుద్యోగులకు ఉద్యోగము వచ్చును.రావలసిన ధనంచేతికి అందుతుంది.వాస్తుకు అనుకూలంగా గృహ మార్పు లు చేస్తారు. **పరిహారాలు : సుందరకాండ పారాయణ మేలు కలిగించును**

అక్టోబర్ : క్రిందిస్థాయి వ్యక్తులవలన తగాదాలుఏర్పడతాయి. ఆదాయమార్గాలను అన్వేషి స్తారు.సాంఘిక రాజకీయవ్యవహారాలలో ముఖ్యభూమికను పోషిస్తారు.గతంలో నిలచిన ప్రమో షన్లు వస్తాయి.వాతావరణం మార్పులవలన తాపసిక జ్వరమువచ్చును.భార్య ఆరోగ్య విషయము లయందు జాగ్రత్త వహించవలెను. **పరిహారాలు : మారుతీ స్తోత్రము 11 సార్లు రోజూ చదవండి**

**నవంబర్ :** పెద్దలను గౌరవించి తగిన సలహాలను పొందుతారు. వాయిదాపడుతున్న కోర్టు కేసులు పరిష్కారమై శాశ్వతప్రయోజనాన్ని కలిగిస్తాయి. దేవతానుగ్రహప్రాప్తి కలుగుతుంది. స్వశక్తితో కార్యాలను నిర్వర్తిస్తారు.దూరప్రాంత మిత్రులవలన మంచి సహకారాన్ని పొంది సుఖపడతారు.అనుకోని సంఘటన జరిగిప్రజలలో గుర్తింపు పొందుతారు. **పరిహారాలు : ఉలవలు దానం చేయండి**

**డిసెంబర్ :**సత్వర పరిష్కారాలకోసం ఇతరులనుఆశ్రయిస్తారు. శ్రమతో ముందుకు సాగుతారు.చేతులకు,కాళ్ళకు అగ్నిప్రమాదము సంభవించవచ్చు.ఇతరులను ఆకర్షించే వస్త్రాలు కొనుగోలు చేస్తారు. ఆర్థిక పరిస్థితులు మెరుగుపడుతుంది.సరిహద్దు తగాదాలు ఏర్పడతాయి. గృహావసరాలకు కావలసిన సామాగ్రిని కొనుగోలు చేస్తారు.శైవసంబంధ పుణ్యక్షేత్రాలు దర్శిస్తారు.

**జనవరి :**శుభకార్య ప్రయత్నాలు సాగిస్తారు.ఆలుమగలమధ్య అభిప్రాయభేదాలు ఉండవ చ్చును. పనుల్లో స్వల్పఆటంకాలు ఉన్ననూ ముందుకు సాగుతాయి. పెట్టుబడులు,వ్యాపారాలు ముందుకు సాగుతాయి.రాబడికిమించి ఖర్చులుంటాయి.నూతనవ్యక్తులతో జాగ్రత్తగా వ్యవహ రించాలి.అనుమానాలు తొలగి అనుభవంతో పనులను సాధిస్తారు. **పరిహారాలు : శనగలు దానం చేయండి**

**ఫిబ్రవరి :** ఇతరుల సలహాలు లేకుండా సొంత నిర్ణయాలు తీసుకోవలెను.ఆరోగ్య విషయంలో ఆందోళన చెందుతారు.గృహ నిర్మాణము ఎక్కువ వ్యయంతో పూర్తిచేస్తారు. ఇతరులకు హామీలు ఇవ్వకపోవడం మంచిది. సమాచారముల ద్వారా క్రొత్త విషయాలు గ్రహిస్తారు.జీవిత భాగస్వామి సలహా పాటించడంవల్ల మేలుజరిగే అవకాశముంది. **పరిహారాలు : కందులు దానం చేయండి**

**మార్చి :** ఆరోగ్యం విషయంలో జాగ్రత్తవహించడం మేలు.మగ సంతానము ద్వారా చికాకులు ఏర్పడతాయి.ఇతరులతో పంతాలకుపోవడం మంచిదికాదు.కుటుంబ సభ్యులతో వినోదయాత్రలు చేస్తారు. గృహమునందు శుభకార్యం జరుగును.శ్రమకుతగిన గుర్తింపు, ప్రతిఫలాన్ని పొంది మానసిక సంతృప్తిఏర్పడుతుంది. **పరిహారాలు : తెల్లఆవాలు పారుతున్న నీటిలో వేయండి**



# మిధునరాశి ఫలితములు

మృగశిర 2,4 పాదములు

ఆరుద్ర 1,2,3,4, పాదములు, పునర్వసు 1,2,3 పాదములు

**ఆదాయం - 5 వ్యయం - 5 రాజపూజ్యం - 3 అవమానం - 6**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు యోగవంతముగాఉండును. నూతన కార్యములయందు ఆసక్తిపెరిగి పూర్తిచేస్తారు. కుటుంబ,ఆర్థిక విషయాలలో పురోగతిని సాధిస్తారు. సోదరవర్గమునుండి అనుకూలముగా ఉం డకపోగా నిందలువేస్తారు. నూతన గృహయోగమున్నది. ఆలోచనను సక్రమంగా వుండుటచే కోర్టువ్యవహారాములను సాధించెదరు. శత్రువులపీడ అధికముగా ఉ ండును. భార్యతరపునుండి చికాకులు ఏర్పడును. ఆకస్మిక ధనలాభము కలుగును. లావాదేవీలు కలసివస్తాయి. చేయువృత్తి యందు కొంతకష్టముగాఉన్నది. నిద్రయందు ఆసక్తిపెరిగి బద్ధకము ఏర్పడును.

వ్యవసాయదారులకు క్రొత్తపంటలు వేయుటవలన లాభాలనుపొందుతారు. విద్యార్థులకు మంచి అవకాశములు లభించి ఉన్నతవిద్యను అభ్యసించెదరు. కాంట్రాక్టర్లు,బ్రోకర్లు, ఫైనాన్స్‌వారికి నూతన కార్యములయును చేపట్టుటవలన శుభముకలుగును. ఫ్యాన్సీ,కిరాణా, వస్త్ర వ్యాపారులకు లాభసాటివ్యాపారాముల కలిగి ధనదాయము పొందుతారు. మద్యంవిక్రేతలకు, ప్రత్తి, జ్యోళ్ళు వ్యాపారులకు సామాన్యముగా ఉన్నను కార్యములు నెరవేరును. సినీరంగమునందు వారికి, కళాకారులకు అంతంత మాత్రముగా ఉన్నది. పురోహిత జ్యోతిష్య వాస్తు పండితులకు నూతన ప్రయత్నములు ఫలించుటచే గౌరవాన్ని పొందుతారు. డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లకు కోరుకున్న పనులుజరిగి ఆనందాన్ని పొందుతారు. రాజకీయ నాయకులకు ఇతరాదాయమార్గమును ఏర్పడును. ఈ రాశి స్త్రీలకు విశేషముగా ఉండి తోటివారి మన్నలను పొందుతారు.

### నక్షత్ర ఫలితాలు

**మగశిర 3,4-** రాజకీయ వ్యవహాకాల్లో దిగ్విజయాన్ని పొందుతారు. ప్రయత్న కార్యాలన్నీ సంపూర్ణంగా ఫలిస్తాయి. శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెరవేరతాయి. సంపూర్ణ ఆరోగ్యవంతులుగానుంటారు. శుభవార్తలు వింటారు. స్థిరాస్తుల విషయంలో జాగ్రత్తగా నుండుట మంచిది.

**ఆరుద్ర 1,2,3,4**-అద్భుత అవకాశాన్ని కోల్పోతారు. నూతన వ్యక్తుల పరిచయమేర్పడుతుంది. ప్రయాణాలవల్ల లాభం ఉంటుంది. వ్యయ, ప్రయాసలు తప్పవు. వృత్తిరీత్యా క్రొత్త సమస్యలు నెదుర్కోంటారు. మానసికాందోళనవుంటుంది. విదేశయాన ప్రయత్నాలు ఫలిస్తాయి.

**పునర్వసు 1,2,3**-కుటుంబంలో అనుకోకుండా కలహాలేర్పడే అవకాశముం టుంది. అనారోగ్య బాధలు అధికమవుతాయి. ఆకస్మిక ధననష్టం ఉంటుంది. ఆకస్మిక ధననష్టముంటుంది. సంపూర్ణఆరోగ్యంగా వుంటారు. సుఖసంతోషాలు అనుభవిస్తారు. విజయం సాధిస్తారు. శుభవార్తలు వింటారు. ధైర్యసాహసాలు ప్రదర్శిస్తారు.

### నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**మృగశిర 3**-రాహు,చంద్ర,**మృగశిర 4-** కుజ,కేతు**ఆరుద్ర 1**-గురు,రవి **ఆరుద్ర 2**-శని,బుధ **ఆరుద్ర 3**-కుజ,రాహు, **ఆరుద్ర 4**-శని,కుజ, **పునర్వసు1**-బుద,చంద్ర,**పునర్వసు 2** రాహు,శుక్ర, **పునర్వసు3**-చంద్ర,రవి గ్ర**హములకు జపము,దానము చేయవలెను.**

## మిథున రాశి వారి స్వభావము

పొడవుగా నుందురు. చామనఛాయ రంగుకలిగి,నిశితమైన దృష్టిని కలిగి యందురు. వీరి దేహము చల్లగా నుండును. ఇతరుల అభిప్రాయములకు అనువుగా సంచరిస్తారు. విద్యయందు ఆసక్తి తక్కువ. చమత్కారముగా మాట్లాడుతారు. వృత్తులను మారుస్తూంటారు. నిలకడ తక్కువ. నమ్మిన వారిని చులకనగా చూచే స్వభావము ఉండును. మానసిక బలము తక్కువ. పనులను తక్కువగా చేస్తారు. చేతివ్రాతతో ఇతరులను తమ వైపు తిప్పుకుంటారు. అధిక ప్రయాణాలను చేస్తారు. మంచి వాతావరణము కలిగిన ప్రాంతము లందు మసలినచో జీవితము బాగుండును. కవిత్వము,గణితము నందు ఆసక్తి ఉండును. దేవతారాధన ఎక్కువగా చేస్తారు. రాజకీయము నందు పదవులను అలంకరించెదరు.

**మాసవారి ఫలితములు**

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు చతుర్థస్థానమున సంచారముచే గృహప్రయత్నాలు ఫలించును తదుపరి పంచమస్థాన సంచారముచే సంతానసమస్యలుపరిష్కారమగును.

ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు సప్తమస్థానమున సంచారముచే భాగస్వామ్యవ్యవహారాలుజాగ్రత్త. తదుపరి అక్టోబరు 26 వరకు షష్ఠస్థాన సంచారముచే ప్రయత్నసాఫల్యతజరుగును. తదుపరి సప్తమస్థానమున సంచారముచే మిత్రులసహకారమందును. ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు తృతీయస్థాన సంచారముచే సోదరసహాయమందును. తదుపరి ద్వితీయస్థాన సంచారముచే మాటపట్టింపులు. ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు భాగ్యస్థాన సంచారముచే జీవితమునందుమార్పులు. తదుపరి అష్టమస్థాన సంచారముచే అనారోగ్యస్థితి.

**ఏప్రిల్ :**అప్రయత్నంగా లక్ష్యాలను సాధిస్తారు.అధికమొత్తంలో ఆదాయము పెరుగుతుంది. కృషికి తగిన బహుమతులు,ప్రోత్సాహక పతకాలు లభిస్తాయి.ఆరోగ్య విషయమున జాగ్రత్త అవసరము.నూతన వ్యక్తుల పరిచయాలద్వారా వ్యాపారాభివృద్ధి సాగుతుంది.గృహమున అవసర వస్తువులు కొనుగోలు చేస్తారు.కీళ్ళ సంబంధ వ్యాధుల వలన కొంతశ్రమ ఏర్పడుతుంది. **పరిహారాలు : బొబ్బర్లు దానం చేయండి**

**మే :**పనులను వాయిదావేయడం ఉత్తమం.ఊహించని ఖర్చులు ఎదురవుతాయి.అసంతృప్తి కలిగించే మాటలు, సంభాషణలు వలన శత్రుత్వము ఏర్పడవచ్చు.భార్యవైపు బంధువులకు పీడగాఉండును. ఆశయసాధనకు విపరీతకృషిని చేయవలసివస్తుంది.గ్రహాల అనిశ్చితి కార ణంగా ఆరోగ్యభంగము ఏర్పడుచుండును. చేయువృత్తి,ఉద్యోగాలలో శ్రమఉ న్ననూ తగిన గుర్తింపు ఉంటుంది. **పరిహారాలు : కాలభైరవ అష్టకము రోజూ 8 సార్లు చదవండి**

**జూన్ :**ఏకాగ్రతతో సమస్యలను పరిష్కరించ గలుగుతారు. అవసరానికి కావలసిన ధనము సమయానికి అందును.బిడ్డలవలన సమస్యలు ఏర్పడతాయి.గృహమున మంగళ కార్యక్రమాలు జరుగును.శారీరక శ్రమ వల్ల ఆరోగ్యంలో మార్పులు ఏర్పడతాయి. ఆధిపత్యపోరుతో ఇంటా బయటా ఉంటుంది.విలువైన సమాచారమును పొంది ఆనందాన్ని అనుభవిస్తారు.పుణ్య కార్యాలలో పాల్గొంటారు. **పరిహారాలు : రుద్రహోమము చేయించాలి**

**జులై :** ఖరీదైన గృహోపకరణాలు కొనుగోలుచేస్తారు.స్వశక్తితో పనులను సాధిస్తారు. ఆటంకములు ఉన్ననూ పనులుప్రారంభంచేసి విజయాన్నిపొందుతారు.గృహమున శుభకార్య ములను నిర్వహిస్తారు.జప,హోమాదులను నిర్వహించి మంచిఫలితాలు పొందుతారు.ఇతరుల సహకారము లభిస్తుంది.వ్యాపారాలలో మంచి మార్పులుకలుగుతాయి.ఆస్తి వ్యవహారాలలో సానుకూల పడతాయి. **పరిహారాలు : దత్తకవచం రోజుకు 8 సార్లు చదవాలి**

**ఆగస్ట్ :** వ్యాపార లావాదేవీలలో విజయాన్ని పొందుతారు.చేయు వృత్తి రంగాల్లో పురస్కారాలు లభిస్తాయి.క్రొత్త స్నేహితులతో సంబంధ బాంధవ్యాలు ఏర్పడతాయి.శిరోవేదన ఎక్కువగా ఉంటుంది.ప్రమోషన్లు వచ్చే అవకాశాలు ఉ న్నాయి.గతంలో నిలచిన బాకీలు వసూలవుతాయి. నూతన స్త్రీ పరిచయాలు ఏర్పడతాయి.శారీరక శ్రమఎక్కువగా ఉ న్ననూ ఏకాగ్రతతో ఉంటారు. **పరిహారాలు : గణపతి హోమం చేయించండి**

**సెప్టెంబర్ :** ఊహించిన విధంగా సమస్యలనుండి బయటపడతారు.అపూర్వ దేవతా దర్శనముచే మానసిక ప్రశాంతతను,ఆనందాన్ని పొందుతారు.దూరప్రాంతాలనుండి విశేష వర్తమానాలు అందుతాయి. స్పెక్యులేషన్‌లు లాభిస్తాయి.నూతన పెట్టుబడులు పెట్టుట వలన ఆదాయాన్ని పొందుతారు.పిల్లల ఆరోగ్య విషయాలలో జాగ్రత్త వహించుటమేలు.వాహన ప్రమాదాలు జరిగే అవకాశమున్నది. **పరిహారాలు : లవంగాన్ని నాలుక క్రిందిభాగమున పెట్టుకోండి**

**అక్టోబర్ :** నూతన కార్యాలను సాధించుటలో శక్తివంతులై ఉంటారు.ఆశించినరంగాల్లో అభివృద్ధిని సాధించుతారు.పై అధికారుల వత్తిడి ఉన్ననూసామరస్యముగా సమస్యలను పరిష్క రించుతారు.ఉద్రేకముగా పనులను సాగించవలసివస్తుంది.వృత్తి రంగాలలో వ్యతిరేకత ఏర్పడు తుంది.ఆర్థిక ప్రయోజనాలు నిరుత్సాహ పరుస్తాయి.దూరప్రాంత ప్రయాణాలవలన శారీరక శ్రమ ఉంటుంది. **పరిహారాలు : శనగలు దానం చేయండి**

**నవంబర్ :**ఆలోచనతో మంచి నిర్ణయాలు తీసుకోవలసి వస్తుంది.ఉదర,మోకాలి సంబంధ వ్యాధులవలన శస్త్రచికిత్సలు జరుగుటకు అవకాశమున్నది.పుణ్యకార్యములయందు పాల్గొందురు. నూతన అవకాశాలను వినియోగించుకొనుటలో నిష్ణాతులై ఉంటారు.ఇతరులు చెప్పే మాయ మాటలకు మోసపోవలసి రావచ్చు. ఇతరుల సహకారముచే ముఖ్యమైన పనులు పూర్తిచేస్తారు. **పరిహారాలు : పేదవారికి ఇంట్లో పెళ్లికి సహకరించండి**

**డిసెంబర్ :** నూతన గృహనిర్మాణమును చేయుదురు. గతంలో పరిష్కారముకాని కోర్టుకేసులు సత్వరమే పరిష్కారమగును. స్నేహితుల సహకారముచే నూతనకార్యాలను సాధిస్తారు.విహార యాత్రలకువెళ్ళెదరు. సొంతనిర్ణయాలతో ముందుకు సాగవలెను.ఇతరుల విషయాలలో తలదూర్చక దూరముగా ఉండవలెను.ఆనందాన్ని కలిగించే కార్యాలలో పాల్గొంటారు.ఆర్థిక వ్యవహారాలు ముందుకు సాగుతాయి. **పరిహారాలు : కుక్కకు తిండి వేయండి లేదా గారెలు పెట్టండి**

**జనవరి :**ఆకస్మిక ప్రయాణాల వలనధనవ్యయమగును.శత్రువుల వలన అపకీర్తి ఏర్పడును.శుభకార్యములను నిర్వహించుటలో సిద్ధహస్తులైఉంటారు.నూతనవ్యాపారాలను ప్రారంభం చేయు దురు.నూతన గృహ నిర్మాణం చేయుటకు సంకల్పించెదరు. పరిస్థితులకు అనుగుణంగా ప్రవర్తిస్తారు.మాతృ లేక పితృవర్గము వారికి కర్మ చేయవలసివచ్చును. ఇతరులతో ఒప్పందాలు కుదుర్చుకుంటారు. **పరిహారాలు : హనుమాన్ చాలీసా రోజుకు 3 సార్లు చదవండి**

**ఫిబ్రవరి :**శత్రువులపై విజయం సాధించడంలో నిష్ణాతులై ఉంటారు. చేయువృత్తి, విద్యారంగాల్లో ప్రాముఖ్యతను పెంచుకుంటారు.ఇతర ఆదాయమార్గాలు పెరుగుట వలన నూతన వస్తువులు కొనుగోలు చేస్తారు.ఇతరులతో మాటపట్టింపులువచ్చి శత్రుత్వముఏర్పడుటకు అవకాశ మున్నది. ఖర్చులు పెరిగినను సర్దుబాటు అవుతాయి.గతంలో నిలచిన పనులు పూర్తి అవుతాయి. **పరిహారాలు : గణపతి అష్టోత్తరము ఉదయ సాయంకాలములు చదవండి**

**మార్చి :** మానసికవత్తిడి అధికముగాఉన్నా ధైర్యంతో పనులనునిర్వర్తించుకుంటారు. కుటుంబ వ్యక్తుల సహకారముచే కార్యములు సాధించుకుంటారు.కోర్టు వ్యవహారాలు సానుకూలముగా పూర్తవుతాయి.అధికారుల అండదండలతో ప్రమోషన్లుపొందుతారు.ప్రతీ విషయంలోనూ సందే హాలు ఏర్పడుతూఉంటాయి.ఆదాయం మెరుగ్గానే ఉ ంటుంది.రావలసిన బాకీలు వసూలవుతాయి. **పరిహారాలు : నవగ్రహాలకు పూజహోమం చేయించండి**



# కర్కాటకరాశి ఫలితములు

పునర్వసు 4 పాదము,
పుష్యమి 1,2,3,4 పాదములు; ఆశ్లేష 1,2,3, 4 పాదములు

| ఆదాయం - 14 | వ్యయం - 2 | రాజపూజ్యం - 6 | అవమానం - 6 |
|---|---|---|---|

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు సానుకూలముగా ఉన్నది. ఉన్నచోట ఉండక బదిలీలుఅగుచుండును. కుటుంబమునందు చికాకు లున్నను ఇతరుల జోక్యముచే సర్దుబాటుఅగును. సంవత్సరాంతమున ధనము లభించును. తోబుట్టువుల సహాయముతో సుభకార్యములను నిర్వర్తిస్తారు. పుత్రసంతానానికి పురోగతిఉన్నది. శత్రువుల వలన శరీరానికి గాయము అవ్వవచ్చు. జీవితభాగస్వామికి ఆనారోగ్యముగానుండును. ఆకిస్మికముగా కొంతధననష్టము కూడా ఉన్నది. కొంత ధననష్టమున్నది. నూతన స్థలములను కొనుగోలుచేస్తారు. చేయువృత్తియందు గుర్తింపు లేకున్నను పనిని చేసుకొనిపోయెదరు. మధ్యమధ్యన స్థబ్దుగాఉండవచ్చును.

వ్యవసాయదారులకు రెండవపంట అనుకూలముగా ఉన్నది. విద్యార్థులకు ఉన్నతవిద్యకు అభ్యసించుటకు మంచి అవకాశములు పుష్కలముగా లభించును. కాంట్రాక్టర్లు,బ్రోకర్లు, ఫైనాన్స్‌వారికిశ్రమచేత ఆదాయము లభించును. ఫ్యాన్సీ,కిరాణా, వస్త్ర వ్యాపారులకు లాభమున్నను ఖర్చుఅధికము ఉన్నది. మద్యం విక్రేతలకు, ప్రత్తి, జ్యోళ్ళు వ్యాపారులకు సామాన్య ప్రభుత్వఅధికారుల వలన నిరాశకు గురిఅగుదురు. సినీరంగమునందు వారికి, కళాకారులకు నూతన ప్రయత్న ములు ఫలించి అభిమానుల మన్ననలను పొందుతారు. పురోహిత జ్యోతిష్య వాస్తు పండితులకు సామాన్యముగా ఉన్నది.డాక్టర్లు,ఇంజనీర్లు, లాయర్లకు తాముఆశించిన పదవులయందు లబ్ధిని పొందుతారు. రాజకీయ నాయకులకు విదేశీప్రయాణాల వలన లాభము చేకూరును. ఈ రాశి స్త్రీలకు చికాకులు ఏర్పడును. సంఘమున గౌరవము తగ్గును.

**నక్షత్ర ఫలితాలు**

పునర్వసు 4-ప్రయత్న కార్యాలకు ఆటంకాలెదురవుతాయి. బంధు, మిత్రులతో జాగ్రత్త మెలగుట మంచిది. ఆకస్మిక కలహాలకు అవకాశముంటుంది. అనారోగ్య బాధలధికమవుతాయి. ధననష్టం అనివార్యమవుతుంది.

పుష్యమి 1,2,3,4-ఎక్కువ మానసికాందోళనతోకాలం గడుప వలసివస్తుంది. అనవసర వ్యయ ప్రయాసలుంటాయి. వృధా ప్రయాణా లెక్కువ చేస్తారు. శారీరకంగా బలహీనులవుతారు. గౌరవం లోపించకుండా జాగ్రత్తపడుట మంచిది. మంచి ఆలోచనలను కలిగివుంటారు.

ఆశ్రేష 1,2,3,4-బందు మిత్రులను గౌరవిస్తారు. కుటుంబ సౌఖ్యం సంపూర్ణంగాలభిస్తుంది. సత్కార్యాల్లో పాల్గొంటారు. శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెరవేర్చుకుంటారు. శుభవార్తలు వింటారు. ఆకస్మికధనలాభాన్ని పొందుతారు. ముఖ్యమైన కార్యాలు పూర్తిఅవుతాయి. రాజకీయ వ్యవహారాల్లోదిగ్విజయాన్ని పొందుతారు.

**నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు**

**పునర్వసు4**-కేతు,గురు,**పుష్యమి1**-శని,కుజ,**పుష్యమి2**-బుధ,శుక్ర, **పుష్యమి3**-చంద్ర,గురు,**పుష్యమి4**-శుక్ర,కేతు, **ఆశ్రేష1**-గురు,రవి, **ఆశ్రేష 2**-గురు,కుజ,**ఆశ్రేష3**-గురు,శని, **ఆశ్రేష4**-చంద్ర,గురు, **గ్రహములకు జపము,దానము చేయవలెను.**

## కర్కాటక రాశి వారి స్వభావము

నలుపుగా నుందురు. క్రింది చూపు ఎక్కువ. కష్టములను అనుభవించి చివరిలో మంచి జీవనము సాగును. ప్రేమ,ద్వేషము ఎప్పుడు ఏర్పడతాయో తెలియదు. ఓర్పుతక్కువ, ధర్మమార్గమున సంచరించెదరు. భార్యాబిడ్డలను ప్రేమతో చూచుకొనును. శాస్త్రములయందు అభిమానము ఎక్కువ. ఇతరుల వ్యవహారాలలో కలుగ చేసుకోరు. తక్కువగా మాట్లాడుతూ ఎక్కువగా పని చేయుదురు. ఆహారములందు మార్పులు చేసుకొన్నచో ఆరోగ్యము బాగుండును. ఓషధులను ఎక్కువగా సేవించెదరు.

## మాసవారి ఫలితములు

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు తృతీయస్థానమున సంచారము చేయితరులవలన అవమానము తదుపరి చతుర్థస్థాన సంచారముచే గృహమున శుభకార్యములుజరుగును. ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు షష్ఠస్థానమున సంచారముచే శత్రువులయందు విజయము సాధింతురు. తదుపరి అక్టోబరు 26 వరకు పంచమస్థాన సంచారముచే ఆలోచనావిధానముసరిగా నుండదు. తదుపరి షష్ఠస్థానమున సంచారముచే ఆచరణకార్యములయందుప్రావీణ్యులగుదురు ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు ద్వితీయస్థాన సంచారముచే కుటుంబమున అభివృద్ధిగానుండును. తదుపరి జన్మస్థాన సంచారముచే ఇతరప్రాంతములలో సుఖమునిచ్చును. ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు అష్టమస్థాన సంచారముచే తెలియని అనారోగ్యమువెంటాడును. తదుపరి సప్తమస్థాన సంచారముచే వ్యాపారములందుజాగ్రత.

**ఏప్రిల్ :** పుణ్యకార్యాలతో ఆనందోత్సాహాలులభిస్తాయి. బంధు,మిత్రులతో విహారాలు చేస్తారు. సమాజంలో గౌరవంలభిస్తుంది. సంపూర్ణ ఆరోగ్యవంతులుగా నుంటారు. విదేశీయాన ప్రయత్నాలు ముమ్మరంగా సాగించాల్సివస్తుంది. కుటుంబంలో అనుకోకుండా శుభకార్యాలు చేసే అవకాశము ఉంటుంది.
**పరిహారాలు : ఉదయం సాయంత్రం ఇంట్లో దీపారాధన చేయండ**

**మే :** విరివిగా ప్రయాణాలు చేయాల్సివస్తుంది. సున్నితమైన విషయాల్లో మానసికాందోళన చెందుతారు. వృత్తిరీత్యా జాగ్రత్తగా నుండుట మంచిది. అప్రయత్న కార్యాలు సఫలమవుతాయి. చెడు పనులకుదూరంగా నుండుటమంచిది. వృత్తి,ఉద్యోగరంగాల్లో ఆటంకాలున్ననూ పరిష్కరించు కుంటారు. పెద్దల సలహాలను పాటించి వ్యవహార విషయాల్లో ఉత్తమఫలితాలు పొందుతారు. శస్త్ర చికిత్సలుజరుగును. నూతనప్రయోగాలు చేసి అందరిదృష్టిని ఆకర్షిస్తారు. **పరిహారాలు : తిరుపతిస్వామి వారిని దర్శించండి,హుండీలో 101 రూ. వేయండి**

**జూన్ :** కోర్టులావాదేవీలు అధికమవుతాయి. స్థిరమైన ఆలోచనలు చేయుట కష్టముగా ఉన్నది. పిల్లలపట్ల శ్రద్ధవహించుట మేలు. మనోనిగ్రహానికి ప్రయత్నించాలి. గొప్పవ్యక్తుల ద్వారా కృషి సల్పుతారు. గతంలో వెన్నంటినకష్టాలు తొలగిపోతాయి. నూతనకార్యాలకు శ్రీకారం చుడ తారు. నూతనంగా జీవనం సాగిస్తారు.
**పరిహారాలు : ఇంట్లో 4 వత్తులతో దీపారాధన చేస్తూండండి**

**జులై :** విలువైన గృహోపకరణాలు కొనుగోలుచేస్తారు. శ్రమతో పనులను నిర్వహి స్తారు. గతంలో నిలచిఉన్నపనులు తిరిగి ప్రారంభిస్తారు. శుభకార్య నిర్వహణలో పాల్గొంటారు. అభివృద్ధికి తగిన అవకాశాలకు సన్నిహితులసహకార అందుతాయి. ఇతరుల విషయాల పట్ల ఉత్సాహం చూపుతారు. విధినిర్వహణలో చురుకుదనం ప్రదర్శిస్తారు. ఆరోగ్యమునందు జాగ్రత్త అవసరం. **పరిహారాలు : మీ భార్యద్వారా మాత్రమే ఆర్థికవ్యవహారాలు చూడండి**

**ఆగస్ట్ :** భాగస్వామ్య వ్యాపారాలద్వారా ఆదాయంకలుగుతుంది. భార్యసహకారంతో పనులను పూర్తిచేయడం తృప్తినిస్తుంది. సకాలంలో బాకీలు తీరుస్తారు. ఇతరులకు సలహాలు,ప్రోత్సాహం అందించి అభివృద్ధిలో పాలుపంచుకుంటారు. ప్రతికూలంగా ఉన్నా పట్టుదలతో పనిచేసి పనులు పూర్తిచేస్తారు. ఎన్ని పరీక్షలు ఎదురైనా ప్రయత్నం మీద శుభఫలితాలు పొందుతారు. సాధు, సజ్జనుల ఉపదేశాల వల్ల తప్పులను సరిదిద్దుకుంటారు.
**పరిహారాలు : మంత్రాలయ దర్శనం చేయండి, 121 రూ. సమర్పించండి**

**సెప్టెంబర్ :** విపరీత శ్రమచేసిఇంటిపనులు పూర్తిచేయుదురు. అనుకున్న సమయానికి బాకీలు తీర్చుట కష్టము. రాజకీయ సమావేశాలలో పాలొని గుర్తింపు పొందెదరు. అకాల భోజనం ఎక్కువగా ఉంటుంది. సామూహిక కార్యాలలో పాల్గొంటారు. ప్రత్యేక బాధ్యతలు నిర్వర్తించడంవలన అధికారుల మన్ననలు పొందుతారు.
**పరిహారాలు : ఇంటి పురోహితునకు పాదపూజచేసి సత్కరించండి**

**అక్టోబర్ :** నూతన ప్రయాత్నాల ద్వారా వివాహకార్యములను గృహంలో నిర్వర్తిస్తారు. గృహావస రాలకు, విందు వినోదాలకై విరివిగా ధనాన్ని వినియోగిస్తారు. కార్యదీక్షతో వ్యవహరించి తలపెట్టిన పనులు పూర్తి చేస్తారు. సామాజిక సంస్థలలో సభ్యత్వం పొంది కార్యక్రమాలలో పాల్గొంటారు. దేవతానుగ్రహం కలుగుతుంది. ఆరోగ్యమునందు జాగ్రత్త అవసరం. **పరిహారాలు : మిరియాల పానకం వారానికి ఒకరోజు పంచండి**

**నవంబర్ :** బాధ్యతలను పంచుకుని ఇతరుల కార్యాలను సాధిస్తారు. రచనలు పత్రికలయందు ప్రచురితమై ధనము,గుర్తింపు కలుగుతాయి. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. అభిరుచులకు తగినవిధంగా పరిస్థితులు నెలకొంటాయి. దూరప్రాంతాలనుండి శుభవర్తమాన ఆహ్వానాలు అంది శుభకార్యాలలో పాల్గొంటారు. అధికారుల ఒత్తిడి ఎక్కువగా ఉంటుంది. **పరిహారాలు : మీ దగ్గరలోని దేవాలయాన్ని శుభ్రం చేయండి**

**డిసెంబర్ :** ముఖ్యమైన పనులు పూర్తిచేయడం మంచిది. వాహనాలు నడిపేటప్పుడు ముందు జాగ్రత్తలు పాటించడం శ్రేయస్కరం. చేయు కృషియందు మార్పులు అనుకోకుండా జరుగుతాయి. ఆదాయానికి మించిన ఖర్చులు ఎక్కువగా ఉంటాయి. ఖర్చులు అధికంగాఉన్నా కార్యభారం లేకుండా పనులను పూర్తిచేస్తారు. క్రొత్త ప్రదేశాలకు వెళ్ళడం వలన నూతన వ్యక్తులతో పరిచయాలు ఏర్పడతాయి. **పరిహారాలు : పేదవారికి ఇంట్లో పెళ్లికి సహకరించండి**

**జనవరి :** నూతన గృహనిర్మాణ ప్రయత్నంచేస్తారు. ఆకస్మిక ధనలాభంతో,ఋణబాధలు తొలగిమానసిక ఆనందాన్నిపొందుతారు. గత సమస్యలు తొలగిపోతాయి. ఆరోగ్యం బాగుంటుంది. వ్యాపార లావాదేవీలలో విజయాన్ని పొందుతారు. జప హోమాలను నిర్వహించి మంచిఫలితాన్ని పొందుతారు. రాజకీయలబ్ధి పొందుతారు. **పరిహారాలు : మీ జన్మరాశి ప్రతిమను ఇంటి పురోహితునకు దానం చేయండి**

**ఫిబ్రవరి :** ప్రయత్నంతో ధనలాభమేర్పడుతుంది. విందులు,వినోదాల్లో పాల్గొంటారు. పిల్లలకు సంతోషాన్ని కలగజేస్తారు. గృహవస్తువులను సేకరిస్తారు. కొత్త కార్యాలకు రూపకల్పన చేస్తారు. వృత్తి, ఉద్యోగ రంగాల్లో అభివృద్ధి సాధించే అవకాశ ముంటుంది. జీవితంలో మార్పులు కోరుకుంటారు. మంచి అవకాశాలు లభిస్తాయి.
**పరిహారాలు : బొబ్బర్లు దానం చేయండి**

మార్చి: లాటరీలు తగలడం వలన మనస్సు ఆనందంగా ఉంటుంది. అకాల భోజనంవల్ల శారీరక బాధలనుభవిస్తారు. అనుకోని కలహాలకు అవకాశముంటుంది. పరిస్థితులు సంతృప్తి కరంగా నుండుటచే మానసిక ఆనందాన్ని పొందుతారు. సమాజంలో మంచి గుర్తింపు లభిస్తుంది. ముఖ్యమైన వ్యక్తుల ద్వారా వ్యాపార లావాదేవీలు కలసివస్తాయి. **పరిహారాలు : ప్రతీరోజూ ఏలక్కాయను నీటిలో వేయండి**



# సింహారాశి ఫలితములు

మఖ 1,2,3,4, పాదములు

పుబ్బ 1,2,3,,4 పాదములు, ఉత్తర 1 పాదం

**ఆదాయం - 2 వ్యయం -14 రాజపూజ్యం - 2 అవమానం - 2**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు కుటుంబ ఆర్థిక లావాదేవీలు విజయవంతముగా పూర్తిఅగును. సొంత గృహములోకన్నా పరగృహవాసము మేలుగా ఉండును. సోదర, బంధువర్గము నుండి సహకారములు లభించును.ఆలోచనలు స్వార్థపూరితముగా నుండును. శత్రుకార్యములయందు విజయము చేకూరును. శరీరమున ఆరోగ్యమార్పులు సంభవించి వైద్యశాలలకు తిరిగి ధనం ఖర్చుచేస్తారు. భాగస్వామ్యవ్యవహారాలు అనుకూలించవు. సొంత నిర్ణయములు తీసుకొనుట మేలు. ఆకస్మికముగా స్త్రీలాభము కలుగును.చేయు వృత్తియందు ఉన్నత ప్రమాణాలు సాధిస్తారు. లాభసాటిగాఉండును.శ్రమున్నను సంతోషముతో జీవనాన్ని సాగిస్తారు.

వ్యవసాయదారులకు రెండుపంటలు సామాన్యముగా యున్నవి. విద్యార్థులకు మంచి గుర్తింపు కలుగును. కాంట్రాక్టర్లు, బ్రోకర్లు,ఫైనాన్స్‌వారికి నూతన పెట్టుబడులు లాభించుటకు వేచిచూడవలెను. ఫ్యాన్సీ, కిరాణా, వస్త్ర వ్యాపారులకు ఆదాయము మెండుగాఉన్నది. మద్యంవిక్రేతలకు, ప్రత్తి, జ్యోళు ్ళ వ్యాపారులకు తామాశించిన ఫలితాలను పొందుటకు కష్టించవలెను. సినీరంగము నందు వారికి, కళాకారులకు ప్రభుత్వమునుండి అవార్డు లొచ్చును. పురోహిత, జ్యోతిష,వాస్తుపండితులకు ఆదాయమునకు మించిన ఖర్చులున్నవి.డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లకు ఇతరప్రాంతములయందు మంచి గుర్తింపుకలుగును. రాజకీయ నాయకులకు విశేషమైన పనులు సాధించుటచేత ప్రజలలో గౌరవాన్ని పొందుతారు. ఈ రాశి స్త్రీలకు ధనమును సంపాదించుటలో నేర్పును సాధిస్తారు.

## నక్షత్ర ఫలితాలు

**మఖ 1,2,3,4-**ఆకస్మిక ధననష్టమేర్పడుతుంది. ప్రతివిషయంలో వ్యయ,ప్రయాసలు తప్పవు. వృత్తిరీత్యా కొత్త సమస్యలను ఎదుర్కొంటారు. బంధు,మిత్రులతో కలహాలు ఏర్పడకుండా జాగ్రత్త పడుట మంచిది. వేళప్రకారం భుజించుట కష్టమవుతుంది. మానసికాందోళన ఉంటుంది.

**పుబ్బ 1,2,3,4-** మానసిక ఆందోళన అధికమవుతుంది. ఆరోగ్యం గూర్చి జాగ్రత్త వహించాలి.ఆకస్మిక భయం ఆవహిస్తుంది. ప్రయాణాల్లో మెలకువ అవసరం. ప్రయత్నకార్యాల్లో ఇబ్బందు లెదురవుతాయి. విదేశీయాన ప్రయత్నాలు ఆలస్యంగా ఫలిస్తాయి.

**ఉత్తర 1-** ఆకస్మిక ధనలాభయెగముంటుంది. సంపూర్ణ ఆరోగ్యంగా ఉం టారు. కుటుంబంలో సుఖసంతోషాలు అనుభవిస్తారు. నూతన వస్తు ఆభరణాలను పొందుతారు. ప్రయత్నకార్యాలన్నింటిలో విజయం సాధిస్తారు.శుభవార్తలు విం టారు. ధైర్యసాహసాలు ప్రదర్శిస్తారు.

## నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**మఖ 1-**శని,రాహు,**మఖ 2-**కుజ,కేతు,**మఖ 3-**శుక్ర,రవి, **మఖ 4-**శని,రాహు, **పుబ్బ 1-**రవి,బుధ, **పుబ్బ 2-**గురు,రాహు, **పుబ్బ 3-**గురు,శని, **పుబ్బ 4-**రాహు,రవి, **ఉత్తర 1-**కేతు,శుక్ర **గ్రహములకు జపము,దానము చేయవలెను.**

## సింహ రాశి వారి స్వభావము

లావుగానూ,ఎత్తుగానూ ఉంటారు.స్థిరమైన అభిప్రాయములు కలిగియుందురు.ఎక్కువగా న్యాయశాఖలలో పని చేయుదురు.ఇతరుల తప్పులను తెలియచేసి మంచి మార్గము నందు పెట్టెదరు.అహంభావము ఉం డును. ఇతరుల కష్టములను తన కష్టములుగా భావిస్తారు.శాస్త్రము నందు మంచి ప్రావీణ్యత కలిగి పోటీ తనముచే ముందుకు సాగుతారు.రాజకీయముగా ఉన్నత స్థితిని పొందుదురు.స్వార్జితమును ఎక్కువగా ఇష్ట పడుదురు. అల్ప సంతానము ఉండును.వాహనములు వేగము తగ్గించి నడుపుట వలను ప్రమాదములు సంభవించవు. శత్రువులు అధికముగా ఉన్ననూ విజయము మీదేనని గుర్తించండి.పనులను అనుకున్నట్టుగా పూర్తి చేస్తారు.ఇతరులకు బాకీలు ఇస్తే తిరిగి వచ్చుట కష్టము.

**మాసవారి ఫలితములు**

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు ద్వితీయస్థానమున సంచారము చేఆర్థికిబ్బందులనుండివిముక్తి తదుపరి తృతీయస్థాన సంచారముచే ప్రజోపయోగకార్యములు ఆచరింతురు

ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు పంచమస్థానమున సంచారముచే గతంలోనిలచినపనులు వేగవంతమగును. తదుపరి అక్టోబరు 26 వరకు చతుర్థస్థాన సంచారముచే గృహంలోశుభకార్యములుజరుగును. తదుపరి పంచమస్థానమున సంచారముచే శ్రమకుతగ్గ ఫలితముండును ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు జన్మస్థాన సంచారముచే అనాలోచితపనులుచేయుదురు. తదుపరి వ్యయస్థాన సంచారముచే శారీరకముగాఅలసటనొందెదరు.

ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు సప్తమస్థాన సంచారముచే భార్యకుఅనారోగ్యము. తదుపరి షష్టస్థాన సంచారముచే జీవితసార్థకతయందునిమగ్నము కాగలరు

ఏప్రిల్ :క్రయవిక్రయాలలో లాభాన్నిపొంది ఆశించిన ఫలితాలనందు కుంటారు. బంధు మిత్రుల ద్వారా శుభవర్తమానాలు అందుతాయి.వ్యక్తిగత ప్రతిభతో ఉన్నత శిఖరాలనధిరోహిస్తారు. శారీరక బలహీనత ఏర్పడుతుంది. ఆరోగ్య విషయము నందు సరియైన జాగ్రత్తతో ఉండవలెను. నూతన గృహమును కొనుగోలు చేస్తారు.లక్ష్యసాధనకోసం శక్తియుక్తులను వినియోగిస్తారు. **పరిహారాలు : సుబ్రహ్మణ్యపూజ చేసి, పాలు నివేదన చేయాలి**

మే : ఉన్నతమైన ఫలితాలనుఅందుకుంటారు.ఆరోగ్యపరమైన జాగ్రత్తలుపాటించుట మంచిది. స్థిరాస్తి లావాదేవీలు మెరుగుపడతాయి.దేవతాప్రతిష్ఠల యందు పాల్గొంటారు. వ్యాపార రంగాల్లో అభివృద్ధికి అవకాశాలు మెరుగవుతాయి. ప్రయాణాలు ఆర్థిక ప్రయోజనాలను కలిగిస్తాయి. కుటుంబ సభ్యుల ఆరోగ్యస్థితి ఆందోళనకలిగించవచ్చు.
**పరిహారాలు : నమకము పారాయణ చేయించండి**

**జూన్** :ఆసక్తికర సంఘటనలు జరుగుతాయి. వృత్తి,ఉద్యోగాలలో పై వారితో అభిప్రాయ భేదాలుఏర్పడతాయి.ప్రసిద్ధిచెందిన యాత్రాస్థలాలు దర్శిస్తారు.రాజకీయ ప్రముఖులను కలుసు కుంటారు.ప్రత్యర్థులు వలన మానసికవేదన ఎదుర్కొంటారు.రాజకీయ నాయకుల సహకారంతో పనులను సాధించుకుంటారు. బాధ్యతలుపెరిగి వాటికి అనుగుణంగా వ్యవహరిస్తారు. **పరిహారాలు : లవంగాన్ని నాలుక క్రిందిభాగమున పెట్టుకోండి**

**జులై** : కార్యాలను తిరిగి ప్రారంభం చేస్తారు.గృహ అవసరాల నిమిత్తం ఆధునిక వస్తువులు కొనుగోలు చేస్తారు.విదేశీయానానికి తగిన ఏర్పాట్లను చేసుకుంటారు.పిల్లలతో సంతోషాన్ని పొందుతారు.ఆదాయంకోసం ఏర్పాట్లు చేసుకుంటారు.ఆరోగ్యంవిషయంలో జాగ్రత్త వహించ వలెను.బంధువులఇండ్లలో జరిగేకార్యాలలో పాల్గొనిగడుపుతారు.
**పరిహారాలు : మినుములు దానం చేయండి**

**ఆగస్ట్** :అపూర్వ దేవాలయాలు సందర్శిస్తారు.విహార యాత్రలకు అవకాశాలు ఉన్నాయి. అందరితో స్నేహంగాఉంటూ వ్యాపారాలను పెంచుకుంటారు.గృహమును అవసరాలకు తగిన ధనాన్నివెచ్చించి మార్పులుచేస్తారు.నూతన వ్యక్తులపరిచయాలుపెరగడం వలన ఆర్థిక వ్యవహారాలు మెరుగుపడి సంతోషంతో ఉంటారు.గతంలోచేసిన అప్పులుతీర్చి సుఖంగాఉంటారు. ఆస్థిలావా దేవీలలో విజయం సాధిస్తారు. **పరిహారాలు : శ్రీశైలం దర్శనానికి మీతో బాటు ఒకరిని తీసుకెళ్లండి**

**సెప్టెంబర్** : ఆరోగ్యం మెరుగుపడడానికి వైద్యులసలహాలను తీసుకుంటారు.ఎలక్ట్రిక్ వస్తువులు, నూతనవాహనాలు కొనుగోలుచేస్తారు.ఇతరులతో పోటీపడికార్యాలను సాధిస్తారు.బ్యాంకు లావాదేవీలు,ప్రయాణాలు లాభాలనిస్తాయి. కుటుంబ అవసరాలను గమనించి మసులుకుంటారు.ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. **పరిహారాలు : పెరుగు అన్నం పేదలకు పంచండి**

**అక్టోబర్** : పట్టుదలల వలన సోదరవర్గం నుండి విభేదాలు ఏర్పడతాయి. గతంలో నిలచిన పనులును పూర్తి చేస్తారు. కుటుంబవ్యక్తుల పట్ల శ్రద్ధ చూపాల్సిఉంటుంది.సమాన స్థాయివారి స్నేహమువలన నూతనపథకాలను అమలుచేస్తారు. ప్రోత్సాహకర పనులను విజయవంతంగా పూర్తి చేస్తారు.దూరప్రాంత శుభవర్తమానాలు అందుకుంటారు.
**పరిహారాలు : రోజూ ఆవుకు 4 అరటిపండ్లు తినిపించండి**

**నవంబర్** : పెరిగిన ఖర్చులను తగ్గింపు చేసుకుంటారు.విరామం లేకుండా సొంతపనులను పూర్తిచేస్తారు. దూరప్రాంత ప్రయాణాల వలన ఆరోగ్యం మందగిస్తుంది.శత్రు కార్యాలను వాయిదా వేసుకొనుట మంచిది. విదేశీయాన ప్రయత్నాలకు కావలసిన వస్తువులను కొనుగోలు చేస్తారు. స్థిరచరాస్తులు ద్వారా ఆదాయం పెరుగుతుంది. విద్య,ఉద్యోగ రంగాల్లో నూతన అవకాశాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. **పరిహారాలు : హనుమాన్ చాలీసా రోజుకు 3 సార్లు చదవండి**

**డిసెంబర్** : సంఘంలో విలువ,ఆదరణ పెరుగుతాయి. అంకిత భావంతో పనిచేసి ఉన్నత లక్ష్యాలను సాధిస్తారు. సభలు, సమావేశాల లో పాల్గొంటారు.దగ్గరిస్నేహితుల గృహంలో జరిగే శభకార్యాలలో పాల్గొంటారు.వ్యాపార అభివృద్ధికి సంబంధించిన వ్యవహారాలను సకాలంలో పూర్తిచేస్తారు.ఇతరుల అవసరాలను గమనించి తగువిధంగా సహాయంచేస్తారు.రచనావ్యాసంగాల వల్ల పత్రికల వారినుండి ధనసహాయము అందుతుంది. **పరిహారాలు : దత్తకవచం రోజుకు 8 సార్లు చదవాలి**

**జనవరి** :అనుకోని మార్పులు వృత్తివ్యాపారాలలో సంభవించే సూచన లున్నాయి. కుటుంబ సంబంధాలు మెరుగ్గానేఉంటాయి. అధికారులతో స్నేహంగా మాట్లాడడం వలన ఉత్తమ ఫలితాలు ఉంటాయి.ప్రత్యేకమైన నూతన ప్రయత్నాలు ఫలిస్తాయి.కోరుకున్న రంగాలలో ప్రోత్సాహకరంగా రాణిస్తారు.కార్యరూపంకోసం మేధావి వర్గం వారితో చర్చలు మెరుగుపడతాయి.విదేశీ సంబంధాలు మెరుగవుతాయి. **పరిహారాలు : గోధుమలు దానం చేయండి**

**ఫిబ్రవరి** : సాంస్కృతిక,పర్యాటక రంగాల్లో విశేషంగారాణిస్తారు.నూతనవిషయాల్లో నిర్ణయాలు వాయిదావేయకుండా ఉండుట మంచిది.కోర్టుసంబంధ విషయాలు జయకరంగా పూర్తిఅవుతాయి. దూరప్రాంత ప్రయాణాలవల్ల ఆరోగ్యం మందగిస్తుంది. నూతన ప్రయోజనాలు సిద్ధించడంతో సంతోషాన్ని పొందుతారు. ఆత్మీయులనుండి వివాహ ప్రయత్నాలు శుభంగా పూర్తిఅవుతాయి. **పరిహారాలు : గణపతి హోమం చేయించండి**

**మార్చి** : ఇతరుల విమర్శలకు బెదరకుండా ముందుకు సాగడం మంచిది. ఆర్థిక వ్యవహారాలు మెరుగవుతాయి.కుటుంబవ్యక్తుల అభివృద్ధికి అన్నివిధాలా కృషిచేస్తారు. గృహమార్పులు జరగడానికి అవకాశాలున్నాయి. ఉన్నత పదవులను అలంకరించుటవలన బలపడే అవకాశాలు అధికంగా ఉన్నాయి. ఇతరులనుండి పారితోషకాలు అందుకుంటారు. **పరిహారాలు : శివ సహస్రం పారాయణ చేయండి**



# కన్యారాశి ఫలితములు

ఉత్తర 2,3,4, పాదములు

హస్త 1,2,3,4 పాదములు చిత్త 1,2, పాదములు

**ఆదాయం - 5 వ్యయం - 5 రాజపూజ్యం - 5 అవమానం - 2**

గ్రహగతులను పరిశీలించగా ఈసంవత్సరమంతయు సామాన్యముగా నున్నను. జీవనోపాధికి ఆటంకములు ఏర్పడవు. నూతన ప్రయత్నములు ఫలించి ఫలితాలనుసాధిస్తారు. కుటుంబ,ఆర్థిక వ్యవహారాల్లో పట్టుదలతో పనులు సాధిస్తారు.కోర్టు,విదేశీ వ్యవహారాల్లోఫలిస్తాయి.సోదరవర్గమునుండి మనస్పర్థ లేర్పడును. పుత్రికాసంతానము కలుగుటకు ఆస్కారమున్నది. శత్రుకార్యముల యందు జాగ్రత్తవహించుట మేలు ఆరోగ్యమును జాగ్రత్తగా కాపాడుకోవలెను. అప్రయత్న ధనలాభమున్నది. ఆస్థివ్యవహారాలు పరిష్కారమగును. చేయువృత్తి యందు లాభముచేకూరును. తెలియని కీళ్ళనొప్పులు ఏర్పడును.

వ్యవసాయదారులకు తామాశించిన పంటలు పండుతాయి. విద్యార్థులకు ఉత్తీర్ణతను సాధించుటచేత పాఠశాలల్లో గుర్తింపు లభించును. కాంట్రాక్టర్లు, బ్రోకర్లు, ఫైనాన్స్‌వారికిశ్రమున్నను ఫలితాలనుసాధిస్తారు. ఫ్యాన్సీ,కిరాణా, వస్త్ర వ్యాపారులకు క్రయ విక్రయాద్వారా ఆదాయ మున్నది.మద్యంవిక్రేతలకు, ప్రత్తి, జ్యోళ్ళు వ్యాపారులకు సామాన్యముగానున్నను ఆదాయము లభించును.సినీరంగమునందు వారికి, కళాకారులకు గుర్తింపు పొందుటకు కృషిచేయవలెను. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితులకు ఆదాయము అంతంతమాత్రముగాఉండును.డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లకు పరిష్కారమార్గముల ద్వారా ఆదాయమార్గాన్ని పొందుతారు. రాజకీయ నాయకులకు పదవీభంగమున్నది.ఈ రాశి స్త్రీలకు సానుకూలముగా నుండి పనులు నెరవేరును.

### నక్షత్ర ఫలితాలు

**ఉత్తర 2,3,4-** కుటుంబమంతా సంతోషంగా ఉంటారు.గతంలో వాయిదా వేసిన పనులన్నీ పూర్తి చేసుకుంటారు.సంపూర్ణ ఆరోగ్య మేర్పడుతుంది. స్థిర నివాసముంటుంది.వ్యవసాయ మూలకంగా లాభాలను పొందుతారు.ప్రయత్న కార్యాలన్నీ ఫలిస్తాయి. సూక్ష్మ విషయాలను గ్రహిస్తారు.

**హస్త 1,2,3,4-** ప్రయాణాల్లో ధననష్టముంటుంది. స్థిరాస్తుల విషయంలో మిక్కిలి జాగ్రత్త అవసరం. కొత్త వ్యక్తులను నమ్మి మోసపోరాదు. క్రీడాకారులకు, రాజకీయరంగాల్లోని వారికి మానసికాందోళన తప్పదు. నూతన కార్యాలు వాయిదా వేసుకుంటారు. ఆరోగ్యం క్షీణిస్తుంది.

**చిత్త 1,2-** శారీరక ఆరోగ్యంతో బాధపడతారు. కోపాన్ని అదుపులో ఉంచుకొనుట మంచిది. అనవసర భయాన్ని పొందుతారు. కుటుంబ విషయాలు సంతృప్తికరంగా ఉండవు. వృథా ప్రయాణా లెక్కువవు తాయి. కుటుంబంలో అనారోగ్య బాధలుంటాయి.ప్రయత్నించే కార్యాలు విఫలమవుతాయి. ఋణప్రయ త్నాలు ఆలస్యంగా ఫలిస్తాయి.

## నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**ఉత్తర 2-**చంద్ర,బుధ,**ఉత్తర 3-**గురు,కేతు,**ఉత్తర 4-**శుక్ర,శని, **హస్త 1-**రవి,శని,**హస్త 2-**బుధ,చంద్ర,**హస్త 3-**కుజ,రాహు, **హస్త 4-**కుజ,రాహు, **చిత్త 1-**గురు,శని, **చిత్త 2-**కేతు,కుజ **గ్రహములకు జపము,దానము చేయవలెను.**

## కన్యా రాశి వారి స్వభావము

సామాన్య దేహముతో ఉంటారు. క్రింది దృష్టి కలిగి యుందురు. నిత్యమూ ధనాపేక్ష ఉండును. అధికారులను వశపరచుకుంటారు.అనారోగ్యము ఎక్కువగా ఉండును.నిజమును గ్రహిస్తారు.తెలివి తేటలు కలిగి ఉందురు.ఇతరులతో పనిని చేయుంచుట యందు సిద్ధ హస్తులు.లాభముంటేనే పని చేస్తారు. స్త్రీలతో ఎక్కువగా మెలగుదురు.లలిత కళల యందు ప్రావీణ్యత కల్గును. దానగుణము తక్కువ.భూ సంబంధ వ్యవహారాలు సాగును. అలంకారమును ఎక్కువగా ఇష్ట పడును.

## మాసవారి ఫలితములు

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు జన్మస్థానమున సంచారము చేఆరోగ్యవిషయంలో జాగ్రత్తఅవసరం తదుపరి ద్వితీయస్థాన సంచారముచే సాహసకార్యలయందుజయము

ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు చతుర్థస్థానమున సంచారముచే గృహమునఅశాంతిఏర్పడును. తదుపరి అక్టోబరు 26 వరకు తృతీయస్థాన సంచారిముచే దూరప్రాంతప్రయాణాలుకలసివచ్చును. తదుపరి చతుర్థస్థానమున సంచారముచే గతంలోనిలచినపనులునెరవేరును ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు వ్యయస్థాన సంచారముచే పుణ్యక్షేత్రములుదర్శించుటమంచిది. తదుపరి లాభస్థాన సంచారముచే ఉద్యోగ ప్రయత్నాలుఫలించును. ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు షష్టమస్థాన సంచారముచే కలహప్రదముగానుండును. తదుపరి పంచమస్థాన సంచారముచే ఆలోచనలద్వారా మంచిజరుగును

**ఏప్రిల్ :**పరిస్థితులకుఅనుకూలంగా మసలుకుంటారు. రాజకీయ రంగంలో కృషిని చేసి పదవులను సంపాదిస్తారు.వాహనప్రమాదాలు జరిగే అవకాశంఉన్నందున జాగ్రత్త వహించవలెను. వాయిదాపడిన పనులు పూర్తిచేస్తారు. పాతబాకీలు వసూలుఅవుతాయి.ప్రయోజనాలు, అవసరా లకు తగినవిధంగా ప్రణాళికలను సిద్ధం చేసుకొని సుఖాన్ని పొందుతారు. పుణ్యకార్యాలను ఆచరిస్తారు. **పరిహారాలు : నవగ్రహాలకు పూజహోమం చేయించండి**

**మే :** నూతన మార్పులద్వారా ఆదాయముచేకూరుతుంది.కోరుకున్న చోటికి బదిలీలు జరిగే అవకాశాలున్నాయి. పాతమిత్రులతో సంబంధబాంధవ్యాలు మెరుగుపడతాయి. నూతన కార్యాలను ప్రారంభించడం వలన ఖర్చులు ఎక్కువవుతాయి. సంఘంలో విశేషమైన గౌరవం ఏర్పడుతుంది. **పరిహారాలు : శ్రీశైలం దర్శనానికి మీతో బాటు ఒకరిని తీసుకెళ్లండి**

**జూన్ :** వ్యతిరేక ఆలోచనలవల్ల ముఖ్యమైన వ్యక్తులను,పనులను పాడుచేసుకుంటారు. అభివృద్ధి పనులకు సంబంధించిన వ్యవహారాలు పూర్తిఅవుతాయి. ఉద్యోగంలో ఎక్కువ సమయాన్ని వినియోగిస్తారు. చేయూతనిచ్చే పనులకు అభివృద్ధి కరముగా ఇతరులకు తోడ్పడుతారు. ఆలస్యం ఉన్నా పనులను అమలుచేయడానికి కృషి చేస్తారు. **పరిహారాలు : బియ్యందానం చేయండి**

**జులై :** ఇతరుల మాటలను నమ్ముకొని నూతన వ్యవహారాలు చేపట్టకపోవడం మంచిది. గతంలోరాని అతిథులు ఇంటికి వచ్చెదరు.ఆశయ సాధనకు పాటుపడతారు. ఆశయ సాధనకోసం ఉన్నతవ్యక్తుల పరిచయాలుచేసుకొని పనులనుసాధించుకుంటారు.ముఖ్యమైన పనులు పూర్తి చేస్తారు.ఇంటాబయటా అభిప్రాయ భేదములున్ననూ ఉత్సాహంపొందుతారు. **పరిహారాలు : బొబ్బర్లు దానం చేయండి**

**ఆగస్ట్ :**శుభకార్యాలకువిఘాతం లేకుండగా పూర్తిచేస్తారు. బాధ్యతలు పెరుగుతాయి. పుణ్యకార్యాలకు,సాధువుల సేవకు సమయాన్ని వెచ్చిస్తారు.సోదరులతో విభేదాలు ఏర్పడతాయి. నూతన ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు.సుఖమైన సౌకర్యాలను అమర్చుకుంటారు.పర్యాటక రంగంలోని వారికి ఉన్నతమైన పదువులుపొందుతారు.పుష్టికరమైన ఆహారముతీసుకొనుటలో శ్రద్ధను వహిస్తారు. **పరిహారాలు : బొబ్బర్లు దానం చేయండి**

**సెప్టెంబర్ :** ఉద్యోగ,వ్యవహారాల్లో మార్పులుశుభప్రదంగా ఉంటాయి. చేయు వృత్తి రంగాలలో ఆదాయాన్ని పొందుతారు.నూతన గృహారంభమును చేపడతారు.గృహమునకు అవసరమైన వస్తువులను కొనుగోలు చేస్తారు.అనుకూలమైన మిత్రుల సహకారముచే పనులను పూర్తిచేస్తారు. ఆధ్యాత్మిక చింతనపెరుగుతుంది. **పరిహారాలు : హనుమాన్ చాలీసా రోజుకు 3 సార్లు చదవండి**

**అక్టోబర్ :** అనుమానాలు ఎక్కువగా ఉండడం వలన మానసికంగా అశాంతి ఉంటుంది.గౌరవ అభిమానాలు సంఘమున తగ్గుతాయి.నూతనవ్యక్తులు పరిచయమవుతారు.రాజకీయ రంగాల్లో నూతన ప్రగతినిపొందుతారు.విలువైన వస్తువులు,ఆభరణాలు కొనుగోలు చేసే అవకాశాలున్నాయి.**పరిహారాలు : రామరక్షాస్తోత్రము రోజుకు 3 సార్లు చదవండి**

**నవంబర్ :**మేధావులతో అనుబంధంపెరుగుతుంది.వృత్తి,విద్యలయందునిష్ణాతులై ఉంటారు. శత్రువుల అంచనాలకు తగినవిధంగాపనులను పూర్తిచేసి విజయాన్ని సాధిస్తారు. అనారోగ్యము కలగవచ్చు. కుటుంబవ్యక్తుల విషయంలో తగినజాగ్రత్తలు తీసుకోవడం మంచిది.నూతన విధానాల ద్వారా ఆదాయాన్ని పెంచుకుంటారు.కర్తవ్య దీక్షతో పనులను సాధిస్తారు. **పరిహారాలు : నమకము పారాయణ చేయించండి**

**డిసెంబర్ :** నూతన స్థలాలు,ఇండ్లు కొనుగోలు చేస్తారు.వ్యాపార లావాదేవీలు పరిష్కారానికి రావచ్చు.శుభకార్య వేడుకలకు ప్రయాణాలను చేస్తారు. గతంలో విడిపోయిన మిత్రులు కలుస్తారు. నూతన ప్రతిపాదనలు,సమావేశాలలో పాల్గొంటారు. బాకీలు వసూలు అవుతాయి. సంతానం విషయంలో అసంతృప్తిగా ఉంటుంది. **పరిహారాలు : తెల్లఆవాలు పారుతున్న నీటిలో వేయండి**

**జనవరి :** బయటవ్యక్తుల పట్ల ఆదరణ,ఆప్యాయత ప్రదర్శిస్తారు. స్త్రీలు, పిల్లల సహకారంతో ముఖ్యమైన కార్యాలను సాధిస్తారు. కావలసిన సమయానికి ధనముచేతికి అందుతుంది. ప్రతిభకు అవకాశాలు లభిస్తాయి. వ్యక్తిగతంగా పేరుప్రతిష్ఠలు అభివృద్ధి చెందుతాయి.గతంలో నిలచిన పనులుతిరిగి ప్రారంభిస్తారు.సన్నిహితుల బాధలనుతెలుసుకొని పరిష్కారంచేస్తారు.ఉన్నత అధి కారులను మెప్పించగలిగే పనులు చేస్తారు. **పరిహారాలు : లవంగాన్ని నాలుక క్రిందిభా గమున పెట్టుకోండి**

**ఫిబ్రవరి :** అనుకోని ప్రమాదాలు సంభవిస్తాయి.కార్యదీక్షతో అన్ని పనులను నెట్టుకువస్తారు. అకాలభోజనం వలన ఆరోగ్యం లోపించకుండా జాగ్రత్త అవసరం.నూతన కార్యాచరణ పథకాలను చర్చిస్తారు. చేయువృత్తియందు గోప్యంగా ఉంటారు.పెట్టుబడులు లాభిస్తాయి. నూతన కార్యాలకు శుభకరం.భాగస్వాములతో రాజీపడటంలాభదాయకం. **పరిహారాలు : కందులు దానం చేయండి**

**మార్చి :**కుటుంబ బాధ్యతలు పరీక్షించేవిగా ఉంటాయి.ఉద్యోగంలో వ్యతిరేక భావాలు కల వ్యక్తులతో జాగ్రత్తఅవసరము. ఋణసంబంధ లావాదేవీలు మొత్తంమీద ఫలప్రదంగానే ఉం టాయనవచ్చు.ప్రయోజనాలు సిద్ధించేకార్యాలను ప్రారంభంచేస్తారు.సమయానుకూలంగా ప్రయా ణాలను చేసిధనమును సంపాదిస్తారు. ఇంటర్వ్యూలు కలసివచ్చి ఉద్యోగమునందు స్థిరపడతారు. **పరిహారాలు : శనగలు దానం చేయండి**



# తులారాశి ఫలితములు

చిత్త 3,4 పాదములు; స్వాతి 1,2,3,4 పాదములు
విశాఖ 1,2,3 పాదములు

**ఆదాయం - 2 వ్యయం - 8 రాజపూజ్యం - 1 అవమానం -5**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు సామాన్యయోగ ప్రదముగానున్నది. కుటుంబఆర్థికవ్యవహారాలలో పరిష్కారమార్గాలను వెతుక్కో వలెను.సోదరసహారమందుటచేత మనశ్శాంతినీ పొందుతారు. గృహమున వివాహాది శుభకార్యములు జరుగును. పుత్రసంతానముద్వారా అభివృద్ధినిసాధిస్తారు. కోర్టు, శత్రు, విదేశీ వ్యవహారాలలో సంవత్సరాంతమువరకు వేచిచూడుట మంచిది. భాగస్వామ్య పెట్టుబడులు సంవత్సరాం తమున కలసివచ్చును. భార్యతో తగవులు ఏర్పడును. ఆకస్మికప్రయాణాలవలన శరీరశ్రమను పొందుతారు. యజ్ఞముల యందుయాగములయందు పాల్గొంటారు.చేయువృత్తియందు ప్రమోషన్లు సాధిస్తారు. లాభములో కొంత పుణ్యకార్యాలకు వెచ్చింస్తారు. సుఖనిద్ర లేకుండా కష్టపడతారు.

వ్యవసాయదారులకు ఇతరపంటలుకలసివచ్చును. విద్యార్థులకు ప్రయత్నముద్వారా ఫలితాలను సాధించుకోవలసి వచ్చును. కాంట్రాక్టర్లు, బ్రోకర్లు, ఫైనాన్స్‌వారికి లాభసాటివ్యాపారమ సాగును. ఫ్యాన్సీ,కిరాణా, వస్త్ర వ్యాపారులకు ఎక్కువ నూతన ఆదాయములు కలసివచ్చును. మద్యంవిక్రేతలకు, ప్రత్తి, జ్యోళ్ళు వ్యాపారులకు పెట్టుబడికి మించి ఆదాయము లాభలించును. సినీరంగమునందు వారికి, కళాకారులకు విపరీతశ్రమచేత గుర్తింపు పొందుతారు. పురోహిత,జ్యోతిష, వాస్తు పండితులకు ఆదాయము భాగుగాలేదు. డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లకు విశేషధనలాభమున్నది. రాజకీయ నాయకులకు తాముఆశించినపదవులు లభించుటచేత సంతోషాన్ని పొందుతారు.కంప్యూటర్ రంగము వారికి శుభప్రదము. ఈరాశి స్త్రీలకునూతనపరిచయాల ద్వారా వ్యాపారములు ప్రారంభించి నష్టపోతారు.

### నక్షత్ర ఫలితాలు

**చిత్త 3,4-** వృత్తి ఉద్యోగరంగాల్లో అభివృద్ధి ఉంటుంది. ఆకస్మిక ధనలాభాన్ని పొందుతారు. కుటుంబ సౌఖ్యం సంపూర్ణంగా లభిస్తుంది. గౌరవ ,మార్యాదలు పెరుగుతాయి. పిల్లలకుసంతోషం కలిగించే కార్యాలుచేస్తారు. శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెరవేరతాయి. ఆత్మీయుల సహకారం లభిస్తుంది.

**స్వాతి 1,2,3,4-** అనారోగ్య బాధలతో సతమతమవుతారు. నూతన కార్యాలకు ఆటంకాలెదురవుతాయి. ప్రయాణాల్లో జాగ్రత్త అవసరం. వృత్తి,వ్యాపార రంగాల్లో ధననష్టమేర్పడుతుంది. అవకాశముంటుంది. ఆత్మీయుల సహాయ,సహకారాలకై వేచిఉంటారు.దైవదర్శనం లభిస్తుంది.

**విశాఖ 1,2,3-** మానసికాందోళనతో కాలంగడుస్తుంది. ఆకస్మిక ధననష్ట మేర్పడే అవకాశముంటుంది. స్థిరమైననిర్ణయాలు తీసుకోలేకపోతారు. అధికారులతో జాగ్రత్తగా మెలగుట మంచిది. అనవసర భయంఆవహిస్తుంది. బంధువులతో తగాదాలు లేకుండా చూసుకోవడం అవసరం.

## నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**చిత్త 3-**రవి,కుజ,**చిత్త 4-** గురు,శని,**స్వాతి 1-**బుధ,రవి, **స్వాతి 2-**శుక్ర,కుజ, **స్వాతి 3-**రవి,గురు, **స్వాతి 4-**బుధ,చంద్ర, **విశాఖ 1-**శని,బుధ,**విశాఖ 2-**గురు,చంద్ర,**విశాఖ 3-**రాహు,శని గ్రహములకు **జపము,దానము చేయవలెను.**

## తులా రాశి వారి స్వభావము

లావుగా,పొడవుగా నుందురు.దృష్టి పైకి ఉండును.స్వయంకృషితో పైకి వచ్చును.న్యాయ శాఖలలో ఎక్కువగా పని చేయుదురు.వినయవిధేయతలు కలిగి ఉందురు.పేరుప్రఖ్యాతలు సాధింతురు. విద్యయందు మంచి ఉత్తీర్ణతను కలిగి ఉంటారు.ఉన్నత పదవులను అలంకరి స్తారు.క్రొత్త విషయములను కని పెట్టుదురు.బట్టతల ఎక్కువగా నుండును. సరళముగా మాట్లాడతారు.భయము తక్కువ.విహార యాత్రలు చేస్తూంటారు. దైవభక్తి ఎక్కువ. ఖర్చులను అదుపులో ఉంచుతారు. ధర్మముగా ఆలోచిస్తారు.

## మాసవారి ఫలితములు

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు వ్యయస్థానమున సంచారము చేశారీరకశ్రమను పొందుదురు తదుపరి జన్మస్థాన సంచారముచే గృహమునశుభకార్యములుచేయుటమంచిది.

ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు తృతీయస్థానమున సంచారముచే నూతనగృహము కొనుగోలుచేయుదురు. తదుపరి అక్టోబరు 26 వరకు ద్వితీయస్థాన సంచారముచే కుటుంబమునఅస్థిరత. తదుపరి తృతీయస్థానమున సంచారముచే వేగవంతమైనపనులుసాధిస్తారు ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు లాభస్థాన సంచారముచే గతంలోనిలచినఉద్యోగమువచ్చును. తదుపరి దశమస్థాన సంచారముచే రాజకీయముగాబలవంతులగుదురు. ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు పంచమస్థాన సంచారముచే బంధువులతోప్రమాదములు తదుపరి చతుర్ధస్థాన సంచారముచే సుఖవంతమైన జీవితంగడుపుదురు

**ఏప్రిల్ :** అటవీ ప్రాంతములయందు తిరుగుటవలన వస్తువులు పోగొట్టుకొనుట జరుగును.స్త్రీ సంతానముద్వారా ధనలాభాన్ని పొందుతారు. విద్యార్థులకు ప్రతిభకు తగిన గుర్తింపు లభిస్తుంది.శుభవర్తమానాలు అందిప్రయాణము చేయవలసివచ్చును.కుటుంబపరిస్థితుల్లో అనూహ్య మార్పులుంటాయి. **పరిహారాలు : దుర్గాసూక్తము చదవండి**

**మే :** నూతనవ్యక్తులను నమ్మి మోసపోకుండా ఉండుట మంచిది.దూరపుబంధువుల రాకవలన కుటుంబమున సంతోషకార్యములు నిర్వహిస్తారు. స్థిరాస్తులకు సంబంధించిన విషయాలు పరిష్క రింపబడే అవకాశంలభిస్తుంది.ఆలస్యంగానైనా అభివృద్ధిసాధిస్తారు.కుటుంబంలోని వ్యక్తుల అనా రోగ్యకారణంగా ధనాన్ని వెచ్చించాల్సివస్తుంది. **పరిహారాలు : రామరక్షాస్తోత్రము రోజుకు 3 సార్లు చదవండి**

**జూన్ :** ఆశ్చర్యకర సంఘటనలుజరుగుతాయి.పుణ్యక్షేత్రములు దర్శించే అవకాశాలు లభిస్తాయి.ఆనందంగా కాలంగడుపుతారు.శుభకార్య ప్రయత్నాలునెరవేరతాయి. కళాకారులకు, మీడి యా రంగాల్లోని వారికి ఆర్ధిక పరిపుష్టి ఏర్పడుతుంది.గూఢచారుల ద్వారా రహస్య విషయాలు తెలుసుకుంటారు.విదేశీ ప్రయత్నాలవల్ల జాగ్రత్తగానుండుట మంచిది. **పరిహారాలు : శ్రీశైలం దర్శనానికి మీతో బాటు ఒకరిని తీసుకెళ్లండి**

**జులై :** అద్భుతమైన కార్యములు కలసివచ్చును.తలచినంతనే పనులు పూర్తిఅగును. సంఘంలోను,కుటుంబమున గౌరవము పెరుగుతుంది.దంతసంబంధ వ్యాధులువచ్చును.అందరికీ ఆమోద యోగ్యమైన శుభకార్యప్రయత్నాలు సులభంగానెరవేరుతాయి.నూతనవ్యాపారాలు ప్రారంభిస్తారు. శస్త్రచికిత్సలు జరుగుటకు అవకాశమున్నది. **పరిహారాలు : కందులు దానం చేయండి**

**ఆగస్ట్ :** నీటిపై ప్రయాణములు చేయుదురు.పుణ్యక్షేత్ర సందర్శనము వలన వ్యవహారములు వేగవంతముగా నడుచును. గృహమున నిశ్చితార్థ కార్యక్రమములు జరుగును.జప,హోమాదు లకు ధనము ఖర్చు చేయుదురు. ఆర్ధిక లావాదేవీలు మెరుగు పడతాయి.అనుకోని ప్రయాణము కలిగి ఆనందంతో ఉంటారు.గొప్ప పనులు చేయుటయందు ఆసక్తి కలుగును. **పరిహారాలు : మీ జన్మనక్షత్ర జపంచేయించి, వస్త్రదానం చేయండి**

**సెప్టెంబర్ :** కుటుంబంలో శుభకార్య సూచనలు కలవు.అనుకోని అతిధులు రావడంతో గృహంలో సందడి వాతావరణం ఏర్పడుతుంది. రాజకీయంగా పలుకుబడిపెరుగుతుంది. వ్యవ సాయ రంగంలోని వారికి లాభదాయకంగా ఉంటుంది. బ్యాంకుద్వారా ఋణప్రయత్నాలు ఫలిస్తాయి. బంధువులతో సమస్యలు ఏర్పడవచ్చు. **పరిహారాలు : ఇంటి పురోహితునకు పాదపూజచేసి సత్కరించండి**

**అక్టోబర్ :** ప్రయాణాలలో జాగ్రత్త అవసరము.పుణ్య కార్యములయందు పాల్గొంటారు.తరచూ నిద్రలో చెడు కలలు వచ్చును.ఆరోగ్యం గూర్చి శ్రద్ధ అవసరం. గృహమున శుభకార్యప్రయత్నాలు చురుకుగా చేస్తారు. నూతన వస్త్ర,ఆభరణాలు కొనుగోలు చేస్తారు.విందులు, వినోదాల్లో పాల్గొనే అవకాశం లభిస్తుంది. **పరిహారాలు : దత్తకవచం రోజుకు 8 సార్లు చదవాలి**

**నవంబర్ :** స్థిరాస్తుల విషయంలో జాగ్రత్తగా వ్యవహరించుట మంచిది.స్త్రీలద్వారా ధనవ్యయ మెక్కువచేస్తారు.తలచిన కార్యాలకు ఆటంకములు లేకుండా పూర్తి చేయుదురు. ప్రయాణాలలో ఇబ్బంది కలుగుతుంది.తొందరపాటు తనముచే చేసిన తప్పుకు తగిన అనుభవం కలుగుతుంది. సత్కారాలు స్వీకరిస్తారు.అందరితో మంచిగా మెలుగుతారు. **పరిహారాలు : రామరక్షాస్తోత్రము రోజుకు 3 సార్లు చదవండి**

**డిసెంబర్ :** శుభకార్య ప్రయత్నాలు జరుగుతాయి.ఆర్ధిక పరిస్థితి మెరుగవుతుంది.నూతన వ్యాపారాలు ప్రారంభిస్తారు.మనశ్శాంతి కోసం జప,హోమాదులను నిర్వహిస్తారు.అధికారులతో పేచీలుఉంటాయి.సరియైన ఆలోచన లేకపోవడం వలన కుటుంబ విషయాలు రచ్చకెక్కుతాయి. ముఖ్య విషయమై కోర్టులో చుక్క ఎదురవుతుంది.

**జనవరి :** అదృష్టం కలిసివచ్చి ఎంతోకాలంగా ఆగివున్న పనులు ఫలితమిస్తాయి.క్రొత్త కార్య క్రమాలు ప్రారంభించి ధనలాభమును పొందుతారు.పటిష్టమైన ప్రణాళికలను రూపొందించు కుంటారు.ఆహార విషయంగా సమస్యలు తలెత్తవచ్చును.విందులకు దూరంగా వుండాలి.కవులకు, కళాకారులకు గుర్తింపు ఉంటుంది. పోలీసునిఘా వర్గమువారితో జాగ్రత్తగావ్యవహరించాలి. **పరిహారాలు : కుక్కకు తిండి వేయండి లేదా గారెలు పెట్టండి**

**ఫిబ్రవరి :** శుభకార్య ప్రయత్నాలు నెరవేర్చుతారు.విద్యార్థులకు మంచి ప్రోత్సాహం లభిస్తుంది. ముఖ్యమైన విద్యలను అభ్యసిస్తారు.ఆధ్యాత్మిక ప్రసంగాలు ఆకట్టుకుంటాయి. గతంలో పెండింగులో ఉన్న ఉద్యోగావకాశములు వచ్చును.కుటుంబ పరిస్థితులు ఆహ్లాదకరంగా మారతాయి.ఉన్నతస్థాయి వ్యక్తుల పరిచయాలవల్ల రాణించే అవకాశము ఉంటుంది. **పరిహారాలు : అరసవల్లి వెళ్లండి, సూర్యనమస్కారాలు చేయించండి**

**మార్చి :** శుభకార్యాలలో ఇబ్బందులు ఎదురవుతాయి. మనసికాందోళనకు గురవుతారు.కొన్ని కార్యాలు వాయిదా పడతాయి. జప,హోమాలకు సమయము,ధనము వెచ్చించవలసి వచ్చును. ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొనే అవకాశము లభిస్తుంది.కుటుంబ పరిస్థితులు సంతృప్తికరంగా ఉంటాయి.ఉద్యోగ విషయంలో పై అధికారుల వలన ఇబ్బందులెదురవుతాయి. **పరిహారాలు : ఉదయం సాయంత్రం ఇంట్లో దీపారాధన చేయండి**



# వృశ్చికరాశి ఫలితములు

**విశాఖ 4 పాదము, అనూరాధ 1,2,3,4 పాదములు**

**జ్యేష్ఠ 1,2,3,4 పాదములు**

| ఆదాయం - 8 | వ్యయం - 14 | రాజపూజ్యం - 4 | అవమానం - 5 |
|---|---|---|---|

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు నిరాశనిస్పృహాలతో కాలముగడుచును.ఏపనిప్రారంభంచేసినా కార్యఆటంకములు, అపనిందలు కలుగును.నూతన వ్యక్తులపరిచయాల ద్వారా వ్యాపారంలో కొంతలాభాన్ని పొందు తారు.బంధువర్గమునుండి ధనసహాయమందును. మందబుద్ధిచే విపరీత పరిణామ ములు ఎదుర్కొందురు. సంవత్సరాంతమునగృహమున శుభకార్యములు జరుగును. పుత్రసంతానముద్వారా చికాకులుకలుగును.కోర్టు,విదేశీ వ్యవహారాలు పరిష్కార మైనను లాభాలను పొందలేరు. జీవిత భాగస్వామివలన ధనవిషయాలు లబ్ధిని చేకూరుస్తాయి. చేయువృత్తియందు,ఆస్తివిషయాలలో సామాన్యముగా ఉన్నది.

వ్యవసాయదారులకు రెండుపంటలు సామాన్యముగా నున్నది. విద్యార్థులకు సంవత్సరప్రారంభమున గుర్తింపు లభించును. కాంట్రాక్టర్లు,బ్రోకర్లు, ఫైనాన్స్‌వారికి కష్టముగానున్నది. ఫ్యాన్సీ,కిరాణా, వస్త్ర వ్యాపారులకు సామాన్యముగా ఉన్నది. మద్యంవిక్రేతలకు, ప్రత్తి, జ్యోళు వ్యాపారులకు ధనము యేరులైపారును. సినీరంగ మునందు వారికి, కళాకారులకు నూతనముగా ప్రయత్నసాధన జరిగి ఫలితాల్ని పొందుతారు.పురోహిత,జ్యోతిష,వాస్తుపండితులకు సంఘమున గౌరవముతగ్గును. డాక్టర్లు,ఇంజనీర్లు,లాయర్లకు ఉన్నతమైన ఆలోచనలు కలిగి సత్వర ధనలాభము, పేరుప్రఖ్యాతలు పెంచుకొంటారు. కంప్యూటర్ రంగమువారికి లాభదాయకం.. రాజకీయ నాయకులకు ఉన్నపదవులుఊడిపోయి రోడ్డునపడతారు. ఈరాశి స్త్రీలకుఉన్నతఆశయాలతో కష్టించి పనిని సాధిస్తారు.

## నక్షత్ర ఫలితాలు

**విశాఖ 4-** గృహంలో మార్పులు జరిగే అవకాశాలున్నాయి. ఆర్థిక పరిస్థితి గూర్చి చింతిస్తారు. బంధు,మిత్రుల సహాయ సహకారాలు ఆలస్యంగా లభిస్తాయి. అద్భుతమైన అవకాశాలు లభించడంతో ఆనందంగా కాలక్షేపం చేస్తారు. కళాకారు లకు,మీడియా రంగాలవారికి ప్రతిభకు తగిన గుర్తింపు లభిస్తుంది. ఆకస్మిక ధనలాభ యోగముంది. శుభవార్తలు వింటారు.

**అనూరాధ 1,2,3,4-** కుటుంబ పరిస్థితులు సంతృప్తికరంగా నుండవు. స్త్రీలు ఆరోగ్యంపట్ల శ్రద్ధవహించకతప్పదు. ఆర్థిక ఇబ్బంది లెదురవుతాయి. ఆనందంగా కాలక్షేపం చేస్తారు. ఒకముఖ్యమైన సమాచారంవల్లలాభం చేకూరు తుంది.వృత్తి,ఉద్యోగ రంగాల్లో ఊహించని అభివృద్ధి ఉంటుంది. మిత్రుల కలుస్తారు.

**జ్యేష్ఠ 1,2,3,4-** సట్టుదలతో కొన్ని కార్యాలు సాధించుటకు ప్రయత్నిస్తారు. దైవికంగా వచ్చే ఆటంకాలతో ఆందోళన చెందుతారు. పిల్లల పట్ల అశ్రద్ధ ఏమాత్రం పనికి రాదు. పగసాధించే ప్రయత్నాలు మానుకోవడం మంచిది.

## నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**విశాఖ4-**రాహు,కేతు,**అనూరాధ1-**బుధ,రవి,**అనూరాధ 2-**కుజ,చంద్ర, **అనూరాధ 3-**రాహు,శని,**అనూరాధ 4-**కేతు,గురు,**జ్యేష్ఠ 1-**గురు,శుక్ర, **జ్యేష్ఠ 2-**రవి,శుక్ర,**జ్యేష్ఠ 3-**కుజ,చంద్ర,**జ్యేష్ఠ 4-**రాహు,బుధ **గ్రహములకు జపము,దానము చేయవలెను.**

## వృశ్చిక రాశి వారి స్వభావము

లావుగా,పొట్టిగా నుందురు.క్రింది దృష్టి ఉండును. ఇతరులకు హాని చేయుటలో నేర్పరులు. శ్రమ ఎక్కువ.మాటయందు నిలకడ తక్కువ.మిత్రులను శత్రువులగా మార్చుకుందురు.ధనము నందు ప్రేమ ఉండును.అందముగా నుండును.గొప్ప తనము ఎక్కువ.నటన యందు ప్రావీణ్యత ప్రతీ పని యందు నిష్కర్షగా నుందురు.జీవితంలో రెండవ భాగం బాగుండును.పట్టుదల ఎక్కువ. రహస్య వృత్తులను చేయుదురు. చేసే పని ఇతరులకు చెప్పరు.ఆలోచనా పరులు. విద్యయందు అభిలాషులు.అనారోగ్యము ఎక్కువగా ఉన్నందున ఆహారము నందు తగు జాగ్రత్తలు తీసుకున్న ఎడల మంచి ఆరోగ్యము చేకూరును.

**మాసవారి ఫలితములు**

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు లాభస్థానమున సంచారము చేఅనుకున్నపనులు సాధింతురు తదుపరి వ్యయస్థాన సంచారముచే అధికధనవ్యయము. ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు ద్వితీయస్థానమున సంచారముచే నేత్రసంబంధవ్యాధులు కలుగునుజాగ్రత్తఅవసరం తదుపరి అక్టోబరు 26 వరకు జన్మస్థాన సంచారముచే ఆరోగ్యము నందుమార్పులకు అవకాశం. తదుపరి ద్వితీయస్థానమున సంచారముచే అనుకున్నపనులు ఆలస్యముగాజరుగును. ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు దశమస్థాన సంచారముచే స్థానచలనము కలుగును తదుపరి నవమస్థాన సంచారముచే తండ్రితరపుఆస్తివచ్చును. ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు చతుర్థస్థాన సంచారముచే అస్థిరముగానుండును తదుపరి తృతీయస్థాన సంచారముచే సోదరవర్గమువారితో విబేధాలు

**ఏప్రిల్ :** వ్యాపారంలో విశేషలాభాన్ని ఆర్జిస్తారు.మంచివారితో స్నేహంచేస్తారు.ముఖ్యమైన సమాచారాన్ని సేకరించి తదనుగుణంగాప్రవర్తిస్తారు.ఆధ్యాత్మికకార్యక్రమాలకు ధనాన్ని వెచ్చిస్తారు. పేరు,ప్రతిష్టలు లభిస్తాయి.దానధర్మాలు చేయుటయందు ఆసక్తి కలిగిఉంటారు.గతంలో పోయిన పదవులు తిరిగిపొందుతారు.సంతానాభివృద్ధి కలుగుతుంది.**పరిహారాలు : గణపతి అష్టోత్తరము ఉదయ సాయంకాలములు చదవండి**

**మే :** స్త్రీ సంతానమునకు వివాహముచేయుదురు.బంధువులవలన వస్తువులు పోయే సూచన లున్నాయి.క్రయవిక్రయాలు జోరుగాసాగుతాయి.పండితుల ఆశీస్సులు లభిస్తాయి. ఆరోగ్యం విషయంలో శ్రద్ధ వహించవలసి వచ్చును.స్పెక్యులేషన్లు లాభిస్తాయి.నూతన వాహన సదుపాయము సమకూరుతుంది. **పరిహారాలు : దత్తకవచం రోజుకు 8 సార్లు చదవాలి**

**జూన్ :**ఆస్తులకోసం కలహాలేర్పడే అవకాశం ఉంటుంది. ప్రయాణాలలో ధననష్టముంటుంది. విదేశీయాన ప్రయత్నం వాయిదా వేసుకొనుట మంచిది. పరీక్షలయందు శ్రమచేసి ఫలితాలను పొందవలసి వచ్చును.గౌరవ పురస్కారాలు లభిస్తాయి.విజ్ఞాన,విహార యాత్రలు చేయుదురు.నేత్ర సంబంధ వ్యాధులు ప్రబలును. **పరిహారాలు : మారుతీ స్తోత్రము 11 సార్లు రోజూ చదవండి**

**జులై :** కార్యాలకు ఆటంకాలెదురవుతాయి.స్థిరాస్తులకు సంబంధించిన విషయాల్లో జాగ్రత్తగా నుండుటమంచిది.నూతన కార్యాలు ప్రారంభము చేయుదురు.విదేశీప్రయత్నాలకు అనుకూల కాలము.పాద సంబంధ వ్యాధులకు అవకాశము కలదు.అభివృద్ధి పనులయందు పాల్గొంటారు. రాజకీయ పరముగా సహకారము అందుతుంది. **పరిహారాలు : రుద్రహోమము చేయించాలి**

**ఆగస్ట్ :**కుటుంబ సమస్యలతో సతమతమవుతారు.స్థానచలన సూచనలుంటాయి.గృహంలో మార్పులు చేస్తారు.మనోధైర్యంతో ముందుకు సాగుతారు.పాపప్రక్షాళన అవుతుంది.ధనలాభంతో ఆనందాన్ని అనుభవించుతారు.ఇతరులకు ఉపకారం చేసి పేరు,ప్రతిష్ఠలు సంపాదిస్తారు. నిద్రలేమితనము చేత శిరోవేదన అధికమవుతుంది. **పరిహారాలు : కందులు దానం చేయండి**

**సెప్టెంబర్ :** ఇతరుల కోపానికి గురవుతారు.పై అధికారుల వలన ఉద్యోగమునందు ఇబ్బంది ఏర్పడవచ్చు.పోలీసు కేసులు,కోర్టు కేసులు చుట్టూ తిరగవలసివస్తుంది. కుటుంబ అభివృద్ధికి మంచి అవకాశముంటుంది. ఆరోగ్య విషయమున జాగ్రత్తగానుండుట మంచిది.గృహమునకు ఋణప్రయత్నాలు చేస్తారు. **పరిహారాలు : రోజూ ఆవుకు 4 అరటిపండ్లు తినిపించండి**

**అక్టోబర్ :** ఆకస్మిక ప్రయాణాలలోభయాందోళనకు గురవుతారు.రహస్య ఒప్పందాలు కుదురు తాయి.ముఖ్యమైన సమాచారము అంది తగిన అవకాశాలు పొందుతారు.గతంలో నిలచిన ఉద్యోగప్రయత్నాలు లాభిస్తాయి. తీర్థయాత్రలు చేస్తారు.అధికారుల సహకారం ఆలస్యంగా లభి స్తుంది. లావాదేవీలలో కొంత అనిశ్చితి ఉంటుంది. **పరిహారాలు : మీ దగ్గరలోని దేవాలయాన్ని శుభ్రం చేయండి**

**నవంబర్ :** ప్రతివిషయంలోనూ ఆచితూచి వ్యవహరించాలి.వృత్తిరీత్యా క్రొత్తదనంకోసం పాటుపడతారు. సంతానములేని వారికి సంతానము కలుగుతుంది.ముఖ్యమైన కార్యక్రమాలు వాయిదా వేయుటవలన నష్టాన్ని ఎదుర్కొంటారు.శారీరక అనారోగ్య బాధలు అధిక మవుతాయి. ఇతరులతో విరోధమేర్పడకుండా జాగ్రత్తవహించాలి. **పరిహారాలు : పేదలకు వస్త్రదానము చేయాలి**

**డిసెంబర్ :** నూతన వస్తు,ఆభరణాలను కొనుగోలుచేస్తారు.లాటరీలలో బహుమతులు పొందు తారు.కార్యాలన్నింటిలో విజయం సాధిస్తారు.శుభకార్యములు జరుగును.వివాహ ప్రయత్నములు నెరవేరుతాయి.కోర్టుసమస్యలు పరిష్కారమవుతాయి.ఇతరులతో ఉల్లాసంగాగడుపుతారు. యజ్ఞ యాగాదులయందు పాల్గొని దేవతానుగ్రహాన్ని పొందుతారు. **పరిహారాలు : గోధుమలు దానం చేయండి**

**జనవరి :**గృహనిర్మాణ ప్రయత్నంచేస్తారు.కుటుంబ సౌఖ్యముంటుంది. శత్రుబాధలు తొలుగు తాయి.దీర్ఘకాలిక సమస్యలు తొలగి పోతాయి.ఆరోగ్యంబాగుంటుంది.అనుకొన్న పనులు పూర్తి చేస్తారు.ఆకస్మిక ధనలాభంతో ఆనందాన్ని పొందుతారు.సమాజ కార్యక్రమాల్లో నిమగ్నులవుతారు. పేరు,ప్రతిష్టలు కోసం గొప్పదనాన్ని చాటుకుంటారు. **పరిహారాలు : శనగలు దానం చేయండి**

**ఫిబ్రవరి :** పట్టుదలతో కార్యాలను పూర్తిచేస్తారు.ఇంట శుభకార్యాలు జరుగును.రాజకీయంగా పలుకుబడి ఏర్పడుతుంది.సామాజిక వర్గంవారితో సంబంధాలుబలపడతాయి.నూతన వస్తు, ఆభరణాలు కొనుగోలుచేస్తారు.ముఖ్యమైన వ్యక్తులద్వారా వ్యాపారములు ప్రారంభముచేయుదురు. అన్నిరంగాల్లో అద్భుత విజయాలనుసాధిస్తారు. **పరిహారాలు : బెల్లంముక్కను దేవునికి నివేదన చేసి ఆరగించండి**

**మార్చి :** కుటుంబమున సుఖ,సంతోషాలతో గడుపుతారు. సంతానము ద్వారా సమాజంలో గుర్తింపు లభిస్తుంది.నూతన ప్రయత్న కార్యాలు ఫలిస్తాయి.బంధు,మిత్రులను సమాగమము ఏర్పడుతుంది. మారిన పరిస్థితులు సంతృప్తికరంగా ఉంటాయి.వృత్తి, ఉద్యోగ రంగాల్లో మంచి అభివృద్దిని సాధిస్తారు.ముఖ్యమైన వ్యక్తుల్ని కలిసి దైవిక కార్యక్రమాలకు సమాలోచన చేస్తారు. **పరిహారాలు : ఇంటి పురోహితునకు పాదపూజచేసి సత్కరించండి**



# ధనూరాశి ఫలితములు

మూల 1,2,3,4 పాదములు

పూర్వాషాఢ 1,2,3,4 పాదములు; ఉత్తరాషాఢ 1 పాదము

**ఆదాయం - 11 వ్యయం - 5 రాజపూజ్యం - 7 అవమానం - 5**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు సామాన్యముగా నున్నది. నూతన ప్రయత్నములు ఫలించినను అసంతృప్తిగా ఉండును. ధనలాభము, కుటుంబ వ్యవహారాలు సక్రమంగా నెరవేరును. కోర్టు,విదేశీ విషయాలు లాభించును. ఉన్నతపదవులను అలంకరించి తోటివారిని సైతం అబ్బురపరుస్తారు. సోదర,బంధువర్గమునుంది. సహకారముఅందుతుంది. గృహమున కొంతచికాకుగా నుండును. గృహనిర్మాణము వాయిదా వేయుట మంచిది. సంతానము ద్వారా ఆనందాన్ని పొందుతారు. శత్రుకార్యములయందు ఆలస్యముగావిజయాన్ని పొందు తారు. భాగస్వామ్య వ్యవహారాలు సుఖమును ఇవ్వవు. ఆకస్మిక ప్రయణాలుంటాయి. చేయువృత్తియందు పైవారి ప్రోత్సాహముం టుంది. లాభవ్యయములు సమానము. నిద్రలేమి తనముచే ఆరోగ్యభంగమగును.

వ్యవసాయదారులకు ముఖ్యపంటలు కలసివచ్చును. విద్యార్థులకు నూతన విద్యకు మంచి అవకాశములు లభించును. కాంట్రాక్టర్లు,బ్రోకర్లు, ఫైనాన్స్‌వారికి నూతన పెట్టుబడులు పెట్టుటవలన లాభమువచ్చును. ఫ్యాన్సీ,కిరాణా,వస్త్ర వ్యాపారు లకు ఆదాయము పుష్కలముగా ఉన్నది. మద్యంవిక్రేతలకు, ప్రత్తి,జోళ్ళ వ్యాపారులకు నూతన ధనాదాయము కలుగును. సినీరంగమునందు వారికి, కళాకారులకు ప్రోత్సాహక బహుమతులందును. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితులకు సంఘు మున గౌరవం లేకున్నను ఆదాయము లాభించును. డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లకు ప్రభుత్వము వారి నుండి ఆరోపణలు ఎదుర్కొందురు. కంప్యూటర్ రంగము వారికి శుభప్రదము. రాజకీయ నాయకులకు నూతన పదవులు వచ్చినను సంతోషమును పొందలేరు. ఈ రాశి స్త్రీలకు భారీ పెట్టుబడులు పెట్టుటచే లాభాలు చేకూరుతాయి. ఉత్సాహముతో కాలాన్ని గడుపుతారు.

## నక్షత్ర ఫలితాలు

**మూల 1,2,3,4-** ధైర్య సాహసాలతో తలచిన కార్యాలన్నీ దిగ్వి జయమవు తాయి. దూర ప్రాంతంనుండి వచ్చే వ్యక్తులవల్ల లాభాలుంటాయి. ఆర్థిక సమస్యలకు పరిష్కారం లభిస్తుంది. ఆందోళన కలిగించే వార్తలు వింటారు. అనుకూల స్థానచలన యోగముంటుంది మంచిది.

**పూర్వాషాఢ 1,2,3,4-** సకాలంలో ఆశించిన ఫలితాలు లభిస్తాయి. వాయిదా పనుల్లో కొన్ని నెరవేర్చుకుంటారు. ఇబ్బందులు ఆలస్యంగా తొలగిపోతాయి. శుభకార్య ప్రయత్నాల్లో పురోగతి లభిస్తుంది. ప్రయాణాలెక్కువ చేస్తారు. ఆర్థిక పరిస్థితి మెరుగవుతుంది. నూతన వస్తుఆభరణాలు కొనుగోలుచేస్తారు. శుభవార్తలు వింటారు.

**ఉత్తరాషాఢ 1-** మానసికాందోళనవల్ల చిరాకు,కోపం కలిగివుంటారు. వీలైనంత వరకు సహనంతో గడపడం మంచిది. కొన్ని కార్యాలు ఆకారణంగా వాయిదా పడతాయి. పేరుప్రతిష్టలకు మాత్రం లోటుండదు. క్రీడా కారులకు,రాజకీయ రంగాల్లోని వారికి మార్పులు.

## నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**మూల 1**-రవి,శుక్ర,**మూల 2**-రాహు,గురు,**మూల 3**-శని,కుజ,**మూల 4**-బుధ, రవి,**పూ॥షాఢ 1**-చంద్ర,కుజ,**పూ॥షాఢ 2**-శని,బుధ, **పూ॥షాఢ 3**-రవి,శక్ర, **పూ॥షాఢ4**-చంద్ర,గురు,**ఉ॥షాఢ1**-శని,కేతు, గ్రహములకు **జపము,దానము చేయవలెను.**

## ధనుస్సు రాశి వారి స్వభావము

సామాన్య పొడవుగా నుందురు. సామాన్య దృష్టి ఉండును. తండ్రి ఆస్థిని వృద్ధి చేయుదురు. భోగ భాగ్యములను అనుభవిస్తారు. సినీ రంగము నందు రాణిస్తారు. వెనుక నుండి పనులను సాధిస్తారు. ఉన్నది ఉన్నట్టు మాట్లాడతారు. వీర్కి లక్ష్యసిద్ధి అధికము. ఇతరులకు సహాయ పడుటలో సందే హిస్తారు. ఉన్నత మైన వారిగా ఉంటారు. గతములో సహాయము పొందిన వారు శతృవులుగా మారుతారు జాగ్రత్త. శాస్త్ర ప్రావీణ్యమును పొందుదురు. నిత్యమూ దేవతా రాధనను చేయు చుందు రు. కొద్ది పాటి గర్వముండును. ఎన్ని కష్టములున్ననూ ధైర్యముగా నుందురు. పుత్ర సంతానము అధికము. నీతి నియమములను పాటిస్తారు. కోపం తగ్గించుకుంటే విజయము మీదేనని గుర్తించండి.

## మాసవారి ఫలితములు

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు దశమస్థానమున సంచారము చేఉద్యోగములందుమార్పులుఅవసరం తదుపరి లాభస్థాన సంచారముచే అధికధనలాభముండును.

ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు జన్మస్థానమున సంచారముచే పాదములకువ్యాధులువచ్చును తదుపరి అక్టోబరు 26 వరకు వ్యయస్థాన సంచారముచే అనుకున్నపనులుపూర్తి. తదుపరి జన్మస్థానమున సంచారముచే వ్యాపారములందు అనుకూలము ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు నవమస్థాన సంచారముచే బంధుపీడకలుగును తదుపరి అష్టమస్థాన సంచారముచే ఆరోగ్యమునందుజాగ్రత్తఅవసరం

ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు తృతీయస్థాన సంచారముచే అస్థిరముగానుండును తదుపరి ద్వితీయస్థాన సంచారముచే లాభములకునెలవు

**ఏప్రిల్ :** అపకీర్తిఏర్పడే సూచనలున్నవి.అకాల భోజనముచే శారీరకమార్పులు సంభవిస్తాయి. క్రిమికీటకాలకు దూరంగా ఉండుటమంచిది. దేవతానుగ్రహ ప్రాప్తి.కళత్రబాధలు అధికమవు తాయి.సమయం ప్రకారం పనులనుచేయుటకు ప్రాధాన్యమిస్తారు. వాక్చాపల్యంవల్ల కొన్ని ఇబ్బం దులెదురవుతాయి. **పరిహారాలు : శ్రీశైలం దర్శనానికి మీతో బాటు ఒకరిని తీసుకెళ్లండి**

**మే :**అకస్మికధనలాభంతో ఆనందంగా ఉంటారు. ప్రయత్న కార్యాలన్నింటిలో విజయవంతంగా సఫలీకృతులవుతారు. కీర్తిప్రతిష్టలు అధికమవుతాయి. శుభవార్తలువింటారు.వివాహాదిశుభకార్య ప్రయత్నాలు నెరవేరతాయి. అద్భుతమైన అవకాశాలనుపొందుతారు.ముఖ్యమైన వ్యక్తులద్వారా శుభవార్తలు వింటారు.నూతన వస్తు,ఆభరణాలు సేకరిస్తారు. **పరిహారాలు : బెల్లంముక్కను దేవునికి నివేదన చేసి ఆరగించండి**

**జూన్ :** పేరు ప్రఖ్యాతలులభిస్తాయి.ఆస్తి కలసివచ్చుటద్వారా ధనలాభముంటుంది. ధర్మకార్యా లయందు ఆసక్తి పెరుగుతుంది. కుటుంబంలో మార్పులు జరిగేఅవకాశాలున్నాయి.తలచిన కార్యాలు ఆలస్యంగా అమలుపరుస్తారు.పరస్త్రీలతో జాగ్రత్తగా నుండుటమంచిది. ప్రయణాల్లో వస్తువులుమారిపోయే అవకాశమున్నది. **పరిహారాలు : గోధుమలు దానం చేయండి**

**జులై :**తరచుగా ప్రయాణాలు చేయాల్సిరావచ్చు.అకాల భోజనాలవల్ల ఆరోగ్యం మందగి స్తుంది.వృత్తిరీత్యా జాగ్రత్త వహించుటమేలు.పై అధికారుల వలన వేధింపులువస్తాయి. ప్రయ త్నాలకు ఆటంకాలుంటాయి.గతంలో నిలచిన ట్రాన్స్‌ఫర్లు అవుతాయి.భాగస్వామితో విరోధమేర్పడే అవకాశా లుంటాయి. సాహసకార్యాలు తలపెట్టకపోవడం మంచిది. **పరిహారాలు : మీ జన్మనక్షత్ర జపంచేయించి, వస్త్రదానం చేయండి**

**ఆగస్ట్ :** నూతన అవకాశాలు లభిస్తాయి.విదేశీయాన ప్రయత్నం సులభమవుతుంది. వృత్తి, ఉద్యోగ రంగాలలో మార్పులు జరిగి అభివృద్ధిని సాధిస్తారు.గృహమున శుభకార్య సూచనలు న్నాయి. ప్రయత్నకార్యములు సఫలమవుతాయి.ఆకస్మిక లాభం కలుగుతుంది.గృహావసర వస్తు వులను సేకరిస్తారు. క్రొత్తవారితో నూతన కార్యాలకు రూపకల్పన చేస్తారు. **పరిహారాలు : పేదవారికి ఇంట్లో పెళ్లికి సహకరించండి**

**సెప్టెంబర్ :**శుభకార్యాలను సులువుగానెరవేర్చుతారు.ముఖ్యమైన శుభవార్త వలన ఉత్సాహంతో ఉరకలు వేస్తారు. విందు, వినోదాలలో పాల్గొని సంతోషంతో ధనమును ఖర్చు చేస్తారు. పనులలో ప్రోత్సాహం కలుగుతుంది.కార్యాలను సంపూర్ణంగా ఆచరిస్తారు.సంఘమున గౌరవమర్యాదలు పెరుగుతాయి. దైవ కార్యములందు పాల్గొంటారు. **పరిహారాలు : మంత్రాలయ దర్శనం చేయండి, 121 రూ. సమర్పించండి**

**అక్టోబర్ :** స్థిరాస్తుల విషయంలో సోదర వర్గమువారితో విభేదాలు ఏర్పడుటకు అవకాశం కలదు. ప్రయాణాలవల్ల లాభంచేకూరుతుంది. వ్యాపారంలో విశేషలాభం ఉంటుంది.ఇతరుల నుండి సహాయసహకారాలు అందుతాయి.నూతన వస్తుఆభరణాలు కొనుగోలు చేస్తారు.

**నవంబర్ :** విదేశీయాన ప్రయత్నాలు ముమ్మరంగా ప్రయత్నించాలి. కుటుంబంలో క్రొత్త వ్యక్తులు కలుస్తారు.ఆరోగ్యం మందగించుటకు అవకాశం ఉంటుంది.వాహన ప్రమాదములు జరుగుటకు అవకాశము కలదు. వ్యసనములకు దూరముగా ఉండుట మంచిది. క్షణికావేశాలకు లోనుకాకుండుట మంచిది.ఋణ ప్రయత్నం ఫలిస్తుంది. **పరిహారాలు : నమకము పారాయణ చేయించండి**

**డిసెంబర్ :** గృహమున పితృకార్యములు చేయవలసివచ్చును. బంధుమిత్రులతో జాగ్రత్తగా ఉండాలి. దూరప్రాంత ప్రయాణాలుకలసివచ్చును.అప్పులతో కాలంగడుపవలసి వస్తుంది.అనవసర వ్యయ ప్రయాసలుంటాయి.కళత్రముతో వైరమేర్పడే అవకాశాలుంటాయి.గౌరవం లోపించకుండా జాగ్రత్త వహించుటమేలు. **పరిహారాలు : రోజూ ఆవుకు 4 అరటిపండ్లు తినిపించండి**

**జనవరి :** ఆర్థిక ఇబ్బందులతో సతమతమవుతారు.ఇతరుల సహాయ సహకారాలకై సమయం వెచ్చించాల్సి వస్తుంది.అన్ని కార్యములందు విజయాన్నిసాధిస్తారు.అంతటా సౌఖ్యాన్ని పొందు తారు.అద్భుత శక్తి సామర్థ్యాలనుపొందుతారు. శుభవర్తమానాలు వింటారు.

**ఫిబ్రవరి :** ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో గుర్తింపు పొందుతారు.కుటుంబ కలహాలకు దూరంగా ఉండుట మేలు.సహనంతో వ్యవహరించుట అన్ని విధాలా మంచిది.నూతన వస్తు,వస్త్ర ఆభరణాలు కొనుగోలు చేస్తారు.ధనలాభమేర్పడుతుంది.ప్రతిభకు తగిన గుర్తింపు లభిస్తుంది.చర్చలు, సద స్సులలో పాల్గొంటారు. **పరిహారాలు : బియ్యందానం చేయండి**

**మార్చి :**మనోధైర్యాన్ని కలిగిఉంటారు.శుభవార్తలు వినుటద్వారా ఉత్సాహంతోఉంటారు. అప్రయత్నకార్యాలకు శ్రీకారంచుడతారు. ప్రజాసంబంధ కార్యాలలో పాల్గొంటారు. ప్రయాణాలలో జాగ్రత్త వహించుటమంచిది.ఆరోగ్య విషయాల పట్ల శ్రద్ధ అవసరం. శారీరక శ్రమ తప్పకపోవచ్చు. **పరిహారాలు : శనగలు దానం చేయండి**



# మకరరాశి ఫలితములు

ఉత్తరాషాఢ 2,3,4, పాదములు

శ్రవణం 1,2,3,4 పాదములు, ధనిష్ఠ 1,2, పాదములు

ఆదాయం - 14 వ్యయం - 14 రాజపూజ్యం - 3 అవమానం - 1

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు రాజయోగప్రదముగా నున్నది. గతంలో నిలచిన పనులన్నియు ఈసంవత్సరమున నెరవేరును. ఉన్నతమైన ఆలోచనలతో పలువురిని ఆకర్షిస్తారు.కుటుంబ, కోర్టు,విదేశీవ్యవహారాములు పరిష్కారమవు తాయి. ధన,కుటుంబసమస్యలు పరిష్కారమై లాభాన్ని చేకూరిస్తాయి. బంధు,సోదరవర్గమునుండి సహకారము అందదు. గృహమార్పులు, నూతన గృహనిర్మాణము చేపట్టుతారు. పుత్రసంతానము లేనివార్కి ఈ సంవత్సరము కలుగును. భాగస్వామ్యవ్యవహారాలు లాభసాటిగా ముందుకువెళ్తాయి. దూర ప్రాంతపుణ్యక్షేత్రాలు,విహారస్థలాలు సందర్శిస్తారు. చేయువృత్తియందు సామాన్య ప్రోత్సాహముంటుంది. శారీరక సుఖాన్ని, మానసికానందాన్ని పొందుతారు.

వ్యవసాయదారులకు అన్నిపంటలు కలసివచ్చును. విద్యార్థులకు ఉన్నతవిద్యను అభ్యసించుట ద్వారా గౌరవాన్ని పొందుతారు. కాంట్రాక్టర్లు,బ్రోకర్లు, ఫైనాన్స్‌వారికి విపరీత ధనయోగము కలదు. కంప్యూటరు వారికి,ఫ్యాన్సీ,కిరాణా, వస్త్ర వ్యాపారులకు ధనాదాయము మెండుగా ఉన్నది.మద్యం విక్రేతలకు, ప్రత్తి, జ్యోళ్ళు వ్యాపారులకు ప్రజలనుండి ప్రోత్సాహము సినీరంగమునందు వారికి, కళాకారులకు ప్రోత్సాహముండుటచే ఆదాయము లభించును. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితులకు విశేష గౌరవ పురస్కారములు లభించును.డాక్టర్లు,ఇంజనీర్లు, లాయర్లకు ధనమేపరమావధిగా జీవనముసాగిస్తారు. రాజకీయ నాయకులకు నీచమార్గముద్వారా పదవులను పొందుతారు. ఈరాశిస్త్రీలకు కుటుంబమున గౌరవ మర్యాదలు తగ్గుతాయి. ఆరోగ్యవిషయములయందు బాగుగాఉండును.

### నక్షత్ర ఫలితాలు

**ఉత్తరాషాఢ 2,3,4-** బంధు, మిత్రులతో కలుస్తారు.నూతన గృహనిర్మాణ ప్రయత్నం చేస్తారు. ఆకస్మిక ధనలాభంతోఅప్పులు తొలగిపోతాయి. కుటుంబ సౌఖ్యముంటుంది.దీర్ఘకాలిక సమస్యలుతొలగిపోతాయి.ఆరోగ్యం బాగుంటుంది. అనారోగ్య బాధలు అధికమవుతాయి. కోరుకునేదీ,జరిగేది ఒకటవుతుంది.

**శ్రవణం 1,2,3,4-**ప్రయత్నకారాలు సంపూర్ణంగా ఫలిస్తాయి. ధనలాభమేర్పడుతుంది. కళాత్మక వస్తువులను సేకరిస్తారు. కొత్త కార్యాలకు చక్కని రూపకల్పన చేస్తారు.మానసిక చంచలంతో ఇబ్బంది పడతారు. ముఖ్యమైన పనులు వాయిదా వేసుకుంటారు. పిల్లలపట్లమిక్కిలి జాగ్రత్త వహిస్తారు.

**ధనిష్ఠ 1,2 -**అనారోగ్య బాధలు అధికమవుతాయి. విద్యార్థులకు మంచి అవకాశాలుంటాయి. స్త్రీలు,పిల్లలపట్ల మిక్కిలి శ్రద్ధ వహిస్తారు. కుటుంబలో పరిస్థితులు సంతృప్తికరంగా నుండుటే మానసికానందాన్ని పొందుతారు. వాయిదా వేసుకొన్న పనులు పూర్తిచేస్తారు.

## నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**ఉ॥షాఢ2-**గురు,కేతు,**ఉ॥షాఢ3-**చంద్ర,శని,**ఉ॥షాఢ 4-**కుజ,కేతు, **శ్రవణం1-**గురు,శని,**శ్రవణం 2-**రాహు,కేతు,**శ్రవణం3-**శుక్ర,బుధ, **శ్రవణం4-**శని,శుక్ర,**ధనిష్ఠ 1-**చంద్ర,బుధ,**ధనిష్ఠ2-**కేతు,కుజ **గ్రహములకు జపము,దానము చేయవలెను.**

## మకర రాశి వారి స్వభావము

సామాన్య లావు,పొడవుగా నుందురు.క్రింది దృష్టి ఉండును.అత్యాస ఎక్కువ,చర్మ వ్యాధులు కలిగి ఉందురు,తన కార్యములను తాను చేసుకున్ననూ లాభమును ఆశింతురు.బద్ధకము ఎక్కువ. పిసినారి తనము ఎక్కువ,వీరి శరీరము నందు మార్పులు కనిపించును.పట్టుదల ఉండును.కార్యమును సాధించుటకు శ్రమ పడతారు.ఎదిరింపు తనము ఎక్కువ.వ్యాపార కార్యములను చేయుదురు.తనకు కావలిసిన విషయములను గ్రహింతురు.విద్య యందు అభిలాష,జ్ఞాపక శక్తి ఎక్కువ.గణిత సాధన ఉండును.పెద్ద వారిని పూజింతురు.ఆచార వ్యమహారాలు పాటింతురు.అనుమానము ఎక్కువ,బాకీలు తీర్చుటలో జాప్యముండును.అత్యాస తగ్గించుకొన్నచో విజయము మీదేనని గుర్తించండి.

## మాసవారి ఫలితములు

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు భాగ్యస్థానమున సంచారము చేవ్యవహారము లందుజయము తదుపరి దశమస్థాన సంచారముచే అవార్డులు లభించును

ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు వ్యయస్థానమున సంచారముచే వింతవింతకోరికలుకలుగును తదుపరి అక్టోబరు 26 వరకు లాభస్థాన సంచారముచే కార్యసాఫల్యతేర్పడును. తదుపరి వ్యయస్థానమున సంచారముచే ఖర్చులుఅధికము ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు అష్టమస్థాన సంచారముచే అనుకోనిఆటంకములుకలుగును తదుపరి సప్తమస్థాన సంచారముచే వ్యవహారములందుజయము

ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు ద్వితీయస్థాన సంచారముచే వ్యక్తులతోమంచి స్నేహము తదుపరి జన్మస్థాన సంచారముచే ఐద్ధకము పెరుగును

**ఏప్రిల్ :**పుణ్యకార్యాలతో ఆనందోత్సాహాలు లభిస్తాయి. బంధు,మిత్రులతో విహారాలు చేస్తారు. సమాజంలో గౌరవం లభిస్తుంది.సంపూర్ణ ఆరోగ్యవంతులు గానుంటారు.విదేశీయాన ప్రయత్నాలు ముమ్మరంగా సాగించాల్సి వస్తుంది.కుటుంబంలో అనుకోకుండా శుభకార్యాలు చేసే అవకాశము ఉంటుంది.

**పరిహారాలు : రామరక్షాస్తోత్రము రోజుకు 3 సార్లు చదవండి**

**మే :**అప్రయత్న కార్యాలు సఫలమవుతాయి.చెడుపనులకు దూరంగానుండుట మంచిది. వృత్తి,ఉద్యోగరంగాల్లో ఆటంకాలున్ననూ పరిష్కరించుకుంటారు.కోర్టులావాదేవీలు అధికమవు తాయి. స్థిరమైన ఆలోచనలు చేయుట కష్టముగా ఉన్నది.పిల్లలపట్ల శ్రద్ధవహించుట మేలు. మనోనిగ్రహానికి ప్రయత్నించాలి.

**పరిహారాలు : గణపతి హోమం చేయించండి**

**జూన్ :** విరివిగా ప్రయాణాలు చేయాల్సివస్తుంది. సున్నితమైన విషయాల్లో మానసికాందోళన చెందుతారు. వృత్తిరీత్యా జాగ్రత్తగా నుండుట మంచిది.గొప్ప వ్యక్తుల ద్వారా కృషి సల్పుతారు. గతంలో వెన్నంటిన కష్టాలు తొలగిపోతాయి.నూతన కార్యాలకు శ్రీకారం చుడతారు. నూతనంగా జీవనం సాగిస్తారు.

**పరిహారాలు : ప్రతీరోజూ ఏలక్కాయను నీటిలో వేయండి**

**జులై :**శుభకార్యాల మూలంగా ధనవ్యయం అధికమవుతుంది. ఆకస్మిక ధననష్టం కలుగకుండా జాగ్రత్త పడుటమంచిది. స్థానచలన సూచనలుంటాయి. అనారోగ్యబాధలుంటాయి. కుటుంబ పరి స్థితులు సంతృప్తికరంగా ఉంటాయి. ధనలాభంతో ఋణబాధలు తొలగిపోతాయి.మంచి పేరు, ప్రఖ్యాతలు సంపాదిస్తారు. **పరిహారాలు : గోధుమలు దానం చేయండి**

**ఆగస్ట్ :**పట్టుదలతో పరిష్కార సాఫల్యత ఏర్పడుతుంది.గృహమున శుభకార్యములు జరుగును. పితృవర్గమువారితో విభేదాలు ఏర్పడతాయి.పుణ్యక్షేత్ర సందర్శన ద్వారా మానసిక ఆనందము. పనులలో విజయాన్ని సాధిస్తారు.ఇతరుల సమస్యలను గుర్తించి పరిష్కారాన్ని సూచిస్తారు.శుభ కార్య ప్రయత్నాలు నెరవేరుతాయి.ఆకస్మిక ప్రయాణ లాభాలుంటాయి. **పరిహారాలు : మినుములు దానం చేయండి**

**సెప్టెంబర్ :** ఆర్థిక ఇబ్బందులు ఉన్ననూ సమయానికి ధనము చేతికందును.దూరప్రాంత ప్రయాణాలు చేయుటమంచిది. మనోవికాసాన్ని కలిగి ఉంటారు.ఆత్మీయుల సహకారం లభిస్తుంది. బంధు,మిత్ర విరోధమేర్పడుతుంది. మానసిక ఆందోళనకు గురికావలసివచ్చును.ఉదర సంబంధ బాధలను అనుభవిస్తారు.

**పరిహారాలు : హనుమాన్ చాలీసా రోజుకు 3 సార్లు చదవండి**

**అక్టోబర్ :** కుటుంబసౌఖ్యంతో ఆనందంలభిస్తుంది.విదేశీ ప్రయాణాలతోఆనందాన్ని పొందు తారు.స్త్రీల మూలంగా లాభంఉంటుంది.పేరు ప్రతిష్టలు లభిస్తాయి.దానములు చేయుటయందు ఆసక్తి కలిగుంటారు. అపూర్వపుణ్యక్షేత్ర దర్శనం చేస్తారు.నూతన వాహనాలు కొనుగోలు చేస్తారు.శుభవార్తలు వింటారు.

**పరిహారాలు : సుబ్రహ్మణ్యపూజ చేసి, పాలు నివేదన చేయాలి**

**నవంబర్ :** ఆర్థిక పరిస్థితులు సంతృప్తికరంగా ఉంటాయి. మానసి కాందోళన చెందరు.స్త్రీలకు అనారోగ్య ఉండవు.బంధుమిత్రులతో జాగ్రతగా వ్యవహరించుటమేలు. వివాహాది ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి.కోర్టు లావాదేవీలు పరిష్కారమవుతాయి.వృత్తి ధర్మాలను వివేకంతో ఆచరిస్తారు.దైవ కార్యములయందు ఆసక్తి కలిగి ఉంటారు. **పరిహారాలు : దుర్గాసూక్తము చదవండి**

**డిసెంబర్ :**నూతన వ్యాపారకార్యాలు పూర్తిచేసుకోగలుగుతారు.సంతాన విషయమున జాగ్ర త్తగా నుండుటమంచిది.దాంపత్య సుఖమును పొందుతారు.గతంలోనిలచిన గృహనిర్మాణం చేపడ తారు.సంతృప్తికరంగా జీవనాన్నిసాగిస్తారు.సాధుసజ్జనులతో సాంగత్యముఏర్పడుతుంది. సకాలం లో చేయవలసిన పనులను పూర్తిచేస్తారు.దూరప్రాంత ప్రయాణాల వలన ధనలాభము ఏర్పడు తుంది.

**పరిహారాలు : పేదలకు వస్త్రదానము చేయాలి**

**జనవరి :** నూతన గృహ నిర్మాణ ప్రయత్నం చేస్తారు.ఆకస్మిక ధనలాభంతో,ఋణబాధలు తొలగి మానసిక ఆనందాన్ని పొందుతారు. గత సమస్యలు తొలగిపోతాయి.ఆరోగ్యం బాగుంటుంది.వ్యాపార లావాదేవీలలో విజయాన్ని పొందుతారు.జప హోమాలను నిర్వహించి మంచిఫలితాన్ని పొందుతారు.రాజకీయ లబ్ధి పొందుతారు. **పరిహారాలు : లవంగాన్ని నాలుక క్రిందిభాగమున పెట్టుకోండి**

**ఫిబ్రవరి :** ప్రయత్నంతో ధనలాభమేర్పడుతుంది.విందులు,వినోదాల్లో పాల్గొంటారు.పిల్లలకు సంతోషాన్ని కలగజేస్తారు.గృహవస్తువులను సేకరిస్తారు. కొత్త కార్యాలకు రూపకల్పన చేస్తారు.వృత్తి,ఉద్యోగ రంగాల్లో అభివృద్ధి సాధించే అవకాశ ముంటుంది. జీవితంలో మార్పులు కోరుకుంటారు.మంచి అవకాశాలు లభిస్తాయి.

**పరిహారాలు : శ్రీశైలం దర్శనానికి మీతో బాటు ఒకరిని తీసుకెళ్ళండి**

**మార్చి :** లాటరీలు తగలడం వలన మనస్సు ఆనందంగా ఉంటుంది. అకాల భోజనంవల్ల శారీరక బాధలనుభవిస్తారు.అనుకోని కలహాలకు అవకాశముంటుంది. పరిస్థితులు సంతృప్తికరంగా నుండుటచే మానసిక ఆనందాన్ని పొందుతారు.సమాజంలో మంచి గుర్తింపు లభిస్తుంది. ముఖ్యమైన వ్యక్తుల ద్వారా వ్యాపార లావాదేవీలు కలసివస్తాయి. **పరిహారాలు : నమకము పారాయణ చేయించండి**



# కుంభరాశి ఫలితములు

ధనిష్ఠ 3,4 పాదములు; శతభిషం 1,2,3,4 పాదములు
పూర్వాభాద్ర 1,2,3, పాదములు;

**ఆదాయం - 14 వ్యయం - 14 రాజపూజ్యం - 6 అవమానం - 1**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు అనుకూలయోగ ప్రదముగా ఉన్నది. ఆరోగ్యమునందు మాత్రము జాగ్రత్త వహించుట మేలుగా ఉన్నది. కార్యములయందు విజయాన్ని సాధిస్తూ ముందుకు సాగుతారు. అతినిద్ర వలన కొంత ఆరోగ్యము మందగించును. ఆకస్మిక ప్రయాణాలు, ధనలాభము ఎక్కువగా ఉన్నది. విదేశీ,కోర్టువ్యవహారాలు సానుకూలముగా ఇతరుల సహకార ముతో పూర్తిఅగును. గృహమున శుభకార్యములు జరుగును. పుత్రసంతానము ద్వారా సంఘమున గుర్తింపు పొందెదరు. సోదర,బంధువర్గమునుండి కొంత నిర్లిప్తత ఏర్పడును. చేయుఉద్యోగమునందు అధికారముల మన్నన లేకున్నను తోటిఉద్యోగుల సహాయాన్ని పొందుతారు. లాభసాటి వ్యాపారాలు ప్రారంభము చేయుటకు మంచి సమయము.

వ్యవసాయదారులకు మొదటి పంట మేలుగాఉన్నది. విద్యార్థులకు ప్రోత్సాహక బహుమతులు అందును. కాంట్రాక్టర్లు, బ్రోకర్లు, ఫైనాన్స్‌వారికి నూతన పెట్టుబడులు కలసివచ్చినను ఋణము ఎక్కువగా ఉండును. ఫ్యాన్సీ,కిరాణా,వస్త్ర వ్యాపారులకుపెట్టుబడికి మించి ఆదాయము లభించును. మద్యంవిక్రేతలకు, ప్రత్తి, జ్యోళ్ళు వ్యాపారులకు అధికారుల వేధింపులవలన మానసికరుగ్మతతను పొందు తారు. సినీరంగమునందు వారికి, కళాకారులకు ప్రజల నుండి మంచి గుర్తింపు ఏర్పడును. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితులకు నూతన కార్యక్రమములు ద్వారా సంఘమున గౌరవాన్ని పొందుతారు. డాక్టర్లు, ఇంజనీర్లు,లాయర్లకు ధనాదాయంతో పాటు పురస్కారములు అందును. రాజకీయనాయకులకు ఉన్నపదవులు ఊడి పోవుట ద్వారా ఆశాంతికిగురిఅగుదురు. ఈరాశి స్త్రీలకు ఉన్నత పధవులు లభించి ఆనందాన్ని పొందుతారు. రాజకీయ రంగప్రవేశము కలదు.

### నక్షత్ర ఫలితాలు

**ధనిష్ఠ 3,4**-మానసికాందోళనతో కాలంగడుస్తుంది. స్థిరమైన నిర్ణయాలు తీసుకోలేకపోతారు. అధికారులతో జాగ్రత్తగా మెలగుట మంచిది. పేరు,ప్రతిష్ఠలు లభిస్తాయి. సంఘంలో గౌరవమర్యాదలుంటాయి. అనుకూలవాతావరణ ఉంటుంది.

**శతభిషం 1,2,3,4**-అనుకోకుండా కుటుంబంలో అశుభవార్తలు వినాల్సి వస్తుంది. ఆకస్మిక ధననష్టం లేకుండా జాగ్రత్త పడుట మంచిది. స్థిరాస్తులకు సంబంధించిన విషయాల్లో జాగ్రత్త అవసరం. మానసికాందోళనతో కాలం గడుస్తుంది. ఆరోగ్యం విషయంలో శ్రద్ధ వహించక తప్పదు.

**పూర్వాభాద్ర 1,2,3**-జాగ్రత్త అవసరం. అజీర్ణబాధలు అధికమవుతాయి. మనోవిచారాన్ని కలిగిఉ ంటారు. ఆత్మీయుల సహకారం ఆలస్యంగా లభిస్తుంది. కుటుంబ సౌఖ్యం సంపూర్ణంగా ఉంటుంది. బంధు, మిత్రులతో కలిసి సరదాగా కాలక్షేపం చేస్తారు. ఆకస్మిక ధనలాభ ముంటుంది. గొప్ప వ్యక్తిని కలుస్తారు. నూతన కార్యాలకు శ్రీకారం చుడతారు.

### నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**ధనిష్ఠ 3**-శని,బుధ,**ధనిష్ఠ 4**-రాహు,శుక్ర,**శతభిషం1**-శని,కుజ, **శతభిషం2**- రవి,చంద్ర,**శతభిషం 3**-కుజ,రవి,**శతభిషం 4**-గురు,శుక్ర,**పూ॥భాద్ర1**-రవి, చంద్ర,**పూ॥భాద్ర 2** - రవి,కుజ,**పూ॥భాద్ర3**-రాహు,శని **గ్రహములకు జపము,దానము చేయవలెను.**

## కుంభ రాశి వారి స్వభావము

లావు, పొడవుగా నుందురు. క్రింది దృష్టి ఉండును. జ్ఞాపక శక్తి ఎక్కువ, కార్యములను సాధించుటలో నేర్పు ఉండును. ప్రతీ పనియందు విచారణ చేసి పనులను చేయుదురు. ఇతరుల యందు అనుమానము ఎక్కువ, సత్యమును పలుకును. వీరిలో మంచి తనము అధికముగా నుండును. బట్టతల ఉండును. సుందర వస్తువులను ఇష్టపడును. ఉన్నత ఉద్యోగములందు స్థిరపడును. స్నేహముచే బలము చేకూరును, ఆడ పిల్లలు ఎక్కువ, ఏకాంతముగా ఉండుటకు ఇష్టపడుదురు. వీరితోప్రయాణములందు కాలక్షేపముండును. ఒంటరితనము ఉండదు. చతురతతో మాట్లాడును.

## మాసవారి ఫలితములు

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు అష్టమస్థానమున సంచారము చేధనవ్యయముఎక్కువ తదుపరి భాగ్యస్థాన సంచారముచే గతంలోకోర్టుకేసులు సుఖాంతమవును

ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు లాభస్థానమున సంచారముచే అధికారముగాఉండుదురు తదుపరి అక్టోబరు 26 వరకు దశమస్థాన సంచారముచే వేరేప్రాంతములకుబదిలీలు తదుపరి లాభస్థానమున సంచారముచే సమన్వయముతోపనిచేయుదురు. ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు సప్తమస్థాన సంచారముచే ఆరోగ్యమునందుజాగ్రత్త తదుపరి షష్టస్థాన సంచారముచే శత్రువులుఅనుకూలముగా మారుదురు

ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు జన్మస్థాన సంచారముచే స్థానచలనము లు తదుపరి వ్యయస్థాన సంచారముచే పుణ్యక్షేత్రదర్శనముఅధికము

**ఏప్రిల్ :** వృత్తి ఉద్యోగాల్లో అప్రయత్నంగా అన్ని అవకాశాలు కలిసి వస్తాయి.నూతన వస్తువాహనాలు కొనుగోలుచేసే సూచనలున్నాయి. కుటుంబసౌఖ్యం మానసిక ప్రశాంతత లభిస్తాయి. ఇతరుల విషయంలో జోక్యం చేసుకోకపోవడం మంచిది. వ్యాపారస్తులకు లాభాలు చేకూరుతాయి.సొంత విషయాల్లో ఇతరుల సలహాలు తీసుకొనుట మంచిది. **పరిహారాలు : శివ సహస్రం పారాయణ చేయండి**

**మే :** గృహనిర్మాణాలు,మార్పిడులు అనుకూలిస్తాయి.కొన్నివిషయాలలో ఇబ్బందికర వాతా వరణం ఏర్పడుతుంది.కుటుంబ వ్యక్తులతోకలిసి శుభకార్యాల్లో పాల్గొంటారు.వ్యవహార అనాకూలత ఏర్పడుతుంది.వివిధరంగాల్లో లక్ష్యాలను సాధించి తృప్తిపొందుతారు.ఇంటికి సంబంధించిన విషయాల్లో మెలకువ చూపాల్సి వస్తుంది. **పరిహారాలు : సుందరకాండ పారాయణ మేలు కలిగించును**

**జూన్ :** గతంలో క్షీణించిన ఆరోగ్యం మెరుగవుతుంది.సామర్ధ్యం అంకితభావం ప్రదర్శించి అన్నివర్గాల వారిని అకట్టుకుంటారు.ఆధ్యాత్మిక చింతనద్వారా మానసికప్రశాంతత సాధిస్తారు. పనులకు ప్రాధాన్యతనిచ్చి పూర్తిచేస్తారు.అకాల భోజనం,అల్ప నిద్రవల్ల అలసట కలుగుతుంది. ఖర్చులు పెరిగినా ఆర్ధికపరంగా మెరుగైన స్థితిలోనే ఉంటారు. **పరిహారాలు : దాసించెక్కను పాలతో అరగదీసి తిలకంగా పెట్టుకోండి**

**జులై :** అధికారులతో వివాదాలు ఏర్పడతాయి.పనులలోవిజయం పొందుతారు.ఆదాయం బాగుగా ఉండి ఖర్చులు అధికమవుతాయి. నూతన వస్తువులు,ఆభరణాలు కొనుగోలు చేస్తారు. ఆర్ధిక,రాజకీయ రంగాల్లో కృషికి తగిన గుర్తింపు ఉంటుంది.ఉద్యోగ అవకాశాలు అధికంగా ఉండి స్థిరపడుటకు అవకాశము ఉండును.వివాహాది శుభకార్యములను జయప్రదంగా నిర్వహిస్తారు. **పరిహారాలు : పెసలు దానం చేయండి**

**ఆగస్ట్ :**ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు.ఆదాయం పెరిగి తగినవసతులు సమకూర్చు కుంటారు.కుటుంబ వ్యక్తులపట్ల బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించి ఆనందంతోఉంటారు.శుభకార్యాలకు ధనము ఖర్చుచేస్తారు.ముఖ్యమైన కార్యక్రమాలు సులువుగా చేస్తారు.పుత్ర,పౌత్రా భివృద్ధికి సూచనలున్నాయి. నూతనవ్యవహారాలను సాధించుటకు పథకాలు వేస్తారు. **పరిహారాలు : నువ్వులు దానం చేయండి**

**సెప్టెంబర్ :** ఆలోచనలను అమలుపరచడానికి తగిన వాతావరణ ఏర్పడుట కష్టము. రహస్య సమాచారాలు అందుతాయి.మంచి అవకాశాలు లభించడంతో కార్యక్రమాలలో మార్పుచేసు కుంటారు. ఇతరుల అభిప్రాయాలను,ఆలోచనలను స్వీకరిస్తారు. అధికారుల ఆదరాభిమానాలను సంపాదిస్తారు.పుణ్యకార్యాలు పట్టుదలతో సాధిస్తారు.పనుల భారాన్ని తగ్గించుకుంటారు. **పరిహారాలు : పెరుగు అన్నం పేదలకు పంచండి**

**అక్టోబర్ :**ఉన్నతవర్గాల వారితో పరిచయంఏర్పడడం వలన వ్యాపారాభివృద్ధి సాగుతుంది. పనులు సకాలంలో నిర్వహించి ఇతరుల మన్ననలు పొందుతారు.సామాజిక కార్యక్రమాలలో ఆసక్తి. ఇతరుల మనస్సు రంజింపచేస్తారు.ప్రత్యర్ధులను కూడా వ్యవహార శైలితో ఆకట్టుకుంటారు. సమాజంలో విలువ,ప్రాముఖ్యత పెరుగుతాయి.ఎక్కువ ఆదాయము ఉంటుంది.ప్రమోషన్లు అందుకునే అవకాశంఉంది.
**పరిహారాలు : పేదలకు వస్త్రదానము చేయాలి**

**నవంబర్ :** కుటుంబ విషయాల్లో సరైన నిర్ణయాలు తీసుకోవడం ఉత్తమం. ఆర్ధిక భూసంబంధ లావాదేవీలు సానుకూలంగా ఉంటాయి. చేయు కృషిలో ఉత్తమ ఫలితాలు అందుకునే అవకాశాలు మెండుగా ఉ ంటాయి. ఆశ్చర్యకరమైన విషయాలు తెలుస్తాయి.ప్రయత్నలోపం లేకుండా అన్ని విషయాలను తెలుసుకుని,వ్యవహారాలను కొనసాగిస్తారు.అనుకూల సమాచారం అందుకుంటారు. ప్రయాణాలు అధికం.
**పరిహారాలు : నవగ్రహాలకు పూజహోమం చేయించండి**

**డిసెంబర్ :** ముఖ్యమైన అవసరాలు నిర్దేశించుకుని ప్రారంభిస్తారు. ఆదాయం మెరుగ్గా ఉ ంటుంది.పెట్టుబడులు,విలువైన వస్తువులను సమకూర్చుకుంటారు.గృహమునే శుభకార్య సూచ నలు కలవు. అంతర్గత వ్యవహారాలు పూర్తిచేసి అందరినీ కలుపుకుపోతారు.పోటీతత్వం పెరిగి తీరిక లేకుండా గడపడం వలన ఆరోగ్యం మందగిస్తుంది. **పరిహారాలు : బియ్యందానం చేయండి**

**జనవరి :** కార్యారంభంలో అందరికన్నా ముందుండి ప్రత్యేకతను పొందుతారు.వాయిదా పడుతున్న పనులు పూర్తిఅవుతాయి.స్త్రీల వలన ధనప్రాప్తి,వస్త్ర లాభం ఉంటుంది.తలపెట్టిన పథకాలు పూర్తవుతాయి.శు భకార్యాలకు ఖర్చు ఎక్కువగా ఉంటుంది.విరామం లేకుండా వ్యవ హారాలు నిర్వహిస్తారు.క్రొత్త ఉత్సాహంతో పనులను సాధిస్తారు.భాగస్వాముల సలహాలను పాటించి లబ్ధిపొందుతారు.అభివృద్ధికి తగిన బాటలు వేసుకుంటారు. **పరిహారాలు : మీ జన్మనక్షత్ర జపంచేయించి, వస్త్రదానం చేయండి**

**ఫిబ్రవరి :** అవసరమైన ధనం చేతికందుతుంది.బంధుమిత్రుల కలయిక వల్లకొన్ని పనులు పూర్తవుతాయి.మధ్యవర్తిత్వంవల్ల కొన్ని ఇబ్బందులు ఎదుర్కోవలసి వచ్చును.క్రయవిక్రయాలలో లాభంగా ఉంటుంది. కొంత అనిశ్చితిగా ఉన్ననూ దైవప్రేరణచే తొలగిపోవును. దేవాలయాలు, పుణ్యస్థలాలను సందర్శిస్తారు. **పరిహారాలు : ఇంటి పురోహితునకు పాదపూజచేసి సత్కరించండి**

**మార్చి :**కొత్తవిషయాలు పట్ల ఆసక్తి పెరుగుతుంది.బంధువులతో సంబంధాలు మెరుగవు తాయి.అలంకారాలు,విలాసవస్తువులు కొనుగోలుచేస్తారు.ఆరోగ్యంపట్ల శ్రద్ధ అవసరం. విదేశాల్లోని వారిద్వారా అభివృద్ధికి తగిన ప్రోత్సాహము అందుతుంది.ఋణ విముక్తులుఅవుతారు. ఆదాయం, ఆస్థిలావాదేవీలు సంతోషాన్నిచ్చేవిగా ఉంటాయి. **పరిహారాలు : కందులు దానం చేయండి**



# మీనరాశి ఫలితములు

పూర్వాభాద్ర 4 పాదము, ఉత్తరభాద్ర 1,1:2,3పాదములు
రేవతి 1,2,3,4 పాదములు

**ఆదాయం - 11 వ్యయం - 5 రాజపూజ్యం - 2 అవమానం - 4**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు గడ్డుకాలుముగా ఉన్నది. ఏపని చేసినను కాలముకలసిరాక మానసిక వేధనతో ఉండుదురు. చేయువృత్తి ఉద్యోగములయందు కలసివచ్చుట కష్టముగా ఉన్నది. కోర్టు,విదేవీ వ్యవహారాలు కొంత నష్టముతో పూర్తిఅగును. నూతన పెట్టుబడులు ఫలించుట కష్టముగా ఉన్నందున ధనవిషయమునందు జాగ్రత్త వహించుట మేలు. కుటుంబంనందు వ్యక్తుల సహకారముఉ న్నందున సంతోషము వ్యక్తము చేయుదురు. గృహమున శుభకార్యములువాయిదావేయుటమేలు. జీవిత భాగస్వామివలన సహాయసహకార ములు అందును. సోదర,బంధువర్గము వారితో జాగ్రత్తగా ఉండవలెను. నిరంతరము దైవకార్యములయందు ఆశక్తి చూపించుట మేలుగా ఉన్నది.

వ్యవసాయదారులకు పంటలు కలసివచ్చుట కష్టముగా ఉన్నందున జాగ్రత్తగా ఉండవలెను. విద్యార్థులకు శారీరక శ్రమచేత విద్యను అభ్యసించవలెను. కాంట్రాక్టర్లు,బ్రోకర్లు, ఫైనాన్స్‌వారికి ప్రభుత్వము వారినుండి రావలసిన బకాయిలు ఆలస్యమగును. ఫ్యాన్సీ,కిరాణా,వస్త్ర వ్యాపారులకునూతన పెట్టుబ డులు పెట్టినను సామాన్యముగా ఉన్నది. మద్యంవిక్రేతలకు, ప్రత్తి, జ్యోళ్ళు వ్యాపారులకుఆదాయము ఎక్కువగా ఉ న్నది. సినీరంగమునందు వారికి, కళాకారులకు అంతంతమాత్రము ప్రోత్సాహము ఉండును. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితులకు సంఘమున గౌరవము తగ్గును. డాక్టర్లు,ఇంజనీర్లు,లాయర్లకు శ్రమచేతఫలితాలను పొందుతారు. రాజకీయ నాయకులకు పొందిన పదవుల నుండి తప్పుకుని ఇతరులకు అప్పగిస్తారు. ఈ రాశి స్త్రీలకు శరీరమునందు తెలియని అనారోగ్యముచే బాధపడతారు.

### నక్షత్ర ఫలితాలు

**పూర్వాభాద్ర 4-** ఆత్మీయుల సహాయసహకారాలకై సమయం వెచ్చించాల్సి వస్తుంది. కుటుంబ పరిస్థితులు సంతృప్తికరంగావుంటాయి. ఆకస్మిక ధననష్టం కలిగే అవకాశం ఉంటుంది. వృథా ప్రయాణాలెక్కువ చేస్తారు. వృత్తి,ఉ ద్యోగరంగాల్లో సహనం వహించక తప్పదు.

**ఉత్తరాభాద్ర1,2,3,4 -** అనారోగ్యం బాధలు అధికమవుతాయి. అకారణంగా కలహాలేర్పడే అవకాశాలుంటాయి. అనవసర భయానికి లోనవుతారు. విద్యార్థులు శ్రమచే ఫలితం సాధిస్తారు.

**రేవతి 1,2,3,4-** కుటుంబకలహాలు అధికమవుతాయి. ప్రయత్న కార్యాలకు ఆటంకాలెదురవుతాయి. వృథా ప్రయాణాలవల్ల అలసట చెందుతారు. చెడు పనులకు దూరంగా వుండుట మంచిది. అందరితో స్నేహంగా నుండుటకు ప్రయత్నించాలి. ఆర్థిక ఇబ్బందులెదురవుతాయి.

## నక్షత్ర పాదములవారు చేయవలసిన శాంతులు

**పూ॥భాద్ర4-**గురు,శని,**ఉ॥భాద్ర1-**బుధ,శుక్ర,**ఉ॥భాద్ర2-**శుక్ర,చంద్ర, **ఉ॥భాద్ర 3-** రవి, శుక్ర,**ఉ॥భాద్ర 4-**శని,బుధ,**రేవతి1-**రవి,శుక్ర, **రేవతి 2-**శని,కుజ,**రేవతి 3-**రాహు, శని, **రేవతి4-**గురు,బుధ **గ్రహములకు జపము,దానము చేయవలెను.**

## మీన రాశి వారి స్వభావము

సన్నముగా,పొట్టిగా నుందురు. సామాన్య దృష్టి ఉండును. త్యాగ వంతులు, ధర్మం తెలిసిన వారు. సినీ రంగము నందు ఉన్నత స్థితికి చేరుకుందురు. అన్ని పనులను తానే చేస్తారు. శతృవులతో జాగ్రత్త అవసరము. శాస్త్రమలందు ప్రావీణ్యత కల్గియందురు. పుస్తక పఠనము ఎక్కువ,పురాణ కథలను ఎక్కువగా విందురు. వాతావరణమునకు తగిన విధముగా మెలగుతారు. నీటి ప్రయాణాలను ఎక్కువగా చేస్తారు. ఏకాగ్రత ఎక్కువ, ధన విషయము లందు ఇతరులను నమ్మరు. స్వార్జితము ఎక్కువ, బంధుమిత్రులును సంపాదిస్తారు.

**మాసవారి ఫలితములు**

ఈ సంవత్సరము గురుడు సెప్టెంబరు 11 వరకు సప్తమస్థానమున సంచారము చేశుభకార్యములాచరిస్తారు తదుపరి అష్టమస్థాన సంచారముచే ఆరోగ్యమునందుమార్పులుసంభవం ఈ సంవత్సరము శని జూన్ 20 వరకు దశమస్థానమున సంచారముచే ఉద్యోగములోప్రమోషన్లు తదుపరి అక్టోబరు 26 వరకు నవమస్థాన సంచారముచే నీడుముకుసంబంధవ్యాధులు తదుపరి దశమస్థానమున సంచారముచే కృషిఫలించును ఈ సంవత్సరము రాహువు ఆగష్టు 17 వరకు షష్టస్థాన సంచారముచే సాహసప్రయత్నాలుఫలించును తదుపరి పంచమస్థాన సంచారముచే పుత్రికలద్వారాసమస్యలు

ఈ సంవత్సరము కేతువు ఆగష్టు 17 వరకు వ్యయస్థాన సంచారముచే పుణ్యకార్యములు ఆచరింతురు తదుపరి లాభస్థాన సంచారముచే విఘ్నులుతొలగిపనులుజరుగును.

**ఏప్రిల్ :** ఆశ్చర్యకరమైన పరిణామాలురాజకీయ రంగాల్లో ఏర్పడుతాయి. సరైన ఆలోచనా నిర్ణయాలు సత్ఫలితాలనిస్తాయి. సోదర,మాతృవర్గం ద్వారా శుభవార్తలు,ఆహ్వానాలు అందుతాయి. బెట్టును ప్రక్కనపెట్టి అన్యవర్గాలవారితో సంబంధాలను బలపరచుకొనుట మంచిది.విలువైన ఆభరణాలు కొనుగోలు చేయవచ్చు. గృహసంబంధ వ్యవహారాలు సానుకూలపడతాయి.**పరిహారాలు:గణపతి అష్టోత్తరము ఉదయసాయంకాలములు చదవండి**

**మే :** క్రొత్త వ్యక్తుల పరిచయాల వల్ల వ్యాపారాభివృద్ధి జరుగుతుంది. ఆరోగ్యపమైన సమస్యల నివారణకోసం ఔషధ సేవనంచేయవలసివచ్చును. కోర్టుసమస్యలను అధిగమించుతారు. తలపెట్టిన వ్యవహారాల్లో విజయంసాధించే క్రమంలో సమస్యలనుఅధిగమిస్తారు. వివిధ కార్యక్రమాలు, ప్రయాణా లతో వినోద, విజ్ఞాన విషయాలు అలరిస్తాయి. **పరిహారాలు : కాలభైరవ అష్టకము రోజూ 8 సార్లు చదవండి**

**జూన్ :** మిత్రుల కలయిక వల్ల ప్రయత్నాలు ఫలిస్తాయి.నూతన అవకాశాలు, ప్రముఖులనుండి సందేశాలు, ఆహ్వానాలు అందుతాయి. అపూర్వ దేవతా దర్శనము.గృహమున కళ్యాణ వైభవము జరుగును.ఆస్తివివాదాలు పరిష్కారమవుతాయి.క్రొత్త వ్యాపారాలు ప్రారంభిస్తారు.క్రయవిక్రయాల ద్వారా ఆదాయం సమకూరుతుంది.ఉద్యోగాల్లో స్థిరత్వాన్ని పొందుతారు. **పరిహారాలు : ప్రతీరోజూ ఏలక్కాయను నీటిలో వేయండి**

**జులై :**ఉన్నత ఆశయాలు,ప్రయత్నాలు ప్రారంభిస్తారు. ప్రింటింగ్, పౌర సంబంధాలకు సంబంధించిన పనులు వేగం పుంజుకుంటాయి. క్రొత్తవాతావరణం ఏర్పడి ఆదాయానికి మార్గ ములు ఏర్పడతాయి ధనార్జనకు అవకాశాలు మెరుగువుతాయి.సన్నిహితులతో క్రొత్త నిర్ణయాలు తీసుకోవడం, ఆచరణలో పెట్టడం ఉంటాయి.ప్రజా ఉద్యమాలలో,ఉత్సవాల్లో ప్రముఖ పాత్రను పోషిస్తారు. **పరిహారాలు : బియ్యందానం చేయండి**

**అగష్టు :**అనుకోకుండా క్రొత్త బాధ్యతలు స్వీకరిస్తారు.విరామంలేకుండా పనిచేయాల్సి రావడం తో శ్రమ,అలసట పెరుగుతాయి. ఉన్నతమైన విలువలను కాపాడడానికి ప్రయత్నిస్తారు. కుటుంబ అభివృద్ధికై ప్రత్యేక కార్యక్రమాలు చేపడతారు.రాబడికి మించిఖర్చులుండడం వలననిర్లిప్తత ఏర్పడుతుంది.ఎంతోకాలంగా పెండింగులో ఉన్న పనులు పూర్తిచేస్తారు. **పరిహారాలు : కందులు దానం చేయండి**

**సెప్టెంబర్ :** గృహంలో మార్పులకు శ్రీకారంచుడతారు. ఖర్చు అధికంగానే ఉన్నా ధైర్యంతో ముందుకు సాగుతారు. పుణ్యక్షేత్ర సందర్శనంతో మానసిక ఉల్లాసాన్ని పొందుతారు. స్పెక్యులేషన్, ఇన్సూరెన్సలలో తగిన రాబడి,అభివృద్ధి ఉంటుంది. స్వయంకృషితో పనులనుసాధించుట ఉత్త మం. కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తాయి. **పరిహారాలు : తెల్లఆవాలు పారుతున్న నీటిలో వేయండి**

**అక్టోబర్ :**ఉన్నత లక్ష్యాలను చేరుకోవడంలో చురుకుగా ఉంటారు. కుటుంబవ్యక్తుల ఆరోగ్యం ఆందోళన కలిగించవచ్చు. నూతనంగా చేసే కార్యక్రమాలకు అధికారుల,ఆత్మీయుల సహాయము లభిస్తుంది. దానధర్మాలకు ధనమును వెచ్చిస్తారు.ఏకాగ్రత పెరుగుతుంది.పనులను సాధించే అవకాశాలు ఉన్నాయి.ఆర్థిక రంగాలలో నూతన అవకాశాలు లభిస్తాయి.**పరిహారాలు : మిరియాల పానకం వారానికి ఒకరోజు పంచండి**

**నవంబర్ :**చేపట్టిన పనులు సత్ఫలితాలనీయడంతో అందరి దృష్టినీ ఆకర్షిస్తారు. ఆధ్యాత్మిక కార్యక్రమాలలోప్రాధాన్యతని సంతరించుకుంటారు. కుటుంబ వ్యక్తులు తమవంతు సహకారాన్ని అందించి అభివృద్ధికి బాటలువేస్తారు.మెరుగైన ఆదాయస్థితి, ఒప్పందాలకు,లావాదేవీలకు అవ కాశం లభిస్తుంది.కోర్టు వ్యవహారాలు,ఆస్తిసంబంధ విషయాలు ఓకొలిక్కి వస్తాయి.లలిత కళలు, పుస్తక పఠనం ద్వారా మనోల్లాసం పొందుతారు. **పరిహారాలు : కుక్కకు తిండి వేయండి లేదా గారెలు పెట్టండి**

**డిసెంబర్ :**విశ్వ ప్రయత్నంచేసి గతంలో నిలచిన మొండి బాకీలు వసూలుచేయగలుగుతారు. శుభకార్య నిర్వహణ,బంధుమిత్రుల కలయిక వల్ల ప్రోత్సాహకర వాతావరణం ఏర్పడుతుంది. క్రొత్త పథకాల అమలుకు శ్రీకారం చుడతారు.ఉన్నత వర్గాలవారి పరిచయాలతో సంతోషాన్ని అనుభవిస్తారు.గౌరవ ప్రతిష్టలు పెరుగుతాయి.ముఖ్యమైన పనులలో విజయాన్ని సాధిస్తారు. **పరిహారాలు : ఇంటి పురోహితునకు పాదపూజచేసి సత్కరించండి**

**జనవరి :**క్రొత్తరంగాల్లో ప్రయత్నాలు ఫలించే సూచనలున్నాయి. కార్యక్రమములు నిర్విఘ్నంగా సాగుతాయి.ఆత్మీయులను కలుసుకుంటారు.ఆర్థిక స్థితి మారుతుంది.ధార్మిక ఆధ్యాత్మిక రంగాల్లో ప్రాధాన్యత పెరుగుతుంది. వ్యవహారాలు సక్రమంగా నిర్వహించుకోవలసివచ్చును.లక్ష్య సాధన కోసం కృషి చేయాల్సి వస్తుంది.మిత్రులతో సంప్రదింపుల వల్ల ప్రశాంతత లభిస్తుంది. ప్రయాణాలు వాయిదా వేయటం మేలు. **పరిహారాలు : రుద్రహోమము చేయించాలి**

**ఫిబ్రవరి :**ఇబ్బందుల నుండి తప్పించుకోగలుగుతారు.క్రొత్తపథకాలను ప్రారంభిస్తారు. వృత్తి,ఉద్యోగాల్లో అనుకోని మార్పులుసంభవిస్తాయి. ఇతరుల సలహాలు పాటించడంమంచిది. విదేశీ ప్రయాణాలు అనుకూలిస్తాయి. అవకాశాలను సద్వినియోగం చేసుకోవడం ఉత్తమం. దైనందిన కార్యక్రమాలు క్రొత్తపద్ధతులను నేర్చుకుంటారు.అవసరాలకు సరిపడా ఆదాయం అందుకోగలు గుతారు. **పరిహారాలు : మంత్రాలయ దర్శనం చేయండి, 121 రూ. సమర్పించండి**

**మార్చి :**పనులను సకాలంలో నిర్వహించడం ద్వారాలాభాలనుపొందుతారు.బ్యాంకుల ద్వారా ఋణసదుపాయం పొందుతారు.వృత్తి,ఉద్యోగాలలో సంతృప్తికరమైన ఫలితాలను పొందు తారు.కృషి కి తగిన ప్రశంసలు,ఫలితాలు అందుకుంటారు. ఆర్థికపరంగా మెరుగైన స్థితిని పొందుతారు. శారీరకశ్రమ పెరగడంవల్ల ఆరోగ్యంమందగిస్తుంది.శుభకార్యాలలో పాల్గొని గుర్తింపు పొందుతారు. **పరిహారాలు : పేదవారికి ఇంట్లో పెళ్లికి సహకరించండి**

# వధూవర గుణమేళికా చక్రం

## ( రాశి, నాడీ, గణ కూట పరిహారములతో)

| వరుడు ▯ | | మేషం | | | వృషభం | | | మిథునం | | | కర్కాటకం | | | సింహం | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వధువు ▯ | | అశ్వి | భ | కృ1 | కృ4 | రోమృ2 | | మృ4 | ఆర్ద్రపున3 | | పున4 | పుష్య | ఆశ్లే | మ | పు | ఉత్త 1 |
| మేషం | అశ్వి | 36 | 33 | 27½ | 18 | 24 | 23½ | 26½ | 26 | 25½ | 30½ | 32 | 27 | 27 | 31 | 28½ |
| | భరణి | 33 | 28 | 27½ | 18 | 25 | 22½ | 25½ | 27 | 24½ | 29½ | 32 | 26 | 26 | 32 | 30½ |
| | కృత్తిక 1 | 27½ | 27½ | 33 | 23 | 16½ | 16 | 19 | 18½ | 19 | 24 | 27½ | 30½ | 29½ | 23½ | 24 |
| వృషభం | కృత్తిక 4 | 18½ | 18½ | 24 | 33 | 26½ | 26 | 23½ | 23 | 23½ | 20½ | 24 | 27 | 24½ | 18½ | 19 |
| | రోహిణి | 25 | 26 | 18 | 26½ | 36 | 33½ | 31 | 31 | 28 | 25 | 27½ | 21½ | 20 | 26 | 24½ |
| | మృగశిర 2 | 24½ | 23½ | 17 | 26 | 33½ | 33 | 30 | 29 | 27½ | 24½ | 27 | 21 | 19½ | 13½ | 22 |
| మిథునం | మృగ 4 | 27½ | 26½ | 20½ | 24½ | 32 | 31½ | 33 | 31½ | 30 | 17 | 19½ | 13½ | 23½ | 27½ | 26 |
| | ఆర్ద్ర | 27 | 28 | 19½ | 24 | 32½ | 30 | 31½ | 36 | 31½ | 18½ | 19 | 15 | 24 | 30 | 29½ |
| | పునర్వ3 | 26½ | 25½ | 20 | 24½ | 29 | 28½ | 30 | 31½ | 33 | 20 | 19½ | 16½ | 22½ | 26½ | 27 |
| కర్కాటకం | పునర్వ4 | 29½ | 28½ | 23 | 19½ | 24 | 23½ | 16 | 17½ | 19 | 33 | 32½ | 29½ | 24½ | 28½ | 29 |
| | పుష్యమి | 31 | 31 | 26½ | 23 | 26½ | 26 | 18½ | 18 | 18½ | 32½ | 36 | 29 | 27 | 31 | 31½ |
| | ఆశ్లేష | 26 | 26 | 29½ | 26 | 21½ | 20 | 12½ | 15 | 15½ | 29½ | 29 | 36 | 31 | 26 | 26½ |
| సింహం | మఖ | 27 | 26 | 29½ | 23½ | 19 | 18½ | 22½ | 23 | 21½ | 25½ | 28 | 32 | 36 | 30 | 26½ |
| | పుబ్బ | 31 | 32 | 23½ | 18 | 25 | 22½ | 26½ | 29 | 25½ | 29½ | 32 | 26 | 30 | 36 | 32½ |
| | ఉత్తర 1 | 28½ | 30½ | 24 | 18 | 23½ | 21 | 25 | 28½ | 26 | 30 | 32½ | 26½ | 26½ | 32½ | 33 |
| కన్య | ఉత్తర 4 | 18 | 19½ | 13 | 24½ | 30 | 27½ | 28 | 31½ | 29 | 24 | 26½ | 20½ | 16½ | 22½ | 23 |
| | హస్త | 19 | 21 | 15½ | 27 | 30½ | 30 | 30½ | 32 | 31½ | 26½ | 29 | 23 | 19 | 23 | 22½ |
| | చిత్త 2 | 13½ | 13½ | 17 | 28½ | 26 | 24½ | 25 | 25½ | 24 | 19 | 20½ | 25½ | 22½ | 17½ | 14 |
| తుల | చిత్త 4 | 23 | 23 | 26½ | 28½ | 26 | 24½ | 26 | 26½ | 25 | 18½ | 20 | 25 | 25½ | 20½ | 17 |
| | స్వాతి | 28½ | 30½ | 25 | 27 | 30½ | 30 | 31½ | 33 | 32½ | 26 | 28½ | 22½ | 22 | 26 | 25½ |
| | విశాఖ 3 | 23 | 23 | 26½ | 28½ | 26 | 24½ | 26 | 26½ | 25 | 18 | 20 | 25 | 25½ | 30½ | 17 |
| వృశ్చికం | విశాఖ 4 | 24½ | 24½ | 28 | 26 | 23½ | 22 | 11½ | 12 | 10½ | 23 | 24½ | 29½ | 29 | 24½ | 21 |
| | అనూ | 33 | 31 | 20½ | 23 | 29 | 28½ | 18 | 16½ | 19 | 31½ | 32 | 28 | 26 | 30 | 29½ |
| | జ్యేష్ఠ | 28 | 27 | 30½ | 28½ | 25 | 23½ | 13 | 12½ | 14 | 26½ | 27 | 33 | 31 | 26½ | 25½ |
| ధనస్సు | మూల | 27 | 27 | 30 | 18 | 15 | 13½ | 22 | 25½ | 22 | 24½ | 25 | 31 | 31 | 26 | 25½ |
| | పూ.షా | 32½ | 33½ | 23 | 10½ | 20 | 18 | 26 | 22½ | 27 | 29½ | 28 | 26 | 26 | 32 | 30½ |
| | ఉ.షా1 | 30 | 31 | 24½ | 12 | 16½ | 14 | 22½ | 26 | 24 | 27 | 29½ | 23½ | 23½ | 29½ | 29 |
| మకరం | ఉ.షా4 | 26 | 27 | 20½ | 25 | 29½ | 27 | 24 | 27½ | 26 | 25½ | 28 | 22 | 13½ | 19½ | 19 |
| | శ్రవణం | 29½ | 28½ | 20 | 24½ | 32 | 31½ | 28½ | 29 | 29½ | 29 | 27½ | 25½ | 17 | 21 | 19½ |
| | ధనిష్ట 2 | 21 | 19 | 24½ | 29 | 25½ | 25 | 22 | 21½ | 21 | 20½ | 22 | 27 | 19½ | 13½ | 12 |
| కుంభం | ధనిష్ట 4 | 20½ | 18½ | 24 | 28½ | 25 | 25½ | 25 | 24½ | 24 | 11½ | 13 | 18 | 24½ | 18½ | 17 |
| | శతభిషం | 25 | 23 | 26½ | 31 | 28½ | 27 | 27½ | 28 | 26½ | 14 | 15½ | 20½ | 27 | 22 | 19½ |
| | పూ.భా3 | 24½ | 24½ | 18 | 22½ | 31 | 28½ | 29 | 30½ | 28 | 15½ | 17 | 12 | 18½ | 24½ | 23 |
| మీనం | పూ.భా4 | 28½ | 28½ | 22 | 17½ | 26 | 23½ | 22½ | 24 | 21½ | 28 | 29½ | 24½ | 24½ | 30½ | 29 |
| | ఉ.భాద్ర | 30 | 23 | 25½ | 21 | 26½ | 24 | 23 | 26½ | 24 | 30½ | 33 | 27 | 27 | 33 | 33½ |
| | రేవతి | 32 | 33 | 26½ | 22 | 27½ | 27 | 26 | 25½ | 28 | 31½ | 34 | 28 | 28 | 32 | 30 |

# వధూవర గుణమేళికా చక్రం

## ( రాశి, నాడీ, గణ కూట పరిహారములతో)

| కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
|---|---|---|---|---|---|---|
| ఉత్త4 హస్త చిత్త2 | చిత్త4 స్వాతి విశా3 | విశా4 అనూ జ్యేష్ఠ | మూలపూ.షా.ఉషా1 | ఉషా4 శ్రవ ధని 2 | ధని 4 శత పూభా. | పూభా4 ఉ.భా రేవతి |
| 16 1/2 18 12 1/2 | 22 27 1/2 22 | 26 1/2 36 30 | 27 1/2 32 1/2 30 | 25 28 1/2 20 | 19 1/2 24 23 1/2 | 29 1/2 31 33 |
| 18 1/2 20 11 1/2 | 21 29 1/2 21 | 25 1/2 33 28 | 26 1/2 33 1/2 31 | 26 27 1/2 18 | 18 21 23 1/2 | 29 1/2 25 34 |
| 12 14 1/2 16 | 25 1/2 24 25 1/2 | 30 27 1/2 32 1/2 | 30 23 24 1/2 | 19 1/2 19 23 1/2 | 23 25 1/2 17 | 28 26 1/2 27 1/2 |
| 24 1/2 27 28 1/2 | 27 1/2 26 27 1/2 | 28 25 1/2 30 1/2 | 18 1/2 11 1/2 13 | 25 24 1/2 29 | 27 1/2 30 21 1/2 | 18 1/2 22 1/2 23 |
| 30 30 1/2 25 | 21 29 1/2 24 | 24 1/2 31 26 | 15 21 17 1/2 | 29 32 25 1/2 | 24 26 1/2 30 | 27 27 1/2 28 1/2 |
| 27 1/2 30 24 1/2 | 23 1/2 29 23 1/2 | 24 30 1/2 25 1/2 | 14 1/2 18 15 | 27 31 1/2 25 | 23 1/2 26 27 1/2 | 24 1/2 25 28 |
| 29 31 1/2 26 | 26 31 1/2 26 | 12 1/2 19 14 | 23 27 23 1/2 | 25 29 1/2 23 | 25 27 1/2 29 | 23 1/2 21 27 |
| 30 30 1/2 25 1/2 | 25 1/2 33 25 1/2 | 12 17 1/2 12 1/2 | 25 1/2 29 27 | 28 1/2 30 22 1/2 | 24 1/2 27 30 1/2 | 25 27 1/2 26 1/2 |
| 30 32 1/2 25 | 25 32 1/2 25 | 11 1/2 20 15 | 23 28 24 1/2 | 26 30 1/2 22 | 24 26 1/2 28 | 22 1/2 25 26 |
| 23 25 1/2 18 | 18 25 18 | 24 32 1/2 27 1/2 | 23 1/2 28 1/2 25 | 23 1/2 28 19 1/2 | 10 1/2 13 14 1/2 | 28 30 1/2 31 1/2 |
| 25 1/2 28 19 1/2 | 19 27 1/2 19 | 25 1/2 33 28 | 24 27 28 1/2 | 27 26 1/2 21 | 12 14 1/2 16 | 29 1/2 33 34 |
| 20 1/2 22 24 1/2 | 24 21 1/2 24 | 30 1/2 29 34 | 30 26 22 1/2 | 21 24 1/2 26 | 17 19 1/2 12 | 25 1/2 28 28 |
| 15 1/2 18 21 1/2 | 24 1/2 21 24 1/2 | 30 1/2 27 32 | 31 26 23 1/2 | 12 1/2 16 18 1/2 | 23 1/2 26 17 1/2 | 25 1/2 28 29 |
| 21 1/2 22 15 1/2 | 18 1/2 25 18 1/2 | 24 1/2 31 26 | 25 32 29 1/2 | 18 1/2 20 12 1/2 | 18 20 23 1/2 | 31 1/2 34 33 |
| 22 21 1/2 12 | 15 24 1/2 15 | 21 30 1/2 25 1/2 | 24 1/2 30 1/2 29 | 18 18 1/2 11 | 16 17 1/2 22 | 30 34 1/2 31 1/2 |
| 33 1/2 32 1/2 23 | 22 31 1/2 22 | 16 1/2 26 21 | 22 28 26 1/2 | 28 28 1/2 21 | 22 23 1/2 28 | 23 1/2 28 25 |
| 32 28 26 1/2 | 25 1/2 36 25 1/2 | 20 27 1/2 14 1/2 | 24 1/2 28 1/2 27 | 28 1/2 31 25 1/2 | 26 1/2 25 30 1/2 | 26 27 1/2 28 1/2 |
| 24 26 1/2 33 | 32 25 1/2 32 | 26 1/2 20 25 | 27 22 21 1/2 | 23 23 1/2 28 | 29 29 1/2 24 | 19 1/2 19 20 |
| 24 26 1/2 33 | 33 26 1/2 33 | 22 15 1/2 20 1/2 | 27 22 21 1/2 | 24 24 1/2 29 | 31 31 1/2 26 | 12 1/2 12 13 |
| 32 1/2 36 26 1/2 | 26 1/2 28 26 1/2 | 15 1/2 23 18 | 24 1/2 28 1/2 27 | 29 1/2 32 26 1/2 | 28 1/2 27 32 1/2 | 19 20 1/2 13 1/2 |
| 24 26 1/2 33 | 33 26 1/2 33 | 22 15 1/2 20 1/2 | 27 22 21 1/2 | 24 24 1/2 29 | 31 31 1/2 26 | 12 1/2 12 13 |
| 16 1/2 20 25 1/2 | 21 14 1/2 21 | 33 26 1/2 31 1/2 | 28 1/2 23 1/2 23 | 19 1/2 20 24 1/2 | 23 1/2 24 18 1/2 | 25 24 1/2 25 1/2 |
| 25 26 19 | 14 1/2 22 14 1/2 | 26 1/2 36 31 | 24 30 28 1/2 | 25 27 1/2 21 | 20 22 1/2 24 | 30 1/2 33 33 |
| 21 13 1/2 24 | 19 1/2 17 19 1/2 | 31 1/2 31 28 | 29 26 24 1/2 | 21 22 1/2 26 | 25 27 1/2 20 | 26 1/2 29 28 |
| 22 23 1/2 26 | 26 23 1/2 26 | 29 1/2 25 30 | 36 29 26 1/2 | 14 1/2 17 19 1/2 | 28 1/2 31 23 1/2 | 24 1/2 27 27 |
| 27 27 20 | 20 27 1/2 20 | 23 1/2 31 26 | 28 36 33 1/2 | 21 1/2 23 14 1/2 | 23 1/2 26 29 1/2 | 30 1/2 32 32 |
| 25 1/2 26 19 1/2 | 19 1/2 26 19 1/2 | 23 29 1/2 24 1/2 | 25 1/2 33 1/2 33 | 21 20 1/2 13 | 22 23 1/2 28 | 29 30 1/2 29 1/2 |
| 28 28 1/2 22 | 22 28 1/2 22 | 20 27 22 | 14 1/2 22 1/2 22 | 33 32 1/2 25 | 22 23 1/2 28 | 29 30 1/2 29 1/2 |
| 28 1/2 31 23 1/2 | 23 1/2 31 23 1/2 | 22 29 1/2 24 1/2 | 18 24 21 1/2 | 32 1/2 36 27 1/2 | 24 1/2 27 28 1/2 | 29 1/2 31 33 |
| 21 25 1/2 28 | 28 25 1/2 28 | 26 1/2 23 28 | 20 1/2 15 1/2 14 | 25 27 1/2 33 | 30 28 1/2 24 | 25 23 1/2 23 1/2 |
| 23 27 1/2 30 | 31 28 1/2 31 | 24 1/2 21 26 | 29 1/2 24 1/2 23 | 23 25 1/2 31 | 33 31 1/2 27 | 16 14 1/2 14 1/2 |
| 25 1/2 26 30 1/2 | 31 1/2 27 31 1/2 | 25 23 1/2 27 1/2 | 32 28 25 1/2 | 25 1/2 28 29 1/2 | 31 1/2 36 26 1/2 | 15 1/2 17 18 |
| 29 31 1/2 24 | 25 32 1/2 25 | 18 1/2 25 20 | 23 1/2 30 1/2 29 | 29 29 1/2 25 | 27 25 1/2 33 | 22 22 1/2 18 1/2 |
| 22 1/2 25 17 1/2 | 10 1/2 181 10 1/2 | 25 31 1/2 26 1/2 | 22 1/2 29 1/2 28 | 28 28 1/2 24 | 15 13 1/2 21 | 33 31 1/2 29 1/2 |
| 27 26 1/2 17 | 10 19 1/2 10 | 24 1/2 34 29 1/2 | 25 31 29 1/2 | 29 1/2 30 22 1/2 | 13 1/2 15 19 1/2 | 31 1/2 28 33 |
| 24 27 1/2 19 | 12 12 1/2 12 | 26 1/2 34 29 | 26 31 28 1/2 | 28 1/2 32 22 1/2 | 13 1/2 17 17 1/2 | 29 1/2 33 28 |



# ప్రయాణ విషయములు



అన్ని దిక్కులకు ఉత్తమ తిధులు : శుక్లపక్ష మందు-బహుళపక్షమందు విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి మరియు శుక్లపక్ష త్రయోదశి, మంచివి. మంచి నక్షత్రములు : అశ్వ, మృగ, పున, పుష్య, హస్త, అనూ, మూల, శ్రవ, ధని, రేవతి. మధ్యమ నక్షత్రములు : రోహిణి, ఉత్తర, ఉ॥షాఢ, ఉ॥భాద్ర, శతభిషం. మిగిలిన నక్షత్రములు ప్రయాణమునకు దోషం.

## ప్రయాణ విషయమై తిథి, నక్షత్ర, వారశూలలు – కూడనవి

1. **తూర్పునకు** : 1,9 తిధులు; శని, సోమవారములు; జ్యేష్ఠ, ధనిష్ఠ నక్షత్రములు; తుల, కుంభలగ్నములు పనికిరావు.
2. **ఆగ్నేయమునకు** : 3,11 తిధులు; గురు, శనివారములు కూడదు. మకర లగ్నం పనికిరాదు.
3. **దక్షిణమునకు** : 5, 13 తిధులు; గురువారం; శ్రవణం, అశ్వని నక్షత్రములు; మీన, వృశ్చిక లగ్నములు మంచివికావు.
4. **నైఋతికి** : 4,12 తిధులు; సోమ, శుక్రవారములు; కర్కాటకలగ్నముకూడదు.
5. **పడమరకు** : 6,14 తిధులు; ఆది, శుక్రవారములు; పుష్యమి, రోహిణి నక్షత్రములు; ధనస్సు, సింహలగ్నములు మంచివికావు.
6. **వాయవ్యమునకు** : 7,15 తిధులు; ఆది, మంగళవారములు; మేష లగ్నము పనికిరావు.
7. **ఉత్తరం** : 2,10 తిధులు; మంగళ, బుధవారములు; హస్త, పుబ్బ నక్షత్రములు, వృషభ, కన్యాలగ్నములు మంచివికావు.
8. **ఈశాన్యం** : 8,30 తిధులు, బుధవారం, మిధునలగ్నము పనికిరావు.

➤ నవమీ ఆదివారం, ఏకాదశీ సోమవారం, పంచమీ మంగళవారం, తదియా బుధవారం, షష్ఠీ గురువారం, అష్టమీ శుక్రవారం, ద్వాదశీ శనివారం ఇవి దగ్ధయోగ ములు గాన ఆ రోజులలో ప్రయాణము చేయరాదు. కష్టనష్టములు, చిక్కులు కలుగును.

## ప్రయాణమునకు చుక్కెదురు దోషము

చుక్కెదురు పోకూడదని శాస్త్రవచనం. శుక్ర నక్షత్రాన్నే చుక్క అని వాడుకలో పిలుస్తుంటారు. ఈ శుక్రనక్షత్రం కొన్ని మాసములు తూర్పు దిక్కునందు, మరికొన్ని మాసములు పశ్చిమదిశయందు నుండగలదు. పంచాంగమును బట్టి చుక్కగల దిక్కు తెలుసుకొని చుక్క తూర్పున యున్న ప్పుడు తూర్పు ఈశాన్య-ఉత్తర-వాయువ్య దిక్కులకు, పశ్చిమదిశయందు న్నప్పుడు పడమర-నైఋతి-దక్షిణ-ఆగ్నేయ దిక్కులకు ప్రయాణమై పోకూడదు. (గమ్యస్థానమున్న దిశయే ప్రధానం) ముఖ్యంగా చుక్కెదురు దోషం గర్భిణీ స్త్రీలకు, బాలింతరాళ్ళకు, శిశువులకు, సంవత్సరంలోపల తల్లి శిశువులకు, యాత్రికులకు (తీర్థయాత్ర చేయువారు) వర్తించగలదు. దైనందిన జీవితంలో చేయవలసిన ప్రయాణములకు ఈ దోషం వర్తించదు. మరియు ఒకే గ్రామమునందు చుక్కెదురు దోషముండదు. వివాహం నిమి త్తంగా వెళ్ళువారికి, యోగులకు, జ్ఞానులకు, రోగార్తులకు ఆకలి కల్గి అన్నా ర్తులై వెళ్ళువారికి, యాచకులకు, దేశోపద్రవములు సంభవించినప్పుడు, రాజభయపీడితులకు, శత్రుపరాజితులై ప్రాణభీతితో వెళ్ళువారికి, ఈ అభిముఖ శుక్రదోషం కల్గదు. మరియు భరద్వాజ, అత్రి, అంగీరస, కాశ్యప, భృగు వశిష్ఠ, గర్గ,గౌతములను ఋషి గోత్రములు గలవారికి చుక్కెదురు దోషం లేదు. వివాహమైన పిమ్మట పదునారు దినములు లోపల భర్తతో సహా భర్త గృహమును ప్రవేశించుటకు ప్రయాణమగు నూతన వధువునకు, పితృగృహమందే రజస్వలయైన కన్యకు ఈ చుక్కెదురు దోషం లేదని కొన్ని గ్రంథములు దెల్పుచున్నవి.

## అష్టసిద్ధాంత, శుభాశుభ, నిత్యకాలములు, ఫలమద్భుతం

| గం॥ని॥ | గం॥ని॥ | ఆదివారం | సోమవారం | మంగళవారం | బుధవారం | గురువారం | శుక్రవారం | శనివారం |
|---|---|---|---|---|---|---|---|---|
| 6-00 | 6-24 | కార్యసిద్ధి | కార్యవిఘ్నం | ధనలాభం | నష్టం | కార్యసిద్ధి | కార్యజయం | భయం |
| 6-24 | 6-48 | లాభం | కార్యసిద్ధి | సుఖం | కార్యనష్టం | క్షేమలాభం | శత్రుభయం | భయం |
| 6-48 | 7-12 | భయం | క్షేమలాభం | భయనష్టం | కార్యసిద్ధి | శత్రువృద్ధి | ధనలాభం | కలహం |
| 7-12 | 7-36 | నష్టం | ధనలాభం | విషబాధ | కార్యలాభం | సుఖం | మిత్రత్వం | ధనలాభం |
| 7-36 | 8-00 | బంధనం | భూలాభం | శుభం | ఆపద | శుభం | కలహం | కార్యసిద్ధి |
| 8-00 | 8-24 | దుఃఖము | దుఃఖము | మిత్రలాభం | భయం | కార్యహాని | కార్యసిద్ధి | వాహనలాభం |
| 8-24 | 8-48 | అభీష్టసిద్ధి | జయం | కార్యసిద్ధి | శుభాశుభం | సుఖం | హానిభయం | కార్యసిద్ధి |
| 8-48 | 9-12 | లాభం | జయం | సర్వబాధ | ఉపద్రవం | జయం | ధైర్యం | అభీష్టసిద్ధి |
| 9-12 | 9-36 | ధనప్రాప్తి | అభీష్టసిద్ధి | శస్త్రపీడ | క్లేశం | వివాదం | కనకలాభం | కార్యహాని |
| 9-36 | 10-00 | క్షేమం | సుఖం | శత్రుబాధ | భయంభయం | కార్యజయం | అర్థలాభం | ప్రాణహాని |
| 10-00 | 10-24 | కార్యసిద్ధి | అభీష్టసిద్ధి | శుభం | కార్యసిద్ధి | శుభం | సుఖసౌఖ్యం | శుభం |
| 10-24 | 10-48 | సుఖం | కార్యలాభం | కార్యనష్టం | కార్యసిద్ధి | క్షేమలాభం | గౌరవం | నష్టం |
| 10-48 | 11-12 | జయం | శత్రుపీడ | శుభాశుభం | ధనలాభం | జయం | వినోదం | ఉపద్రవం |
| 11-12 | 11-36 | కార్యసిద్ధి | రోగపీడ | జంతుభయం | కార్యసిద్ధి | రోగనాశనం | అభీష్టసిద్ధి | కార్యజయం |
| 11-36 | 12-00 | దుఃఖము | శత్రుజయం | అగ్నిభయం | లాభం | కార్యహాని | బంధనం | శుభం |
| 12-00 | 12-24 | అభీష్టసిద్ధి | అభీష్టసిద్ధి | రోగనష్టం | సౌఖ్యలాభం | హాని | సుఖం | ధనలాభం |
| 12-24 | 12-48 | కార్యనష్టం | ధనలాభం | సర్వశుభం | సంతోషం | హాని | సుఖం | ధనలాభం |
| 12-48 | 1-12 | కార్యసిద్ధి | జయం | కార్యసిద్ధి | జయం,క్షేమం | శుభజయం | కార్యశుభం | భయం |
| 1-12 | 1-36 | ఇష్టసిద్ధి | ఆరోగ్యం | కార్యహాని | శాంతి | బంధనం | రోగబాధ | కార్యసిద్ధి |
| 1-36 | 2-00 | ఫలనాశనం | కార్యసిద్ధి | సిద్ధి | ఆపద | శుభాశుభం | దుఃఖము | జయం |
| 2-00 | 2-24 | ద్రవ్యనష్టం | సుఖము | కార్యభంగం | కార్యసిద్ధి | కలహం | కార్యజయం | విద్యాప్రాప్తి |
| 2-24 | 2-48 | కలహం | కార్యనాశం | కార్యహాని | సౌఖ్యశుభం | కార్యజయం | శుభం | వ్యయం |
| 2-48 | 3-12 | సన్మానం | కార్యసిద్ధి | దుఃఖము | సౌఖ్యం | జయం | అనారోగ్యం | రోగం |
| 3-12 | 3-36 | శత్రువృద్ధి | కార్యజయం | కార్యసిద్ధి | విజయం | కార్యభంగం | దుఃఖం | జయం |
| 3-36 | 4-00 | కలహం | శుభంసిద్ధి | ధనక్షయం | అభీష్టసిద్ధి | కార్యనాశనం | బంధనం | భయం |
| 4-00 | 4-24 | రోగం | జయం | శుభం | శుభం | క్షేమలాభం | శత్రుభయం | శత్రుభయం |
| 4-24 | 4-48 | అభీష్టసిద్ధి | కార్యనష్టం | క్షేమం | క్షేమం | శుభం | జయం | శత్రుజయం |
| 4-28 | 5-12 | జయం | ఉద్యోగలాభం | సిద్ధిక్లేశం | సిద్ధిక్లేశం | వివాదం | జయం | శాంతి |
| 5-12 | 5-36 | ప్రయాణనష్టం | యాత్రాశుభం | శుభం | శుభం | మనోభీతి | దుఃఖము | సుఖం |
| 5-36 | 6-00 | ధనలాభం | రోగపీడ | శుభం | వాహనబాధ | జయం | కార్యసిద్ధి | సన్మానం |

నోట్ :- పైన తెలిపిన ఆయా వారములందు సూర్యోదయమునుండి ప్రతి 24 నిమిషములలో తమకు నచ్చినటువంటి కాలములో మధ్యకాలమును నిత్యావసరమైన పనులకు వినియోగించుకొనవచ్చును. ప్రయాణములకు కూడా వర్జ్యములు, తార చూచివాడుకోవలెను.

ముఖ్యగమనిక :- పై పట్టిక సూర్యోదయము 6 గంటలకు అని వ్రాయబడినది. పంచాంగరీత్యా సూర్యోదయం కలిపి చూడవలెను. అదేవిధంగా, రాత్రి కాలములో సూర్యాస్తమయ మాదిగా కలుపుకొని వాడుకొనవలెను.



| జన్మ నామ నక్షత్రము | మీ నక్షత్రములకు శుభముల నిచ్చే నక్షత్రములు,(అన్నికార్యాలకు) |
|---|---|
| 1. అశ్వని | రోహిణి,పుష్యమి, హస్త, స్వాతి,అనూరాధ,జ్యేష్ఠ, పూ.షా. శ్రవ, శతభిషం,ఉత్తరాభాద్ర, రేవతి. |
| 2. భరణి | మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, జ్యేష్ట, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర, రేవతి, అశ్వని. |
| 3. కృత్తిక | రోహిణి, పుష్యమి, మఖ, హస్త స్వాతి, అనూ, మూల, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, అశ్వని, పూర్వాషాఢ. |
| 4. రోహిణి | మృగశిర, పునర్వసు,ఉత్తర, చిత్త,జ్యేష్ట, పూర్వాషాఢ,ఉత్తరాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర, రేవతి. |
| 5. మృగశిర | పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, అశ్వని, రోహిణి. |
| 6. ఆరుద్ర | పునర్వసు, హస్త, చిత్త, జ్యేష్ట, శ్రవణం, పూర్వాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర, రేవతి, రోహిణి, మృగశిర. |
| 7. పునర్వసు | పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, అశ్వని, మృగశిర. |
| 8. పుష్యమి | హస్త, స్వాతి, జ్యేష్ట, పూర్వాషాఢ, శ్రవణం, శతభిషం, పూర్వభాద్ర, రేవతి, రోహిణి, పునర్వసు, |
| 9. ఆశ్లేష | మఖ, ఉత్తర, చిత్త, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర,అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి. |
| 10. మఖ | రోహిణి, పుష్యమి, హస్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ట, పూర్వాషాఢ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి. |
| 11. పుబ్బ | మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, జ్యేష్ట, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర, రేవతి, అశ్వని. |
| 12. ఉత్తర | రోహిణి, పుష్యమి, మఖ, హస్త, స్వాతి, అనూరాధ, మూల, పూర్వాషాఢ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, అశ్వని. |
| 13. హస్త | మృగశిర, పునర్వసు, ఉత్తర, చిత్త, జ్యేష్ట, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర, రేవతి. |
| 14. చిత్త | పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, అశ్వని, రోహిణి. |
| 15. స్వాతి | పునర్వసు, హస్త, చిత్త, జ్యేష్ట, పూర్వాషాఢ, శ్రవణం, ధనిష్ట, పూర్వాభాద్ర, రేవతి, రోహిణి, మృగశిర. |
| 16. విశాఖ | పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, అశ్వని, మృగశిర. |
| 17.అనూరాధ | హస్త, స్వాతి, జ్యేష్ట, పూర్వాషాఢ, శ్రవణం, శతభిషం, పూర్వాభాద్ర, రేవతి, రోహిణి, పునర్వసు. |
| 18. జ్యేష్ట | మఖ, ఉత్తర, చిత్త, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి. |
| 19. మూల | రోహిణి, పుష్యమి, హస్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ట, పూర్వాషాఢ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి. |
| 20.పూర్వాషాఢ | మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, జ్యేష్ట, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర, రేవతి, అశ్వని. |
| 21.ఉత్తరాషాఢ | రోహిణి, పుష్యమి, మఖ, హస్త, స్వాతి, అనూరాధ, మూల, పూర్వా షాఢ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, అశ్వని. |
| 22. శ్రవణం | మృగశిర, పునర్వసు, ఉత్తర, చిత్త, జ్యేష్ట, పూర్వాషాడ, ఉత్తరాషాఢ, ధనిష్ట, పూర్వభాద్ర, రేవతి. |
| 23. ధనిష్ట | పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, అశ్వని, రోహిణి. |
| 24. శతభిషం | పునర్వసు, హస్త, చిత్త, జ్యేష్ట, పూర్వషాఢ, శ్రవణం, ధనిష్ట, పూర్వభాద్ర, రేవతి, రోహిణి, మృగశిర. |
| 25.పూర్వాభాద్ర | పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, అశ్వని, మృగశిర. |
| 26.ఉత్తరాభాద్ర | హస్త, స్వాతి, జ్యేష్ట, పూర్వాషాఢ, శ్రవణం, శతభిషం, పూర్వభాద్ర, రేవతి, రోహిణి, పునర్వసు. |
| 27. రేవతి | మఖ, ఉత్తర, చిత్త, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర,అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి |

**N.B.** కృత్తిక, ఆశ్లేష, పుబ్బ, ఆరుద్ర, భరణి, విశాఖ, ఈ నక్షత్రములకు తారాబలము కుదిరిననూ శుభఫలములు ఇవ్వజాలవు. గాన వర్జించుట ఉత్తమము. పై అనుకూల నక్షత్రములందు ప్రయాణములు, వ్యవసాయము, వ్యాపారము, కోర్టు వ్యవహార ములు, క్రయవిక్రయములు, వివాహాది శుభకార్యములు, పెండ్లి నిర్ణయములు ఇత్యాది సర్వవిషయములందు గ్రహింపదగినవి.

## నవవిధ శాంతులు

దుష్టనక్షత్రములందు స్త్రీలు రజస్వలైనపుడు, గండ నక్షత్రములలో శిశువు జననమైనపుడు, జరుపవలసిన 9 విధముల శాంతులను చూచుకొని తప్పని సరిగా ఆచరించుట మంచిది.

**1. తైలావలోకనము :** ఇనుప పాత్రలోగాని, మట్టిపాత్రలోగాని, తగినంత మంచినూనెపోసి, అందులో నవరత్నములుంచి, ఆ పాత్రను ఒక ఉప్పు గుట్టమీద నుంచి, దోషనక్షత్రజనన శిశువును, ఆ నూనెలో నీడగా నుండునట్లు ఏర్పాటుచేసి, మేనమామ, తండ్రి, మున్నగువారు చూస్తే సమస్త దోషములు పోవును. తదుపరి రుద్రాభిషేకము చేయించేది.

**2. రుద్రాభిషేకము :** నక్షత్రములయొక్క దోష బలమునెంచి ఈ రుద్రాభిషేకము చేయాలి. అనగా 11 రుద్రాల, ఒక్క రుద్రం అనునది తెలుసుకోవాలి. బ్రాహ్మణ పూర్వకశక్తికొలది అభిషేకము ముఖ్యమని గమనించాలి. అన్నశాంతి, దాన జప హోమ శాంతులు ముఖ్యము.

**3. సూర్యనమస్కారములు :** అరుణ మంత్రపాఠమును పఠించుచూ, ఒంటికాలి మీద నిల్చుకొని, సూర్యనమస్కారములు చేస్తే జనన శాంతి దోషము తొలగును. యధాశక్తిగా బ్రాహ్మణులను నియమించుట మంచిది.

**4. మృత్యుంజయ జపము :** ఇయ్యది అపమృత్యుభయ నివారణ కొరకు చేస్తారు. ఇయ్యది శక్తికొలది జపము హోమము, మారేడు పుల్లలతో చేస్తే ఆయుర్దాయము పెరుగును. రోగశాంతి కలుగును.

**5. నక్షత్ర జపము :** ప్రతి నక్షత్ర శాంతి కొరకు 5,9,11 మందిని బ్రాహ్మణులను నియమించి, నక్షత్ర జపము తర్పణ దానము హోమాదులుచేస్తే శిశువు ఆయుర్దాయము పొందును.

**6. నవగ్రహ జపము :** నవగ్రహశాంతికి 9 గురు బ్రాహ్మణులను ఆహ్వానించి, అంగన్యాస, కరన్యాసములతో నవగ్రహ మంత్రములను జపింపజేసేది. ఇయ్యది శుభ దాయకము.

**7. నవగ్రహ హోమము :** నవగ్రహ పుల్లలను-జిల్లేడు, మోదుగ, చంద్ర, ఉత్తరేణు, రావి, మేడి, జమ్మి, గరిక, దర్భ, మున్నగునవి తెచ్చి ఆయా మంత్రములతో హోమము చేస్తే ఆయుర్దాయం కలుగును.

**8. సువాసినీ పూజ :** జనన శాంతులందు శక్తికొలది ముత్తైదులను పసుపు కుంకుమ పండ్లు వస్త్రములు పూవులు తాంబూలములు ఇచ్చి, భోజనాదులు ఇంపారగ బెట్టి ఆశీర్వాదములు పొందితే కుటుంబాభివృద్ధి కలుగును. తదుపరి బ్రాహ్మణభోజనము మంచిది.

**9. శాంతి :** నవాంగములతో సశాస్త్రీయముగా చేసేది శాంతి యగును. నవగ్రహ ములు నవధాన్యములు, నవసమిధలు, నవ ఓషధులతో అభిషేకములు దాన, తర్పణ, జపహోమాదులు, ఇవన్నియునూ శాంతి ప్రకరణముగా భావించేది. ఇలా శాంతి చేస్తే అపమృత్యు భయాదులు తొలగును. సుఖశాంతులు లభించును.

**గృహప్రవేశ సందర్భ చక్రశుద్ధి :** సూర్యసంచార నక్షత్రము లగాయితు, చంద్ర సంచార నక్షత్రము వరకు లెక్కించగా వచ్చు సంఖ్యా ఫలమును గ్రహించేది. ఇటులనే వృషభ చక్రశుద్ధి, కలశచక్ర శుద్ధి చూచుకొనేది.

## తారలకు అధిపతులు - ఫలములు

**1. జన్మతార :** జన్మతారకు అధిపతి సూర్యుడు. నెమలి వాహనము దోషకాలము సుమారు 3 గంటలు. మనస్తాపము, అశాంతి, తలనొప్పి, తిండి, నిద్ర సరిగా లేకపోవుట జరుగును. గుమ్మడి పండు దానము చేసిన కొంత శాంతి కలుగును

**2. సంపత్తార :** సంపత్తారకు అధిపతి బుధుడు. గుఱ్ఱము వాహనము. అన్ని విధముల లాభించుట, ధనాదాయము బాగుండుట, వ్యాపార-వ్యవహార ప్రయత్నములు కలసివచ్చుట, అన్ని విషయములలోను యుక్తిగా వ్యవహరించుట జరుగును.

3. విపత్తార : విపత్తారకు అధిపతి రాహువు. మేక వాహనము. దోషకాలము సుమారు 1గంట. అకారణ కలహములు, హోదాకు తగని వ్యక్తులతో కలసి తిరుగుట, శారీరక సంబంధమైన చికాకులు కలుగును. బెల్లం దానం యివ్వవలెను.

4. క్షేమతార : క్షేమతారకు అధిపతి గురుడు. ఏనుగు వాహనము. దైవ సంబంధమైన కార్యములయందు పాల్గొనుట, నూతన వ్యక్తులను కలియుట, సాంఘికముగా గౌరవ మర్యాదలు, ఆదరణ కలుగును. ధనాదాయము బాగుండును.

5. ప్రత్యక్తార : ప్రత్యక్తారకు అధిపతి కేతువు. కాకి వాహనము దోషకాలము సుమారు 3 గంటలు యుండును. ఇతరుల వలన మాటలుపడుట, ఏ పనీ కలసిరాకపోవుట, ప్రతీ పనికి ఊహించని ఆటంకములు కలుగును. ఉప్పును దానము యివ్వవలెను.

6. సాధనతార : సాధనతారకు అధిపతి చంద్రుడు. నక్క వాహనము. గొప్ప వారితో పరిచయము, మనస్సు ప్రశాంతముగా యుండుట, నూతన స్త్రీలతో పరిచయము.

7. నైధనతార : నైధనతారకు అధిపతి శని, సింహము వాహనము. దోషకాలము సుమారు 3 గంటలు అనవసర విషయములలో కలుగజేసుకొనుట, వాదప్రతి వాదనలు చేయుట. సువర్ణదానము చేయుటవలన కొంత శాంతి కలుగును.

8. మిత్రతార : మిత్రతారకు అధిపతి శుక్రుడు. గరుత్మంతుడు వాహనము. సంగీత సాహిత్యములందు అభిలాష, స్త్రీ సౌఖ్యం, నూతన వ్యక్తులతో పరిచయం, ధనాదాయము బాగుండుట, శాస్త్ర సంబంధమైన చర్చలలో పాల్గొనుట.

9. పరమమైత్రతార : పరమమైత్రతారకు అధిపతి కుజుడు. హంస వామనము. ఊహించని చికాకులు, సాహసకార్యములు చేయుటకు ఉత్సాహపడుట, ఊహించని చికాకులు, సాహసకార్యములు చేయుటకు ఉత్సాహపడుట, వైరాగ్యము, యితరుల మీద కర్ర పెత్తనం చేయుటకు ఆసక్తి చూపుచుండును.

➤ శుభకార్యముల విషయములో ప్రథమ నవకములో జన్మతార, ద్వితీయ నవకములో విపత్తార, తృతీయ నవకములో ప్రత్యక్తార, మూడు నవకములలో నైధనతార విడిచి పెట్టవలయును. ఇతర నవకాలలో ఆ తారలు వచ్చిన దానములు యిచ్చి, దోషకాలము వదిలి పనులు చేసుకొనవచ్చును.

వివాహవిషయములో పెండ్లికుమారునికిగాని, పెండ్లికుమార్తెకుగాని, జన్మతార, విపత్తార, ప్రత్యక్తారలు వచ్చిన దోషశాంతికి జన్మతారకు శాకదానము (గుమ్మడి పండు), విపత్తారకు బెల్లము, ప్రత్యకార్తకు ఉప్పు దానము యిచ్చి వివాహము జరిగించవచ్చును.

